# చతుర

సెప్టెంబరు 2009

రూ.10/-




ఇడ్లీ, దోశ ఇష్టం
126 లో...

విజయరాణి


అనిర్వచనీయం
10 లో...

# కేన్సర్ – CANCER-ల్యుకేమియా BLOOD CANCER వారికి శుభవార్త

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రాస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణకోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంధులు * ఎక్యూట్ లింఫోబ్లాస్టిక్ ల్యుకేమియా * ఎక్యూట్ మైలాయిడ్ ల్యుకేమియా * క్రానిక్ లింఫోసైటిక్ ల్యుకేమియా * క్రానిక్ మైలాయిడ్ ల్యుకేమియా ఎంతో మంది క్యాన్సర్, ల్యుకేమియా వ్యాధిగ్రస్తులను బాగుచేస్తున్నటువంటి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రప్రథమ కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరపి, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్య పద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త

35 సం॥రాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE-II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE-1 DIABETES INSULIN DEPENDENT DIABETES MELLITUS (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషెంట్లకు మానని పుళ్లు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs. 2000/-) TYPE-II COURSE 3 MONTHS. TYPE-1 COURSE 6 MONTHS

## త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహాల్ (Alcohol), గంజాయి (Bang), నల్లమందు (Opium) (Morphine), బీడీ, సిగరెట్, గుట్కా, కల్లు, సారాయి, మైకం పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మాన వచ్చును. లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును (Per Month Rs. 1200/-) Course : 2 Months

## బట్టతల!! Baldness! నెరిసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టురాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడు పోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపకశక్తిని వృద్ధిపరిచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడవుగా పెంచి బట్టతల నెరిసిన జుట్టును శాశ్వతంగా నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100 ml. Rs. 400/-, 250 ml Rs. 900/-, Kerala Herbal Shampoo - 100 ml. Rs. 50/-; 250 ml Rs. 120/-; Herbal Hair Capsules 60 - Rs. 300/- (Per Month Rs. 750) Course: 6 Months.

## సంతానం లేని (Infertillity-Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్నా మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoospermia) వెరికోసిల్ వీన్స్ (Varicoseviens) (Per month Rs. 3000/-) Course 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాకపోవుట, అండవాహికలు మూసుకొనిపోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రోలాక్టిన్ హార్మోన్ ఎక్కువ శాతములో వున్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును (Per Month Rs. 3000/-) Course : 3 months

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్ళు, ముక్కు నుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఐస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200 ml Rs. 300/- (Per month Rs. 600/-) Course: 9 months.

❖ **నూతిని యవ్వన శక్తికి, శీఘ్రస్ఖలనము, హస్తప్రయోగము** (Masturbation): నపుంసకత్వము (impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొనిపోవుట, వృషణములు కుష్కించి పోవుట (Atrophy of Tests), ప్రోస్టేటు గ్రంథి వాపు (Enlarge Prostate) per month Rs. 2000/- Course: 3 months ❖ **సుఖ వ్యాధులు** (Venereal Diseases): వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్రీట్, షాంక్రాయిడ్ (per month Rs. 1000/-) Course: 3 Months ❖ హెర్పిస్ సింప్లెక్స్ (Herpes Simplex) హెర్పిస్ జోష్టర్ (Herpes Zoster) (Per month Rs. 2000/-) Course : 3 months ❖ **స్తనముల పెరుగుదల** జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడ నట్లు చేయును. స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) (Per month Rs. 750/-)Course: 3 months ❖ **స్త్రీలకు పొత్తికడుపు మీద గారిన గీతలు, చారలు పోవుటకు** (Screch Marks): (Per month Rs. 1000/-) Course : 3 months ❖ **మలబద్దకము** (Constipation) (Per month Rs. 3,00/-) Course : 1 month. **గ్యాస్‌ట్రబుల్, ఎసిడిటీ, అల్సర్, అజీర్ణము** (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై ఛాతిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) అంత్రమూలములో పుండు (Duodenal Ulcer) (Per month Rs. 750/-) Course : 3 months. ❖ **రక్తమొలలు, అర్శమొలలు** (Piles) Haemoroids, ఆసనములో చీలిక పుండు (Fissers) (ఆపరేషన్ లేకుండా) (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పులిపిర్లు** (Warts) ఆనెలు (Corns) Rs. 300/- ❖ **సొరి యాసిస్** (Psoriasis) (Per month Rs. 2000/-) Course : 3 months: బొల్లి (Leucoderma), (Per month Rs.2000/-) Course : 3 months ❖ **స్థూలకాయము** (Obesity) : **అధిక బరువును, లావును తగ్గించుటకు** (No Diet, No Exercise) (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **సన్నగా బలహీనముగా ఉండు వారు బరువు పెరిగి, లావుగా కనిపించుటకు, ఎత్తు పెరుగుటకు, (21 సం॥ లోపు వారు)** (Per month Rs. 2000/-) Course: 3 months ❖ **కీళ్ళ వాతము, నొప్పులకు** (Rheumatis arthritis) నరముల వాపు (Neurities) (Backache), **నడుము నొప్పి** (Lumbago), **మెడనొప్పి, వెన్నునొప్పి** (Spinalcord), **తుంటినొప్పి, సయాటిక ఆపరేషన్ లేకుండా** (Per month Rs. 750/-) Course : 3 months ❖ **పక్షవాతము** (Paralysis) (Pe. month Rs. 5000/-) Course : 3 months, ❖ **మూర్ఛ, అపస్మారకము** (Fits) (Epliepsy) పిచ్చి ఉన్మాదము (Mania) హిస్టీరియా (Hysteria) జ్ఞాపకశక్తి తగ్గిపోవుట (Loss of Memory) నిద్రపట్టకపోవుట (Insomnia), (Per month Rs.2000/-) Course : 3 months ❖ **చెవిపోటు** (Ear ache) : **చెవి నుండి చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్‌లేకుండా**, (Per month Rs. 750/-) Course : 3 months ❖ **నత్తిని తగ్గించుటకు** (Stammering) : (Per month Rs. 1500/-) Course : 3 months ❖ **స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు** (Per month Rs. 3,000/-) Course : 1 month

**అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

**HIV/ AIDS, FITS, PSORIASIS, OBESITY, PARALYSIS, HEPATITIS, HERPES.**




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్‌పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్ - 20. ఫోన్: 65526109, 9866155109, 9392355590

Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ. 80/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించు వారు 10 A.M. - 2 P.M. & 5 P.M. - 8 P.M.



సంపుటి -32
సంచిక - 08
సెప్టెంబరు 2009
380వ సంచిక

# చతుర



సేకరణ : కావ్య
ముఖచిత్రం : గౌతమి
ఛాయగ్రాహకుడు : వసంత్
ముఖపత్రాలంకరణ : రాజుయాట



ఆశల పందిరి అల్లుకుంటూ పెళ్లి చేసుకొని, ఓ ముద్దుల బాబుకు జన్మనిచ్చిన ఆమెకు అంతలోనే ఎదురుదెబ్బ! తను ప్రాణంగా చూసుకునే భర్తే గాలికొదిలేసి పోయాడు. నడిసంద్రంలోచిక్కిన ఆమెను ఉద్ధరిస్తానన్న ప్రబుద్ధుడు పెళ్లయిన మరుక్షణం నుంచే నరకాన్ని చూపాడు. ఆమెను, ఆమె బిడ్డను హింసించాడు. అతని బారినుండి తనను, తనబిడ్డను ఆమె ఎలా రక్షించుకుంది? కాలసర్పాల బారిన పడకుండా స్నేహితులు ఆమెను ఎలా కాపాడారు ? ఓ యువతి జీవితంలోని ఎత్తుపల్లాల్ని ఆర్ద్రంగా చిత్రించిన **విజయరాణి** నవల

**అనిర్వచనీయం**

10 వ పేజీలో

బొమ్మలు : భాస్కర్

# కాప్షన్ మీదే - 9



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

ఇదేం కుక్కరా బాబూ!
నేను లోపలికి రాకుండా
గేటు దగ్గరే కాపలా కాస్తోంది!!

–చుండూరు ఉమాబాల,
దోమల్‌గూడ, హైదరాబాద్



## కాప్షన్ మీదే - 8

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

లోపలొకటి, బయటొకటి
మన రాజకీయ నాయకులకు పోటీ

– మొవ్వూరు రామశేషు,
పి. ఆర్. నగర్, హైదరాబాద్

చూస్తే శునక భ్రమణం
మార్జాలానికి మాత్రం మతి భ్రమణం

– గీతా శ్రీనివాస్,
బాలాజీనగర్, నెల్లూరు

నిను వీడని
నీడను నేనే!!

– కందాళై రాఘవాచార్య,
నిజామాబాద్

ఏంటో నా నీడలోనూ
జాగిలం జాడే కనిపిస్తోందేం చెప్మా!!

– నేమాన సుభాష్ చంద్రబోస్,
ఇలిసిపురం, శ్రీకాకుళం

# ఈనాడు కథల పోటీ

మీ అభిమాన దినపత్రిక 'ఈనాడు' కథల పోటీని నిర్వహిస్తోంది.
రచయితలకూ రచయిత్రులకూ ఇదే ఆహ్వానం

**ప్రథమ బహుమతి**
**రూ. 10,000**
**ద్వితీయ బహుమతి(2)**
**రూ. 5,000**
**తృతీయ బహుమతి(2)**
**రూ. 2,500**

రూ. 25,000 విలువైన బహుమతులు

కథలు కేవలం సమస్యల్ని ఏకరువు పెట్టేవిగాకాక మానవ జీవితంలోని ప్రేమానుబంధాలకు అద్దంపట్టేలా ఉండాలి. అందమైన అనుభవాలనూ మధురమైన అనుభూతుల్నీ గిలిగింతలు పెట్టే హాస్యాన్నీ పాఠకులకు పంచుతూ వారి హృదయాలను మీటగలగాలి. యువతను ఆకట్టుకునే ఇతివృత్తాలకూ వారి జీవితాలను చుట్టుకుని ఆహ్లాదంగా సాగే చిలిపి, స్ఫూర్తిదాయక, ప్రేమకథలకూ ప్రాధాన్యం.

**నిబంధనలు:**

- కథ ఫుల్‌స్కేప్ సైజులో 7 పేజీలకు మించకుండా ఉండాలి. పేజీకి కాస్త అటూ ఇటుగా 25 లైన్లు ఉండాలి. కాగితానికి ఒకవైపే రాయాలి.
- కథల రాతప్రతుల్లో ఎక్కడా రచయిత/రచయిత్రి పేరుకానీ, చిరునామా కానీ రాయకూడదు. విడిగా మరో కాగితం మీద కథపేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా, కథ సొంతమే తప్ప అనువాదం/అనుసరణ/కాపీ కాదనీ అముద్రితమనీ హామీపత్రం రాసి కథకు జతపరచాలి. ఆ కథను మరేపత్రిక పరిశీలనార్థం పంపి ఉండకూడదు.
- ఎంపికైన కథలు ఈనాడు ఆదివారం అనుబంధంలో ప్రచురితమవుతాయి. బహుమతి పొందని కథలను సాధారణ ప్రచురణకు స్వీకరించే అధికారం పోటీ నిర్వాహకులకు ఉంటుంది.
- ఎంపిక కాని కథలను తిప్పి పంపడం సాధ్యపడదు.
- ఉత్తమ కథల ఎంపిక, బహుమతుల నిర్ణయంలో న్యాయనిర్ణేతలు, నిర్వాహకులదే తుది నిర్ణయం.

కథలు
మాకు చేరాల్సిన
ఆఖరు తేదీ
**10 అక్టోబరు 2009**

చిరునామా
**కథల పోటీ**
ఆదివారం అనుబంధం
ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ
హైదరాబాద్-82.

# అరుంధతి

'నీకసలు బుద్ధుందా?'

తలొంచుకు నుంచున్నాడతను.

'నేను చెప్పిందేమిటి? నువ్వు చేసిందేమిటి? గ్యారేజి నుంచి సరిగ్గా ఆరూ నలభై ఐదుకల్లా కారుతెచ్చి పబ్లిక్ గార్డెన్స్ ఫస్ట్ గేట్ దగ్గర వెయిట్ చేయమన్నానా?' గర్జించింది అరుంధతి.

అవునన్నట్లు తలూపాడతను.

'మరి ఏడింటిదాకా ఎక్కడ చచ్చావ్? నీ మూలంగా సీఎం ప్రోగ్రామ్ మిస్సయింది' కోపంతో ఆమె ముఖం ఎర్రబడింది.

మౌనం వహించాడతను.

అతని మౌనంతో ఆమెలో మరింత ఆగ్రహం పెల్లుబికింది..

'నీలాంటివాడ్ని డ్రైవర్‌గా పెట్టుకోవడం నాదే బుద్ధితక్కువ. అడ్రస్‌లేని వాడివైనా, దిక్కూమొక్కూ లేనివాడివని జాలిపడి, ఇంట్లోవాళ్లు వద్దన్నా చంకనెక్కించుకున్నందుకు నా చెప్పుతో నేను కొట్టుకోవాలి. ఎన్నాళ్లుగానో ఎదురుచూసిన అవకాశం నీ మూలంగా సర్వనాశనం అయింది. ఛో! ఇక నీ ముఖం నాకు చూపించకు' విసవిసా ఇంట్లోకి వెళ్లిపోయింది అరుంధతి.

కాసేపలాగే నిలబడిపోయాడతను.

మనసు కుతకుత ఉడుకుతోంది. 'దారిలో సాలార్‌గాడు కనబడి చాయ్ తాగిపోవే అనడంతో జరంత లేటైంది గంతకేనా తిట్టుడు? బాప్రే గిట్లయితే కొల్వుసేసుడు చానా కష్టం. ముకం సూపొద్దన్నాక ఈడ్నే వుంటానికి తనేమన్నా ఇజ్జత్ లేనోడా? గింత మాత్రం శాకిరీ సేత్తే యాడైన మస్తు పైసల్దొరుకుతయ్! ఎట్టయినా దొరసానికి బుద్ధిచెప్పాల' అతని ఆలోచనలు సుళ్లుతిరుగుతున్నాయి.

అంతలో మెరుపులాంటి ఐడియా వచ్చింది.. చకచక కారుషెడ్ వైపు నడిచాడు. బ్రేకు వైర్లు తప్పించి ఏమీ ఎరుగనట్లు వెళ్లిపోయాడు. డ్రైవర్ కావడంతో అతన్ని మిగిలిన పనివాళ్లెవరూ అనుమానించలేదు..

అతనికి తెలుసు. సాయంత్రం అమ్మ ఫ్యాక్టరీకి వెళ్లాలి.. తను డ్యూటీకి వెళ్లడు కనుక ఆమే కారుడ్రైవ్ చేసుకుంటూ వెళ్తుంది.. తనను తిట్టినందుకు శిక్ష అనుభవిస్తుంది.. అనుకుంటూ ట్యాంక్‌బండ్ వైపు నడిచాడతను. ఏంచేయాలో తోచడం లేదు! పల్లీలు కొని నములుతూ .. ఆలోచనల్లోకి జారుకున్నాడు.

తనది అసలు హన్మకొండ. అయ్య కల్లు దుకాణం నడిపేవాడు. అమ్మ తన చిన్నప్పుడే కన్నుమూస్తే అయ్య ఇంకో పెళ్లి చేసుకున్నాడు. పసివాడని కూడా చూడకుండా చిన్నమ్మ గొడ్డుచాకిరీ చేయించేది. తిండిపెట్టక ఏడ్పించేది. బడికి పోతానంటే కర్ర విరిగేది. అయ్య దుకాణం పన్లోపడి ఏదీ పట్టించుకునేవాడు కాదు. అయ్యను దుకాణానికి పోనిచ్చి చింతకింద సాంబయ్య కాకను పిల్చుకు రమ్మనేది చిన్నమ్మ. ఎప్పుడూ చిరాగ్గా ఉండే చిన్నమ్మ సాంబయ్య కాక వస్తే చాలు ఉషారైపోయేది. పకపక నవ్వేది. ఇద్దరూ ఒకే మంచం మీద కూర్చుని ముచ్చట్లాడేవారు. ఆళ్లకి చాయ్ ఇచ్చేవాడు తను. సాంబయ్య కాక తనకు అర్ధరూపాయో, రూపాయో తినే బిళ్లలు కొనుక్కోమని ఇచ్చేవాడు.

'ఆడికెందుకు పైసల్? ఆడికి తిండిపెట్టుడే ఎక్వ' అనేది చిన్నమ్మ. తనెంత చాకిరీ చేసినా చిన్నమ్మకు కోపమే! అదెం




దుకో తనకు అర్థం అయ్యేదికాదు.

తనకు పన్నెండు పదమూడేళ్లు వచ్చాక చిన్నమ్మ- సాంబయ్య కాకల గురించి దోస్తులు తన యనకమాలే నవ్వుకోవడం గమనించాడు. వారిద్దరూ అలా ఉండడం తనకూ నచ్చేదికాదు. ఓ రోజు అయ్యతో చెప్పేశాడు.. చిన్నమ్మ జుట్టుపట్టుకుని అయ్య ఈడ్చిఈడ్చి కొట్టాడు.

చిన్నమ్మ దొంగేడ్పులు ఏడ్చింది.. 'నేను తానం చేసేటప్పుడు తడిక కన్నాల్లోంచి నీకొడుకు సూత్తన్నాడయ్యా? తప్పురా ఎదవా అంటే నీకిట్టా నామీన చాడీలు చెబ్తున్నాడు..' అని ఉల్టాపల్టా చేసేసింది.

అయ్య తనవంక ఎర్రగా చూశాడు. దేవుడిమీద ఒట్టేస్తాన్నా ఇన్పించుకోలేదు.. కర్ర తీసుకుని ఎంటపడ్డాడు. భయంతో ఊరిడిచి పారిపోయాడు తను. ఆ ఊళ్లు, ఈ ఊళ్లు తిరిగి హైదరాబాద్ చేరాడు. సికింద్రాబాద్ స్టేషన్‌దగ్గర లగేజీలు మోస్తే ఐదోపదో వచ్చేవి. రైల్వే కూలీలు చూస్తే లొల్లిఅయ్యేది. క్షణక్షణం వాళ్లభయంతో గడిపేవాడు. అక్కడే ఒకరోజు కారుదిగి హడావిడిగా స్టేషన్‌లోకి వెళ్తున్న అమ్మగారి సూట్‌కేసును తను మోసుకెళ్లాడు. పోర్టర్ గొడవచేస్తే అమ్మగారు ఆ కుర్రాడు మా పనోడేనని చెప్పి అతనికి సర్దిచెప్పారు. సూట్‌కేసు మోసినందుకు పది రూపాయలు చేతిలో పెట్టారు. చిల్లరలేదంటే ఉంచుకోమన్నారు. వారంరోజుల తర్వాత అమ్మగారు అదే స్టేషన్‌లో కన్పించారు. గుర్తుపట్టి వాళ్లింటికి తీసుకెళ్లారు.

అయ్యగారు, చినబాబూ ముక్కూ మొహం తెలియనోళ్లని ఎందుకు ఇంట్లో పెట్టుకోవడం అంటున్నా అమ్మగారు పట్టించుకోలేదు. 'బడికెళ్తావా? చదివిస్తాను?' అన్నారు. పనిస్తే చాలన్నాడు తను. అలా ఆరేడేళ్లుగా ఆ ఇంట్లో ఒకడిగా ఉండిపోయాడు. డ్రైవింగ్ నేర్చుకుని అమ్మగారికి డ్రైవర్‌గా మారాడు.. తిండి, బట్టలు అన్నీ ఇచ్చేవారు. పైగా నెలనెలా ఐదువేలు జీతం ఇచ్చేవారు.

'డబ్బు జాగ్రత్తగా దాచుకో! మంచి పిల్లను చూసి పెళ్లి చేస్తా' అనేవారు అమ్మగారు తరచూ నవ్వుతూ.

తనకు ఒంట్లో బాగోని రోజు అమ్మగారు బాధపడడం తను అనేకమార్లు చూశాడు. ఎప్పుడైనా తను నీరసంగా కన్పిస్తే చెయ్యిపట్టుకుని చూసి 'ఒళ్లు వెచ్చగా ఉంది.. పో రెస్టు తీసుకో!' అని తనేకారు నడుపుకుంటూ ఫ్యాక్టరీకి వెళ్లిపోయేవారు. ఫ్యాక్ట



రీకి వెళ్లాక కూడా వంటమనిషి బంగార య్యకు ఫోన్‌చేసి లోకేష్‌కు టాబ్లెట్లు, పాలు, రొట్టె ఇవ్వమని, గంటకోసారి చూడ మనీ చెప్పేది. సాయంత్రం ఇంటికి వచ్చాక ముందు తనగదికే వచ్చి ఎలా ఉందో చూసి వెళ్లేది..

కెవ్.. ఎవరో చంటిపిల్ల గట్టిగా ఏడవ డంతో ఊహల్లోంచి బయటపడి అతను తలతిప్పి చూశాడు లోకేష్.

పసిపిల్లకు పాలిస్తున్న ఓ తల్లి, ఒళ్లోని పాపను విసురుగా భర్త చేతికిస్తూ 'చూడయ్యా నీ కూతురికి పాలివ్వడం నావ ల్లకాదు.. పళ్లు వస్తున్నాయి.. అందుకే పాలు తాగడం మాని కొరుకుతోంది.. రాక్షసి' అంటూ తిడుతోంది.

ఆ భర్త కూతురివంక మురిపెంగా చూస్తున్నాడు.. ఐదు నిముషాలు గడిచాక మళ్లీ ఆ తల్లే నవ్వుతూ పాపను తన ఒడి లోకి తీసుకుని పాలిస్తూ 'నా బంగారు కొండ.. ముత్యాల దండ' అంటోంది.

అతనిలో ఓ కంపన! అమ్మగారు తనను తిట్టడంలో తప్పేముంది? ఆ పాపలాగే ఆమెను తను బాధపెట్టాడు.. పైగా తిట్టిం దని తల్లిలా ఆదరించిన ఆమెను చంపడా నికి చూశాడు. ఆమె కేదైనా అయితే?

ఒళ్లంతా చెమటలు పట్టాయతనికి.. సెల్‌తీసి కుక్ బంగారయ్యకు ఫోన్ చేశాడు. అమ్మగారు ఫ్యాక్టరీకి వెళ్లి పావు గంటైందన్నాడతను. అతనేదో చెప్పబోతుం డగానే ఫోన్ కట్‌చేశాడు.

ఇప్పుడెలా అమ్మగార్ని కాపాడుకోవడం? ఆదరించి అక్కున చేర్చుకున్న నేరానికి ఆమెకు తను మరణశిక్ష వేశాడా? లేదు, ఎలాగైనా ఆమెను రక్షించుకోవాలి? లేచి బస్టాపువైపు పరుగుతీశాడు లోకేష్.

★ ★ ★

గంటన్నర తర్వాత శివార్లలోని ఫ్యాక్టరీ దగ్గరకు చేరుకున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. అమ్మగారి ఛాంబర్ దగ్గరకు వెళ్తుంటే కాళ్లు ఒణికాయి. అక్కడున్న వాచ్‌మన్ సలీంభాయి అమ్మగారింకా రాలే దన్నాడు. 'అదేంటి? ఫ్యాక్టరీకి ఇందాకే బయలుదేరారుగా?' అంటే, 'ఔను.. బయ లుదేరారని ఫోన్‌వచ్చింది.. ఎందుకు రాలేదో?' అన్నాడు అతను మాములుగా. అతనికి అసలు విషయం తెలియదుగదా?

భోరుమన్నాడు లోకేష్. 'అమ్మకు ఎక్కడో యాక్సిడెంటు అయ్యే ఉంటుంది.. నేనే అమ్మను పొట్టనపెట్టుకున్నా..' తల బాదుకుంటూ ఏడుస్తుంటే వాచ్‌మాన్ ఏమీ అర్థంకాక అతనివంక ఆశ్చర్యంగా చూశాడు.

అంతలో ఒక కారు రివ్వున వచ్చి అమ్మ గారి ఛాంబర్ ముందు ఆగింది.. కార్లోంచి అరుంధతి నవ్వుతూ దిగింది, 'సలీం భాయ్.. నాకోసమెవరైనా వచ్చారా?' అంటూ.

అంతలో ఆమె దృష్టి తనవంకే నోరుతె రుచుకుని చూస్తున్న డ్రైవర్ లోకేష్‌పై బడింది.

'లోకేష్ నువ్వేంటి ఇక్కడ? ఏమైంది ఏడుస్తున్నావ్?'

మాట పూర్తికాకుండానే ఆమె పాదాలపై వాలిపోయాడు లోకేష్. ఆమె ఆందోళనగా చూసింది. ఏడుస్తూనే అతను జరిగిందంతా చెప్పాడు..

థాంక్ గాడ్! పెద్దగండం తప్పింది. కొత్తగా నానోకారు కొన్న ఫ్రెండ్ శమంత ట్రయల్‌రన్ వేస్తూ ఇవ్వాళ తనింటికి రా వడం..తనను ఫ్యాక్టరీ దగ్గర దింపుతానని ఎక్కించుకు వచ్చింది.. లేకపోతే?

కారు దిగుతున్న శమంతవంక చూస్తూ మనసులో 'థాంక్స్' చెప్పింది అరుంధతి.

తర్వాత పశ్చాత్తాపంతో కుంగిపోతున్న లోకేష్ వెన్ను నిమిరిందామె ప్రేమగా.

–చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ ఆగస్టు చతురలోని కోలపల్లి ఈశ్వర్ 'వేగుచుక్క' నవల చాలా బాగుంది. 'కులం కుమ్ములాటలెందుకు? సమ సమాజం నిర్మించి హాయిగా సాగిపో ముందుకు' అన్న సూక్ష్మాంశాన్ని పల్లెటూరు నేపథ్యంలో చక్కగా తెలియజేశారు. 'అపార్ట్‌మెంటాలజీ'లో 'లవ్ జంప్' చదువుతుంటే నవ్వాగింది కాదు. 'తెలుగు తావి..ఠీవి విశ్వనాథ' చదివి చాలా విషయాలు తెలుసుకున్నాం. 'కొత్తగాలి'తో అలరిస్తున్న రచయితలకు అభినందనలు.

*–వాడపర్తి వెంకటరమణ, విశాఖపట్నం*

★ 'కొత్తగాలి' కవితలు ఎంతో భావయుక్తంగా, నర్మగర్భంగా ఆకట్టుకుంటున్నాయి. ప్రతినెలా అత్యుత్తమ కవితకు బహుమతి ప్రకటించి కవుల్ని ప్రోత్సహించాలని మనవి.

*–ఎల్.లక్ష్మీనాయుడు, సింహాచలం*

★ 'వేగుచుక్క' నవల మా ఇంటిల్లిపాదికి ఎంతో నచ్చింది. 'కొత్తగాలి'లో చిరుకవితలు కొత్తకవులకు ప్రోత్సాహకరంగా ఉంటున్నాయి. కవితల సంఖ్యను పెంచితే బాగుంటుంది.

*–వెంకట శేషగిరిరావు, వాకాడు*

★ 'వేగుచుక్క' నవలలో కులమత వివక్ష మీద సమగ్రంగా చర్చించారు. రచయిత సామాజికాంశాన్ని చాలా ధైర్యంగా నవలీకరించారు. ఇలాంటివి మరిన్ని నవలలు రావాలి. కొత్తగాలిలో చక్కని కవితలు వస్తున్నాయి.

*– జి.గోపాలకృష్ణ, అరసవిల్లి*

★ 'వేగుచుక్క' విప్లవాత్మకమైన కథాంశం. ముగింపు వాక్యాలు చదువుతుంటే ఒళ్లు పులకరించింది. కోలపల్లి ఈశ్వర్‌కు, నవల ప్రచురించిన 'చతుర'కు అభినందనలు. 'కొత్తగాలి' కవితలు మెదడుకు పదును పెడుతున్నాయి. యర్రంశెట్టి శాయి రచన చదువుతుంటే నవ్వు ఆపుకోలేకపోయాను. మీడియావారికి చురక బాగా అంటించారు.

*– కె.బి.కృష్ణ, వలసపాకల, కాకినాడ*

★ కోలపల్లి ఈశ్వర్ 'వేగుచుక్క' నవల ఛాందస సమాజానికి కనువిప్పు. ప్రచురించిన 'చతుర'కు కృతజ్ఞతలు. 'కొత్తగాలి' యువతకు మంచి అవకాశం.

*– ఎం.రమేష్‌యాదవ్, ఆదిలాబాద్ జిల్లా*

★ గ్రామీణ భారతంలో నేటికీ మార్పురాని కుల వివక్షను, అగ్రవర్ణాల దాష్టీకాలను, దళిత జనుల అవస్థలను కళ్లకు కట్టిన 'వేగుచుక్క' నవల ఆసక్తికరం. చక్కని సందేశంతో మంచి ముగింపు ఇచ్చిన రచయితకు అభినందనలు. విశ్వనాథ వారి విశేషాలు స్ఫూర్తిదాయకం.

*– డి.వి.రమణమూర్తి, అచ్యుతాపురం, కాకినాడ*

★ అంటరానితనం పేరుతో సాగిన కోలపల్లి ఈశ్వర్ నవల 'వేగుచుక్క' కథనం ఎంతగానో ఆకట్టుకుంది. 'కొత్తగాలి' కవితలు మనసును తాకుతున్నాయి. 'తెలుగు తావి... ఠీవి' విశ్వనాథగారి రచనా విశేషాలు ఆసక్తి కలిగించాయి. వింతలు... విశేషాలు తెలిపే విషయ సేకరణ బాగుంది.

*– యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి,*

★ కోలపల్లి ఈశ్వర్ నవల 'వేగుచుక్క' చదువుతుంటే పల్లెటూళ్లలో నేటికీ అస్పృశ్యతలాంటి కుల దురహంకారాలు ఉన్నాయా? అనిపించింది. అలాంటి ఊళ్లు కొన్నయినా చూసే రచయిత రాశారనుకుంటా. గ్రామస్థులలో మార్పు తీసుకురావడానికి యువత చేసిన ప్రయత్నం కొంత ఎక్కువగా ఉన్నట్లనిపించినా బాగానే ఉంది. రచయితకు అభినందనలు.

*– మంచాళ శ్రీలక్ష్మి,*
*సాగర్‌నగర్, విశాఖపట్నం*


చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ -500 082
ఈ మెయిల్ చిరునామా:
chatura@eenadu.net






ఆరేళ్ల తరుణ్‌కు ఏడుపొస్తోంది.. ఎందుకు అంకుల్ చీటికి మాటికి తిడతాడు.. బుగ్గలు బూరెల్లా వాచేలా కొడతాడు.. హాస్టల్‌లో పడేస్తానంటాడు. నిజంగా పడేస్తాడేమో? అమ్మో! అమ్మను వదిలి ఉండడమే? అయినా అమ్మ ఒప్పుకోదులే! అమ్మకు నేనంటే ప్రాణం. అంకుల్ మొదట్లో ఇలా ఉండేవాడు కాదు.. తనను నాన్న అని పిలవమనేవాడు. ఎత్తుకుని బజారుకు తీసుకువెళ్లేవాడు.. చాక్లెట్లు, బొమ్మలు కొనిపెట్టేవాడు. అమ్మనూ ఎంత చక్కగా చూసేవాడని! అలాంటివాడు ఇప్పుడెందుకిలా మారిపోయాడు? లోకంలోని మగాళ్లంతా అఖిల్ అంకుల్లా, ఆడవాళ్లంతా కల్పన ఆంటీలా ఉంటే ఎంత బావుణ్ను? ప్రేమాదరాలు కరవై తపించే ఈ పసివాడి కథ ఏమిటి? అది ఎలాంటి మలుపులు తిరిగింది? అక్షరాక్షరంలో ఆర్ద్రత, ఉత్కంఠల కలయిక విజయరాణి **అనిర్వచనీయం** ఈనెల చతుర కానుక!

"మమ్మీ!" అంటూ పరుగున వచ్చి ఒళ్ళో వాలిన కొడుకు తరుణ్‌ను గుండెకు హత్తుకొంది చందన "ఏమైంది నాన్నా? " అంటూ.

"అంకుల్ కొట్టేడు"

ఎర్రగా కందిన వాడి లేతబుగ్గను చూసి ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"మమ్మీ, నన్ను... హాస్టల్‌కు పంపించేస్తావా? " వెక్కుతూ అడిగేడు.

కొడుకును మరింత గాఢంగా హత్తుకొంది చందన.

"లేదు నాన్నా, నిన్నెక్కడికీ పంపను"

"మరి... మరి... అంకుల్, నాయనమ్మ పంపేయమంటే..." అంటున్న తరుణ్, విసురుగా వచ్చిన మధును చూసి గభాల్న లేచి బయటకు వెళ్ళిపోయాడు.

"వాడి బాబు పొగరు అంతా దిగినట్లుంది. ఒళ్ళు దగ్గర పెట్టుకు వుండమను. ఇంట్లో బంతాటా? చర్మం ఒలిచేస్తాను" వచ్చినంత వేగంగానూ వెళ్లిపోతున్న భర్త వైపు బాధగా చూసింది చందన.

"పెళ్ళి చేశారు. ఓ సరదా లేదు, పాడూ లేదు, దరిద్రుడు మూడ్ పాడు చేశాడు" గదిలోంచి హెచ్చు స్వరంలో అతడి కేకలు వినిపిస్తూనే వున్నాయి. కళ్ళు ఒత్తుకుంది చందన మౌనంగా.

తరుణ్ కళ్ళు అక్షరాల వెంట యాంత్రికంగా పరుగు తీస్తున్నాయి. కానీ బుర్ర కెక్కడం లేదు. తనంటే అతడికి అంత ద్వేషం ఎందుకో ఆ చిన్ని మెదడుకు కారణం అంతుబట్టడం లేదు.

అసలు... 'డాడీ' అనే పిలవాలని మమ్మీ చెప్పింది. చాలా రోజులు అలానే పిలిచాడు. తనకు బొమ్మలు, బిస్కట్లు కొని పెట్టేవాడు.. నాయనమ్మకు ఇష్టం లేదు తను... అంకుల్‌కు కూడా ఇప్పుడు తనంటే ఇష్టం లేదు... తిట్టటం... కొట్టటం.. ఇంకా మంటగానే వున్న లేత బుగ్గను అరచేత్తో పాముకొన్నాడు. దిగులుగా వుంది తరుణ్‌కు.

రాత్రుళ్ళు ఒక్కడే పడుకున్నపుడు ఎంతో భయం వేస్తుంది. మమ్మీ తనకు దూరం అయిపోతుందన్న వేదన.. తన చిన్ని మనసును వేధిస్తున్న ఎన్నో సందేహాలను తల్లి ముందుంచాడు తరుణ్ అనేకసార్లు. కొన్నింటికి తల్లి కళ్ళల్లో చిప్పిల్లే కన్నీటి పొర, కొన్నింటికి మౌనం సమాధానాలయ్యాయి.

పనంతా చేస్కొని వచ్చి కొడుకు పక్కలో కూర్చుంది చందన. అమాయకంగా వున్న ఆ లేత ముఖం చూస్తుంటే, తను తప్పు చేశానన్న భావం చందనను బాధించసాగింది. నెమ్మదిగా తరుణ్ తలనిమిరి, ముద్దుపెట్టుకొని లేచి వెళ్ళింది. అరమోడ్పు కళ్లతో తల్లిని చూశాడు తరుణ్.

మమ్మీ, తనూ ఎన్ని ఆటలు ఆడుకునేవారు! ఎన్ని కథలు చెప్పేది! ఇప్పుడీ ఒంటరితనం ఏమిటి? ఆ పసివాడిపై జాలితో నిద్రాదేవే జోలపాడి నిద్రపుచ్చింది!

★ ★ ★

"నెక్స్ట్" అంటూ గుమ్మం వైపు చూసిన డాక్టర్ గోపాలరావ్ "సర్‌ప్రైజ్! రామ్మా చందూ" అంటూ చేయందించాడు. చిరునవ్వుతో ఎదుటి కుర్చీలో కూలబడిందామె.

"ఇదేమిటమ్మా ఇంత చిక్కేవ్, హెల్తెలా వుంది? అవునూ, తరుణ్‌ని తీస్కురాలేదే? "

"మీతో మాట్లాడ్డానికొచ్చాను బాబాయ్!"

కూల్‌డ్రింక్స్ వచ్చాయి.

"ఇదిగో అమ్మా కాస్త తాగు, ఎండనపడి వచ్చావ్" అంటూ చందనకో బాటిల్ అందించి, తనొకటి తీస్కున్నాడాయన. .

కొంచెం తాగి పక్కన పెట్టేసిన చందన కళ్ళలో తడి ఆయన దృష్టిని దాటిపోలేదు. లేచి చందన తల నిమురుతూ అడిగేడాయన "మధు ఏమైనా అన్నాడామ్మా..." అతడి మాటలు పూర్తి కాకుండానే అరిచే

తుల్లో ముఖం దాచుకొంది ఆమె.

దుఃఖంతో ఎగిసిపడుతున్న ఆమె తలను నిమురుతూ ఉండిపోయేడాయన.

"సారీ బాబాయ్... కంట్రోల్ చేస్కోలేక పోయేను" కర్చీఫ్‌తో కళ్ళూ, ముక్కూ తుడుచుకొంటూ అంది చందన.

"ఇంకెవరికి చెప్పుకుంటావ్ తల్లీ నీ బాధ? చెప్పమ్మా ఏమైంది? "

"మధు నుంచి డైవోర్స్ తీస్కోవాలనుకుంటున్నాను"

"చందూ!" విస్మయంగా అన్నాడాయన.

"జీవితంలో రెండోసారి మోసపోయాను బాబాయ్... మీరంతా నన్ను ఒప్పించి, ఈ పెళ్ళి చేశారు... అందువల్ల నా చిన్నారి తరుణ్ నాకు దూరమైపోతున్నాడు. లేత మనసు గాయపడేలా నిత్యం తిట్లూ, దెబ్బలూ వాడికి. ఇప్పుడు వాణ్ని హాస్టల్‌లో చేర్పించమని గొడవ! తనను హాస్టల్లో ఎక్కడ చేర్పిస్తానో అని తల్లడిల్లిపోతోంది వాడి చిన్నిప్రాణం" కళ్ళు ఒత్తుకొంటూ చెప్పిందామె.

"నేను మధుతో మాట్లాడ్తాను తల్లీ... కొంచెం ఓపిక పట్టు" బతిమలాడుతున్నట్లు అన్నాడాయన.

"ఇక ఆ నరకంలో నా బిడ్డ బాధపడటం భరించలేను... బాబాయ్..."

"భరించక ఎవరి నెత్తినెక్కి కూర్చుందామని? "

గోపాల్రావ్, చందన ఉలిక్కిపడి అటు చూశారు. ఎపుడు వచ్చిందో, గోపాల్రావు భార్య రాజ్యలక్ష్మి నిలబడివుంది.

"రాజ్యం..." గట్టిగా అరిచాడాయన.

"ఇదిగో, మీ అన్న కూతుర్ని వెనకేస్కురాకండి. కాస్త గడ్డిపెట్టి, వెళ్ళి లక్షణంగా కాపురం చేస్కోమనండి. ఆ కుర్ర వెధవ కోసం మళ్ళీ మొగుడ్ని వదిలేస్తుందా? హవ్వ" సాగిపోతూనే వుంది కంకరరాళ్ళు దొర్లిస్తున్నట్లు ఆమె ధోరణి.

"రాజ్యం!" ఆయన కేకకు అదిరిపడింది చందన.

"నా నోరు కాదు మూయించటం. ఈ సంతంతా మనకొద్దు. మొదట ప్రేమించి పెళ్ళాడింది. వాడున్నాడో, చచ్చాడో తెలియదాయె. పోనీకదా, దాని బతుకు దానికేర్పడుతుందని, మళ్ళీ ఎవడి కాళ్ళో పట్టుకు పెళ్ళిచేస్తే అదీ తప్పేనా? "

"రాజ్యం, అది నా అన్న కూతురే... పరాయిది కాదు" బాధగా వారించబోయాడాయన భార్యను.

"నీకేం తెల్సయ్యా, నీ అన్న కూతురి అసలు రంగు? వాళ్ళత్తగారు రాఘవమ్మ కంటతడిపెట్టి మరీ చెప్పుకొంది తన బాధ..."

అదిరిపడి చూసింది చందన. "నేనేం చేశాను పిన్నీ? " తెల్లబోతూ అడిగింది.

"ఏం చేశావా? పిల్లల్ని కంటే నీ మొగుడు ఆ కుర్రవెధవని ఎక్కడ దూరంగా ఉంచుతాడోనని మందులు మాకులూ మింగటం మంచిపనేనా? "

నోట మాట రాలేదు చందనకు. నెమ్మదిగా లేచి నిలబడింది.

"వెళ్తా బాబాయ్.."

"వెళ్ళు. ఇంకెపుడూ రాకు, మమ్మల్నిలా బతకనియ్యి" విసవిసా మెట్లెక్కి వెళ్ళిపోయింది రాజ్యలక్ష్మి.

నిస్సహాయంగా చూస్తున్న చిన్నాన్న గోపాల్రావ్ చేతులు పట్టుకొంది చందన.

"అవును బాబాయ్... అమ్మ, నాన్న, తమ్ముడూ నన్ను ఒంటరిదాన్ని చేసిపోయినప్పట్నుంచీ, నా బాధలు పంచానే గాని, ఏనాడూ చిన్న సంతోషం కూడా మీకు అందించలేని దురదృష్ట జాతకం నాది"

"దాని మాటలకు బాధపడకు తల్లీ..." కళ్ళు ఒత్తుకొంటూ బాధగా అన్నాడాయన.

"మధు కూడ నిన్ను బాధిస్తున్నాడా? " తిరిగి నమ్మలేనట్లు అడిగేడాయన.



"ఈ రెండేళ్ళూ బాగానే ఉన్నారాయన. పిన్ని, ఇపుడు చెప్పిన విషయాన్నే కొడుక్కూ నూరిపోసిందావిడ, పిల్లలు కల గద్దని నేనే మందులూ మింగటం లేదు బాబాయ్.." బాధగా అందామె.

"ఆ తల్లీ కొడుకూ ఆ పసివాడిని తిట్టని తిట్లులేవు బాబాయ్... 'డాడీ డాడీ' అంటూ పిలిస్తే కొట్టటం మొదలెట్టేసరికి ఆ పసివాడు షాక్ తిన్నాడు. మొదట్లో 'డాడీ' అంటూ పరిచయం చేసేసరికి, తరుణ్ మధు చుట్టూ తన చిన్నారి ప్రపంచాన్ని ఆనందంగా అల్లుకున్నాడు. కాని అతడు కసిరి, విసిరి కొడుతుంటే, అల్లాడిపోతున్నాడు" దుఃఖాన్ని దిగమింగుతూ తిరిగి చెప్పింది చందన.

"నేను మధుతో మాట్లాడ్తాను..." చందన తల నిమిరాడు గోపాల్రావ్.

"అందువల్ల ప్రయోజనం ఉందని అనుకోవటం లేదు బాబాయ్ వస్తాను." డోర్ తీస్కుని బయటకు నడిచింది చందన.

తన బిడ్డ సుఖపడాలని చేసిన ప్రయత్నం, ఆమెను మరింతగా వేధిస్తోందా? భగవంతుడా! అనుకొంటూ కుర్చీలో కూలబడ్డాడాయన.

★ ★ ★

"చందనా! త్వరగా కానియ్, కారు వచ్చేస్తుంది" అంటూ టిఫిన్ ప్లేటును దగ్గరకు లాక్కుని కుర్చీలో కూర్చున్నాడు మధు. తనవైపు, చందనవైపు బిక్కముఖంతో చూస్తున్న తరుణ్‌తో అన్నాడతడు, "మేము, అంటే మా ఆఫీసు వాళ్ళందరం కలిసి పిక్‌నిక్‌కు వెళ్తున్నాం. నాయనమ్మను విసిగించకుండా కుదురుగా ఉండు"

దిగులుగా తల్లి ముఖంలోకి చూశాడు తరుణ్.

"ఈరోజు తరుణ్ స్కూల్లో 'పేరెంట్స్ డే' మరచిపోయేరా? " వీలైనంత సహజంగా అంది చందన.

"అయితే, అది పేరెంట్స్‌కు. నీకూ, నాకూ కాదు"

దెబ్బతిన్నట్టు చూసింది అతనివైపు.

"తల్లిగా నా బాధ్యత నాకుందిగా"

"కుదరదు, అందరం ఫ్యామిలీస్‌తో వెళ్లాలనుకున్నాం. వచ్చితీరాలి నువ్వు" మొండిగా అన్నాడు మధు.

"తల్లిగా ఇది నా కనీస బాధ్యతండీ" బతిమలాడుతున్నట్లుంది ఆమె స్వరం.

"నా మాటకు పూచిక పుల్లంత విలువైనా లేదన్నమాట. నువ్వెళ్లరా దరిద్రుడా స్కూల్‌కి, అది రాదు" కసురుకునేసరికి తరుణ్ నెమ్మదిగా అక్కడ్నుంచి వెళ్ళిపోయేడు.

"ఎందుకు మీ కోపం అంతా ఆ పసివాడి మీద చూపిస్తారు? " ఆమె మాట పూర్తికాకుండానే టిఫిన్‌ప్లేటు గోడకు విసిరి కొట్టాడు మధు.

"ఆ దౌర్భాగ్యుడే దానికి ముఖ్యం.. నీ ఖర్మకాలి కట్టుకున్నావ్" అంటూ వచ్చింది అత్తగారు రాఘవమ్మ.

"అత్తయ్యా దయచేసి నా బిడ్డను తిట్టకండి. మేం మాట్లాడుకుంటున్నాంగా" అసహనంగా అంది చందన.

"చూసేవ్రా? నన్ను నోరెత్తవద్దని శాసిస్తోంది" రాఘవమ్మ శోకాలు మొదలెట్టేసరికి బిత్తరపోయింది చందన.

మరుక్షణంలో మధు కొట్టిన చెంపదెబ్బకు వెళ్లి గోడను కొట్టుకుంది ఆమె తల. నుదురు చిట్లి రక్తం కారసాగింది.

"జాగ్రత్త, మా అమ్మను ఏమన్నా అంటే చంపేస్తాను" అంటూ విసురుగా వెళ్ళిపోయాడతడు.. అతని వెనుకే తల్లి!

వరండాలో టిఫిన్ తింటున్న తరుణ్ పరిగెత్తుకొచ్చి "మమ్మీ" అంటూ ఆమెను చుట్టేసి బావురుమన్నాడు. తర్వాత "మా అమ్మను ఎందుకు కొట్టావ్, చంపేస్తాను నిన్ను.. జాగ్రత్త" అంటూ మధువెళ్లిన వైపు ఏడుస్తూ చేతిలోని ప్లేటు విసిరాడు తరుణ్.

వెక్కుతూ పౌడరు డబ్బా తెచ్చి తల్లికి నుదుటిపై తగిలిన గాయానికి అద్దేడు.

"మమ్మీ మనం వెళ్ళిపోదాం మమ్మీ, ఇక్కడ బాగాలేదు" ఏడుస్తూ అంటున్న తరుణ్‌ను దగ్గరకు తీస్కుంది చందన.

మధు అలికిడి లేదు. బయటకు వెళ్ళినట్లున్నాడు. తేలికగా ఊపిరి తీస్కుంది ఆమె. ఇన్నాళ్లు సర్దుకు బతుకుతోంది తను. అతడు ఎలా ప్రవర్తించినా సరే. కానీ తన ఓర్పుకు తరుణ్ మనసు బలికాకూడదు. 'రమేష్' నిష్క్రమణతో సగం జీవితపు సుగంధం ఆవిరి అయిపోయింది. పగిలిన గుండె ముక్కలను చేర్చి అతక ప్రయత్నిస్తుంటే అవి మధు ప్రవర్తనతో, మరింత ముక్కలవుతున్నాయి.

కానీ... తన బిడ్డ దీనికి ఎందుకు ఆహుతి కావాలి? ... వీల్లేదు. అలా జరుగనివ్వదు తను. మళ్ళీ ఎప్పటిలా తనూ, తన తరుణ్ హాయిగా వుండొచ్చు. అక్కడ తమ మధ్య గోడలు కట్టే రాక్షసులుండరు.

"అవును... అలాగే చేస్తా"

ఎంతసేపట్నుంచో రాయిలా కూర్చొని వున్న తల్లి ఒక్కసారి అలా అనేసరికి ఆశ్చర్యంగా చూశాడు తరుణ్.

లేచి బీర్వాలో బట్టలు సూట్‌కేస్‌లో సర్దుకున్న తల్లివైపుచూసి, తన పుస్తకాల బ్యాగ్, బూట్లూ, బట్టలూ తెచ్చి చందన సర్దుతున్న సూట్‌కేస్ దగ్గర పెట్టాడు తరుణ్.

హ్యాండ్‌బ్యాగ్ తీసి చూస్కుంటే మూడు నాలుగు వందలు మాత్రమే వున్నాయి. తరుణ్ తన డిబ్బీ తెచ్చి పగులగొట్టాడు. ఆ శబ్దానికి ఉలిక్కిపడి చూసింది చందన. చిల్లర, నోట్లు తెచ్చి తల్లి బ్యాగ్‌లో పోశాడు.

సూట్‌కేస్ చేతిలోకి తీస్కొని, చుట్టూ చూసిన ఆమె దృష్టి టేబిల్ పైనున్న ఫోటోపై పడింది. ఆమె చూపుననుసరించి చూసిన తరుణ్ పరుగున వెళ్లి ఫ్రేమ్‌లో నుండి ఫోటో తీశాడు. అందులో తనూ, చందన వున్నంతవరకు చించేసి, మధు

## కొత్తగాలి...



**శోకంతో పుట్టింది**
**శ్లోకం...**
**శ్లోకంతో పునీతమైంది**
**లోకం!**

*–లోగిశ లక్ష్మీనాయుడు, సింహాచలం*

వున్న ముక్క బల్లపై పెట్టేశాడు. చందన వారించలేదు. ఆమె మానసిక స్థితి పంజరం విరుచుకు ఎగిరిపోబోతున్న పావురంలా వుంది.

పక్కింటి గుమ్మంలో నిలబడి ఇంట్లో విషయాన్ని నిష్ఠూరాలతో, శాపనార్థాలతో చెప్తున్న రాఘవమ్మ వెళ్లిపోతున్న చందనను, తరుణ్‌ను చూసి పరుగున వచ్చింది.

"ఆగవే... ఆగు... నా కొడుకు లేని టైమ్‌లో దాటేస్తావా? పెట్టెలో ఏం సర్దేశావ్..." సమీపిస్తున్న ఆమెవైపు ఉరిమి చూసింది చందన. ఆ కళ్ళలో తీవ్రతకు వెనక్కు తగ్గింది ఆమె.

★ ★ ★

ఢిల్లీకి పోయే సదర్న్ ఎక్స్‌ప్రెస్ బయల్దేరడానికి పావుగంటే టైమ్ వుండటంతో స్టేషన్ రష్‌గా వుంది. ఆత్రుతగా ఎవరికోసమో చందన కళ్ళు చూస్తున్నాయి.

తరుణ్ ఏవో ప్రశ్నలు అడుగుతుంటే "ప్లీజ్ విసిగించకు తరుణ్!" అందామె టైమ్ చూస్కుంటూ.

తల్లి ముఖంలో విసుగు గమనించిన తరుణ్ మౌనంగా కూర్చున్నాడు సూట్‌కేస్‌పై రెండు చేతులలో గెడ్డం ఆనించి.

పరుగులాంటి నడకతో ట్రైయిన్ పొడుగునా ప్లాట్‌ఫామ్‌పై వెతుకుతున్న మానస చందన కనిపించగానే ఊపిరిపీల్చుకుంది.

"ఏమైందే.. ఏంటీ సడన్ ప్రయాణం? " అంటూ చెయ్యి పట్టుకొని, "అరె, ఈ





## కొత్తగాలి...

**ఓల్డేజీ హోం**
**విరాళాలకొచ్చారు వారు!**
**తన పేరెంట్స్‌నిచ్చాడు**
**ఆ ప్రబుద్ధుడు**

*-యస్.కె.నాగేశ్వరరావు,*
*పెనుగొండ, ప.గో.జిల్లా*

దెబ్బెలా తగిలిందే? " అంటూ తరుణ్ వైపు చూసింది సందేహంగా.

"నా దురదృష్టం నన్ను వెంటాడుతూనే వుంది. అది నా తరుణ్‌ని కూడా కబళించకూడదని మానసా.. " చందన గొంతు గద్గదమైంది.

"అవునూ, అసలు ఏం జరిగింది..." ఏదో అడగబోతున్న మానసను వారించి-

"నేనెలాగోలా వెళ్లితీరాలి. నేనడిగింది తెచ్చేవా? " కదలటానికి సిద్ధంగా వున్న ట్రైన్ వైపు ఆత్రంగా చూస్తూ అడిగింది మానసను.

"తెచ్చేను. కానీ నీ నిర్ణయం బాగాలేదు. ముందు ఇక్కడ్నుంచి వెళ్దాం రా" అంటున్న స్నేహితురాలి కళ్ళలోకి చూసింది.

"..నా మీద ఏమాత్రం ప్రేమ వున్నా, నాతో వస్తున్నావు" అంటూ హ్యాండ్‌బ్యాగ్ లోంచి రెండు వంద రూపాయల నోట్ల కట్టలుతీసి చందన చేతిలో పెట్టి వేగంగా వెళ్లిపోయింది మానస.

నిట్టూరుస్తూ సూట్‌కేస్ తీస్కుని స్టేషన్ బయటకు నడిచింది చందన. తల్లి చెయ్యి పట్టి నడుస్తున్న తరుణ్‌కు ఏం అర్థం కావటం లేదు.

కారు పక్కనే నిలబడివున్న మానస కారు డోర్ తెరిచింది మౌనంగా. చందన యాంత్రికంగా ఎక్కి కూర్చుంది. తరుణ్ కూడా ఎక్కాడు. అతడి చిన్నారి మనసులో ఎన్ని సందేహాలో! ఎన్ని ప్రశ్నలో!

కారు గమ్యం చేరి పోర్టికోలో ఆగింది.

తెల్ల కుక్కపిల్ల పరుగు పరుగున వచ్చి మానస కాళ్ళను చుట్టుకుంటూ అరవసాగింది. "ఆడుకో నాన్నా... జిమ్మీ ఏం అనదు" అంటూ తరుణ్‌కు చెప్పి చందన వైపు చూసింది మానస. పరధ్యానంగా కార్లోనే కూర్చొన్న చందనతో "దిగు..." అంది డోర్ తీస్తూ.

బయటకు వెళ్ళే హడావుడిలో వున్న ఆనంద్ చందనను చూస్తూనే మంద హాసం చేశాడు "బాగున్నారా? " అంటూ.

"ఆc" ఇబ్బందిగా అంది ముఖం మీది గాయానికి కర్చీఫ్ అడ్డుపెట్టుకొంటూ.

"సరే... మనూ, నేవెళ్తా మరి!" మానస చేతిలోంచి కారు తాళాలు అందుకొని వెళ్ళిపోయాడు ఆనంద్.

సోఫాలో కూర్చుంది చందన.

"మా అత్తయ్యగారి పూజయ్యేసరికి రెండు గంటలైనా పడుతుంది.. కూర్చో కాఫీ తెస్తాను" అంటూ వెళ్ళింది మానస.

చందనకు కాఫీ కప్పు అందించి, తరుణ్‌కు పాలగ్లాసు ఇచ్చింది మానస. తరుణ్ తాగుతుంటే నాలుక చప్పరిస్తూ చూస్తోంది జిమ్మీ. "పాలు కావాలా జిమ్మీ? " అంటూ వాటిని ఎక్కడ పోద్దాం అని చూస్తున్న తరుణ్‌ను వారించింది మానస.

"నువ్వు తాగమ్మా, ఇదిగో తెచ్చాగా దానికీ..." అంటూ జిమ్మీ ముందుంచింది పాలప్లేటు.

అది చప్పుడు చేస్తూ పాలు తాగుతుంటే చూసి మురిసిపోతున్న కొడుకును చూసి బాధగా నిట్టూర్చింది చందన.

★ ★ ★

ఇంటి వెనుక భాగంలో పొగడచెట్టు కొమ్మకు వేలాడుతున్న ఉయ్యాల బల్లపై కూర్చున్నారు స్నేహితురాళ్ళిద్దరూ. మానస, చందన చేతిని తన చేతిలోకి తీస్కుని "చెప్తావా ఇప్పుడైనా" అంది.

"కొత్తగా ఏముంది? ఆ తల్లీ కొడుకులు

తరుణ్‌ని అకారణంగా ద్వేషించటం, తిట్టటంతో వాడి పసిమనసు బాధ పడు తోంది. ఇదంతా భరించలేను మానసా" స్నేహితురాలి చేతుల్లో ముఖం దాచుకుని ఏడ్చింది చందన. చందనను వూరడిం చింది మానస.

"ఒక్క సజెషన్. మనం తరుణ్‌ను ఏదైనా మంచి రెసిడెన్షియల్ స్కూల్లో జాయిన్ చేస్తే? " సాలోచనగా అంది.

"వాళ్ళు కోరేదీ అదే" ఉక్రోషంగా అంది చందన.

"నువ్వు కొంచెం ఆలోచించి చూడు చందూ! సమస్యకుగల పరిష్కార మార్గా లలో అది మొదటిది" అంది మానస.

"నాకు రెండోదే ఇష్టం. ఆ స్వార్థపరు లకు సేవలు చేయటానికి, నా బిడ్డను దూరం చేస్కోలేను... ఆ ఆలోచనే భరిం చలేను" బాధగా అంది చందన.

"మరి ఎన్నాళ్ళిలా దూరంగా పోతావ్"

"శాశ్వతంగా!"

"చిన్నపిల్లలా మాట్లాడకు. ప్రాక్టికల్‌గా థింక్ చెయ్యి. మధుతో మాట్లాడదాం"

"నీకు తెలియక ఏదో ఈ సమస్యను సాల్వ్ చేయగలనను కొంటున్నావ్" నుదు టిపై గాయాన్ని చేత్తో రాసుకొంటూ బాధగా అంది. సమయం కాదని మరి మాట్లాడలేదు మానస. మౌనంగా లోప లకు నడిచారిద్దరూ.

★ ★ ★

టాంక్‌బండ్ మీద సాయం సంధ్యాకాం తులు ఆహ్లాదకరంగా వున్నాయి. మారుతీ కారును పార్క్ చేసివచ్చి శ్రీశ్రీ విగ్రహం దగ్గర పచ్చికపై కూర్చున్న చందన సరసన కూర్చుంది మానస.

"తరుణ్ ఇంటి దగ్గర ఆడుకొంటాడులే" అని మానస అన్నప్పుడే అర్థమైంది చందనకు, ఆమె తనతో ఫ్రీగా మాట్లాడటా నికి తీసుకొచ్చిందని.

"చందూ, సమస్యలకు పరిష్కారం వెతు క్కొనే ప్రయత్నంలో మరిన్ని ముళ్ళు బిగించి చిక్కులు వేస్కోకూడదే" నెమ్మ దిగా అంది మానస.

"నాకు మాత్రం చిక్కుముడి వేస్కు కూర్చోవటం ఇష్టమా? " అసహనంగా అంది చందన.

"అదిగో, ఆ చికాకే వద్దు. ఇప్పుడు మధు వస్తాడు ఇక్కడకు..." మానస మాట పూర్తికాకుండానే లేచి నిలబడింది చందన. అంతలో ఆనందూ, మధూ కలిసి రావటంతో చందన చేయిపట్టి లాగి కూర్చోబెట్టింది మానస. ఆనంద్ "ఇప్పుడే వస్తా"నంటూ కారు తాళాలు తీస్కొని వెళ్లి పోయాడు. బుద్ధ పూర్ణిమ రోడ్డులో, ఒక దాని వెంట ఒకటి చీమలదండులా కదలి పోతున్న వాహనాల లైట్ల వైపు చూస్తూ కూర్చుంది చందన.

తన ఎదురుగా వున్న గడ్డిని పీకుతూ కూర్చున్నాడు మధు.

"మధుగారూ, సూటిగా అడుగుతున్నం దుకు ఏమీ అనుకోరుగా? మీరిద్దరూ సుఖంగా వుండాలని కోరుకొనేదాన్ని" మొ దలెట్టింది మానస.

"అడగండి" అన్నాడతను.

"మీ ఇద్దరి మధ్య సమస్య తరుణ్ మాత్రమే అయితే, సర్దుబాటు చేసుకోవచ్చు కదా, అపార్థాలు లేకుండా? "

"వాడిచ్చే ట్రబుల్ ఏమీ లేదండీ!"

"మరి? " ఆశ్చర్యంగా అడిగింది మానస.

"మీ ఫ్రెండ్‌నే అడగండి. ఎవరినో ఉద్ధ రించాలని కాదుగా ఈ పెళ్లి చేస్కుంది? " అతడి ముఖం సీరియస్‌గా మారింది.

"నాకు వున్నది వున్నట్లు మాట్లాడటం అలవాటు. నాకూ నా పిల్లలు కావాలని వుండదా? " తీవ్రంగా ఉంది అతడి స్వరం.

"అది సహజమేగా" అంది ఆమె.

"నాకు పిల్లలు కలిగితే తన కొడుకును







వేరుగా చూస్తానేమోనని భయం..."

"తను అందా అలా?"

"అన్నీ నేనే చెప్పాలా? చెప్పు మీ ఫ్రెండ్‌కి" చందనతో అన్నాడతను.

"అంత చెప్పలేని నేరం నేనేం చేయ లేదు. తరుణ్‌ను కన్నాను గనుక వాడిని చూస్కోవల్సిన బాధ్యత నాకుంది. ఎట్టి పరిస్థితిలోనూ నా బిడ్డను దూరం చేసుకో దలుచుకోలేదు" స్థిరంగా అంది చందన.

"ఆ బోడి వెధవ ఎక్కడుంటే నాకేం? నాకు పిల్లలు లేకుండా చేయొద్దని వేడుకొం టున్నాను" చందనవైపు రెండు చేతులూ జోడించి వ్యంగ్యంగా అన్నాడతడు.

"మానసా... ఈ మాటే మా అత్తగారూ అంటుంది. ఇరుగూ పొరుగూతో అదే గోల ఆవిడ. అటువంటి దురాలోచనే లేదు నాకు నిజంగా. ఆవిడ కంటే తెలియదను కుందాం... చదువు సంధ్యలుండి ఈయన సంస్కారం ఏమైంది?" కంపించింది చందన స్వరం.

"ఎపుడూ మా అమ్మమీదే నీ ఏడుపు, ఏదో మనవలని ఎత్తుకోవాలని ఆశతో.."

మానస ముఖంలోకి చూసింది చందన. "మగజాతికి ఇదో ఎడ్వాంటేజ్. వాళ్ళ లోపం బయట పడదు గనుక, పిల్లలు క లగలేదంటూ ఆడాళ్ళనే బాధిస్తారు..ఛ!"

"ఆ గోపాల్రావ్, నీ దోస్తులు కలిసి ని న్ను నాకు కట్టబెట్టి నా జీవితం నాశనం చేశారు"

"మీరు మీ స్వార్థం కోసం చేస్కోలేదా, వాళ్ళ నెందుకు అంటారు?" ఉక్రోషంగా అడిగింది చందన.

"అబ్బా కాస్త ఆగుతావా!" చందనను వారించింది మానస.

"ఆ తలపొగరే ఈ దశకు తెచ్చింది."

మధు మాటలు కొరడా దెబ్బలుగా తగి లాయి చందన మనసుకు. పళ్ళబిగువున తనను తాను సంబాళించుకొంది.

"చూడండి మధూ! చందన మంచిది. అనుమానాలన్నీ పక్కకు నెట్టి ఇద్దరూ ఎట్లైనా తిరిగిరండి కొన్ని రోజులు"

"సరే. కాని ఒక కండీషన్!" అంటున్న అతడివైపు సూటిగా చూసింది చందన.

"మా అమ్మ, మా తమ్ముడి దగ్గరకు వెళ్తుంది కొన్నాళ్ళు. అలాగే తరుణ్‌గాడిని హాస్టల్‌కు పంపిస్తాను. వాడు కని పించకుండా వుంటేనే ఈవిడగారు మమ్మల్ని ఉద్ధరిస్తుంది కాస్త" అతడి స్వరం స్థిరంగా వుంది.

మానస కంగారుగా చందన ముఖంలోకి చూసింది. ఏదో సామరస్యం కలుగగల దన్న ఆశ నీరుకారిపోయింది.

నీరసంగా నవ్వింది చందన. "చూశావా మనూ... సమస్య తిరిగి తిరిగి అక్కడే ఆగింది. పెళ్ళికి ముందు తరుణ్‌ను తన పెద్ద కొడుకులా చూసుకుంటాననీ అందరి ముందు ప్రగల్భాలు పలికిన పెద్దమనిషి!"

"ఇప్పుడూ అదే చెప్తా. కాని నాకు స్వంత కొడుకు కావాలి. ఎవడి కొడుకునో నెత్తినెక్కించుకోవాల్సిన ఖర్మ నాకు లేదు."

ఏదో చెప్పబోయిన మానస చెయ్యి పట్టుకు ఆపింది చందన.

"మనూ.. మంచి మనసుతో కలపాలను కున్నావుకాని నా ఆత్మాభిమాన్ని కాలరాచి మాట్లాడుతుంటే, ఇంకా నీ ఆశ పోలేదా? మగవాడినన్న అహంకారమది, మీరంతా కలిసి నేనేదో సుఖపడిపోతానని ఈ ఉరి బిగించారు నా గొంతుకు. దయచేసి ఇక నా నిర్ణయాలు నన్ను తీస్కోనివ్వండి"

కళ్ళు ఒత్తుకుంటూలేచింది చందన.

"అంత ఉరి అనుకుంటూ ఎందుకు కలిసి బతకటం? ఎవరి దారి వాళ్ళు చూస్కుంటే మంచిది. గుడ్ బై" అంటూ వెళ్ళిపోతున్న అతన్ని చూస్తూ ఉండిపో యేరు స్నేహితురాళ్లు.

★ ★ ★

# రోగం - చికిత్స



సీన్‌స్వానర్ ప్రపంచంలోని అత్యంత ఎత్తయిన శిఖరం ఎవరెస్ట్‌ని ఎక్కాడు. మే 16, 2002 ఉదయం 9.32కు ఈ ఘనత సాధించాడు. అయితే ఆయనలోని విశేషమేమంటే అతడొక కేన్సర్ రోగి. ఇలాంటిదాన్ని సాధించడం ఇదే మొదటిసారి. అతనికి పదమూడో ఏటే హాడ్‌కిన్స్ డిసీజ్ వచ్చింది. డాక్టర్లు మూడు నెలలకి మించి బతకడని చెప్పారు. కాని అలా జరగలేదు.



తిరిగి పదిహేనవ ఏట ఆస్కిన్స్ సర్కోమా అనే మరో వ్యాధి కూడా వచ్చింది. రెండు వారాలకి మించి బతకడని డాక్టర్లు చెప్పారు. అయినా వారు చెప్పింది ఏదీ జరగలేదు. సీన్ ఒక ఎవరెస్టునేగాక ప్రపంచంలోని ఏడు ఎత్తయిన శిఖరాలని అధిరోహించాడు. ఎవరెస్ట్ మీదకి వెళ్ళినప్పుడు కొందరు కేన్సర్ రోగుల పేర్లు రాసిన జెండాని అక్కడ వారి గౌరవార్థం ప్రతిష్ఠించాడు. అదేవిధంగా దక్షిణ అమెరికాలోని 23 వేల అడుగుల ఎత్తయిన 'అకన్‌కగువా' శిఖరం మీద కూడా ఇలాంటి జెండాని ప్రపంచంలోని కేన్సర్ రోగుల గౌరవార్థం పాతాడు. ప్రపంచమంతా తిరుగుతూ కేన్సర్ రోగుల్లో ఉత్సాహం రేకెత్తించే ఉపన్యాసాలు కూడా సీన్ ఇస్తున్నాడు. ఇతను 'ఇంటర్నేషనల్ స్పిరిట్ ఆఫ్ లైఫ్ ఫౌండేషన్' చీఫ్ స్పోక్స్ పర్సన్‌గా పనిచేస్తున్నాడు. కేన్సర్ క్లైంబర్స్ ఆసోసియేషన్‌లో కూడా సభ్యుడు. మానసిక ఉత్సాహం, ఆశావాదం కొంతవరకూ ప్రాణాంతక రోగాలని అధిగమింపజేస్తాయని తన జీవితం రుజువు చేస్తోందని సీన్‌స్వానర్ తరచూ చెప్తుంటాడు.

కోర్టుకు టైమైపోతోందని హడావుడిగా తయారవుతున్న లాయర్ రాఘవ, ఎవరో క్లైంటు కలవాలంటున్నారని క్లర్క్ చెప్పటంతో "ఇపుడు టైమ్ లేదయ్యా... ఈవెనింగ్ రమ్మను" అంటూ, వచ్చిన వ్యక్తిని చూసి "అరె, చందూ నువ్వా? బాగున్నావా? రాజీ ఎవరొచ్చారో చూడు" అంటూ ఇంట్లోకి ఒక కేక వేశాడు.

"లేదు రాఘవా, స్నేహితురాలిగా రాలేదు. లీగల్‌గా నీ సహాయం కావలసి క్లైంటుగానే వచ్చాను"

"అబ్బ ఉండండీ వస్తున్నా!" అంటూ బయటకు వచ్చిన రాజేశ్వరి "వావ్! ఎంత కాలానికే చందూ!" అంటూ చుట్టేసింది.

"అవును తరుణ్ ఏడీ? మీ ఆయన ఏమంటున్నాడు? " ప్రశ్నల వర్షం కురిపించింది రాజేశ్వరి.

"భార్యామణీ! వచ్చిన మనిషికి మంచి నీళ్ళైనా ఇస్తావా? టైమైందమ్మా, చాలా ఆర్గ్యుమెంట్స్ ఉన్నాయి ఈరోజు. ఉంటావుగా, ఈవెనింగ్ మాట్లాడుకుందాం" అంటూ వెళ్ళిపోయేడు రాఘవ.

రాఘవ, రాజేశ్వరి, మానసా, చందనా, కల్పనా స్కూల్‌మేట్స్. అదే స్నేహం కాలేజీలు వేరైనా, దారులు మారినా కొనసాగుతూనే ఉంది. రాఘవ, రాజేశ్వరి పెద్దలను ఒప్పించి పెళ్ళాడారు.

విషయం విన్న రాజేశ్వరి- "ఇలా అయిందేంటే? నువ్వు సుఖంగా ఉండాలని..." కళ్ళనీళ్ళు పెట్టుకొంది.

పేలవంగా నవ్వింది చందన. "కొన్ని జీవితాలు అంతే. మీరేం చేస్తారు? రెండోసారీ దగాపడ్డాను"

"ప్లీజ్, అలా మాట్లాడకే" అంటూ మానసకు ఫోన్‌చేసి "ఆఖరి ప్రయత్నం ఏమైనా చేద్దామా? " అంది రాజేశ్వరి.







మానస, రాజేశ్వరి కలిసి గోపాల్రావుగారిని కలిసేరు. ఆయన మధును కలిసి మాట్లాడేరు రెండుసార్లు. ఆయన పెద్దరికానికి కూడ విలువనివ్వని మధు, తరుణ్ తన ఇంట్లో ఉండటానికి వీలులేదని తెగేసి చెప్పాడు. అంత ప్రేమగా ఉంటే తీస్కెళ్ళి నెత్తికెక్కించుకోమని చెప్పేడు ఆయనకు.

వాదోపవాదాలు జరిగేక, కోర్టు వారిద్దరికీ ఆరు నెలల టైమిచ్చింది. చందన కుంగిపోయింది, ఇంకా అతడితో సంబంధం కొనసాగవలసి వచ్చినందుకు.

కోర్టు బయటకు వచ్చిన మధు, చందనను సమీపించి, ఓ విషపు నవ్వు నవ్వేడు.

"ఆరు నెలలుంది. నన్ను కాదని, నువ్వూ, నీ కొడుకు ఎలా ఉంటారో చూస్తాను" సవాల్‌చేసి వెళ్ళిపోయాడు.

అప్పుడే నిర్ణయించుకొంది చందన, ఇక తను ఆ ఊళ్ళో ఉండకూడదని.




**ఏ**పి ఎక్స్‌ప్రెస్ న్యూఢిల్లీ స్టేషన్లో ఆగింది. ట్రెయిన్‌దిగి చుట్టూచూసింది చందన. ఎవరినో పంపిస్తున్నానని ఫోన్ చేసింది కల్పన. ఎలా కనుక్కోవటం, అనుకొంటూ తరుణ్ చెయ్యిపట్టుకు ముందుకు నడుస్తోంది.

"మమ్మీ నీ పేరు!" తరుణ్ గట్టిగా అనటంతో అటు చూసింది. ఓవర్‌బ్రిడ్జి ఎంట్రెన్స్ దగ్గర చేతిలో 'చందన' అని రాసిన తెల్లని కాగితం కనిపించేలా పట్టుకొని నిలబడివున్నాడు ఒకతను. వయస్సు ముప్ఫై, ముప్ఫై అయిదు మధ్య వుండవచ్చు. తెల్లటి డ్రెస్ ఇన్ చేస్కున్నాడు. చామనఛాయగా వున్నా కళైన ముఖం.

"హలో, దిసీజ్ మై మమ్స్ నేమ్!" అంటూ ఆ పేపరు అందుకొన్నాడు తరుణ్, అతడివైపు సంశయంగా చూస్తూ, "యూ ఆర్ డాక్టర్ కల్పనాస్..." చందన మాటలకు గలగలా నవ్వేస్తూ, "నేను తెలుగువాడినేనండీ... కల్పన కజిన్‌ను, తనకేదో ఎమర్జన్సీ ఆపరేషన్ తగిలి నన్ను పంపింది, రండి" అంటూ సూట్‌కేస్ అందుకున్నాడతను.

"ఇది నేనే పట్టుకుంటా, చిన్నదేగా!" తన చేతిలో బ్యాగ్ ఇవ్వలేదు తరుణ్.

"ఓకే! హలో హీరో, యువర్ గుడ్ నేమ్?" అన్నాడు తరుణ్‌కు చేయందిస్తూ.

"తరుణ్" అన్నాడు.

మెరూన్ కలర్ సుమో అద్దంలా మెరుస్తోంది. "ఎంత బాగుందోకదూ మమ్మీ!" అంటూ కూర్చున్నాడు తరుణ్.

బ్యాక్‌డోర్ తీయబోయింది చందన.

"అది లాక్ చేసి వుంది, ఫ్రంట్‌కు రండి, సరిపోతుంది" అన్నాడు అతడు.

చందన, తరుణ్ పక్కనే కూర్చుంది ఫ్రంట్ సీట్లో.

చూసిన ప్రతిదాని గురించి తరుణ్ మాట్లాడుతూనే వున్నాడు. వారించబోయిన చందనతో, "పిల్లలు యాక్టివ్‌గానే వుండాలండీ. మనలా బిగిసిపోయికూర్చుంటే ఏం బాగుంటుంది? నువ్వు మాట్లాడు తరుణ్, నేను ఏమీ అనుకోను..." అన్నాడతను మళ్ళీ.

'అతడు తననేగా అన్నాడు. తన పరిస్థితి అతడికేం తెలుసు!' కినుకగా అనుకొంది చందన.

చల్లటి వాతావరణం.

కొంగు భుజాలచుట్టూ లాక్కుందామె.

ఆమె వైపు డోర్‌గ్లాస్ లిఫ్ట్ చేశాడతడు పూర్తిగా, "ఇక్కడ స్వెట్టర్లూ, షాల్‌లూ వుండాలి ఈ రోజులలో" అంటూ.

"వూ" అంది.

"మీరు ఫస్ట్ టైమా, ఢిల్లీకి రావటం?"

"అవునండీ"

"చంపారు పొండి. కల్పన, నన్ను మీకు గైడ్‌ను చేసేస్తుంది" గలగలా నవ్వేడతడు.

అతడు ప్రతిమాటకు, తరచూ అలా నవ్వటం అవసరమా? అనుకొంది.

"అంకుల్, మీరు భలేగా నవ్వుతారు" అంటూ అతడి నవ్వును అనుకరించి నవ్వాడు తరుణ్.

"తరుణ్" కోపంగా చూసిందామె.

"ఐ లైక్ యూ" అంటూ తరుణ్ బుగ్గగిల్లాడతడు. అతడి అతి చనువు, ఆ నవ్వూ చికాకు అనిపిస్తోంది చందనకు.

బొమ్మరిల్లులాంటి ఇంటిముందు ఆగింది కారు. పరుగులాంటి నడకతో వచ్చింది ఒకామె "రండమ్మా" అంటూ.

"సోనీ, పైకి తీస్కెళ్ళు. వెళ్ళండి, కొంచెం పనుంది, నేనోగంటలో వస్తాను" అని మళ్లీ కారెక్కుతున్న అతడివైపు దిగులుగా చూసేడు తరుణ్. అతడి కళ్ళలో మూగ భాష అర్థమైంది.

"వస్తావా తరూ?" అన్నాడు తరుణ్ రియాక్షన్ కోసం చూస్తూ.

"తరుణ్ పైకి రా" వరండా పైనుంచి పిలిచింది చందన.

"ఫర్వాలేదులెండి, తొందరగానే వచ్చేస్తాను, రానివ్వండి. కమాన్ తరూ" అంటూ లెఫ్ట్ డోర్ తెరిచాడతడు.

కదిలిపోయిన కారువైపే చూస్తూ నిట్టూర్చింది చందన.

ఒక్కసారిగా పంజరం వీడిన పక్షిలా వుంది తరుణ్‌కు పాపం.. అనుకొంది.

"సోనీ ఆ ఫ్యాన్ ఆపేద్దూ" అంది చందన సోఫాలో మునగదీసుకుని కూర్చుంటూ.

## కొత్తగాలి...

**పూర్వం విమానంలో వస్తే**
**డాలర్లు తెస్తాడని**
**పూలగుత్తులతో స్వాగతం**
**ఇప్పుడు స్వైన్‌ఫ్లూ తెచ్చేడేమోనని??**

-జి.వి.యస్. ప్రియంవద, శ్రీకాకుళం

ఫ్యాన్‌స్విచ్ ఆఫ్ చేస్తూ "నా పేరు బంగారి అమ్మా, సోనీ కాదు. అఖిల్‌బాబు ఒక్కడే నన్నలా పిలుస్తారు" సిగ్గుపడుతూ చెప్పిందామె. నవ్వింది చందన.

'అఖిలా! తమాషా మనిషిలా వున్నాడు!' అనుకొంది. స్నానం చేసి బంగారి పెట్టిన ఇడ్లీ, కొబ్బరిచట్నీ తినేసరికి ప్రాణం లేచివచ్చినట్లైంది. "కాఫీ చాలా బాగుంది సోనీ... సారీ బంగారీ" అంది సిప్ చేస్తూ.

"ఇది బ్రూ అమ్మా" టీవీ ఏడ్‌ను అనుకరిస్తూ చిలిపిగా కళ్ళు చికిలించింది బంగారి. చాలారోజుల తర్వాత హాయిగా నవ్వుకొంది చందన.

★ ★ ★

సోఫాలోనే వాలి నిద్రపోయిన చందనకు రెండుసార్లు 'లేచి గదిలో మంచంపై పడుకో'మని చెప్పింది బంగారి. మెళకువ వచ్చేసరికి రెండైంది. "లేచారామ్మా భోజనానికి రండి" అంటూ వచ్చింది బంగారి.

"అవును నాకు ఈ షాల్ ఎవరు కప్పారు?" మీదవున్న మెరూన్ కలర్ అందమైన షాల్‌ను తీస్కొంటూ కంగారుగా అడిగింది.

"అఖిల్‌బాబు తెచ్చేరమ్మా, తరుణ్‌బాబు కప్పేడమ్మా" అంటూ డైనింగ్ టేబిల్ దగ్గరకు వెళ్ళిపోయిందామె.

బెడ్‌రూమ్‌లోకి వచ్చేసరికి తరుణ్, అఖిల్ పక్కలో పడుకొని గోరింకలా కబుర్లు చెప్తున్నాడు. 'కొంచెం చనువిస్తే







చాలు, వీడికి ఒళ్ళు తెలియదు' అనుకొంది.

"అరె, మీరు లేచారా? కల్పనకు లేట్ అవుతుందట, మిమ్మల్ని ఫోంచేసి రెస్ట్ తీస్కోమంది నేను తరుణ్ తినేశాం" చెప్పాడు అఖిల్.

ఎరుపు, తెలుపు కలయికతో ఉన్న అందమైన హైనెక్ ఫుల్‌హ్యాండ్స్ స్వెట్టర్ వేస్కున్నాడు తరుణ్, 'అఖిల్ కొన్నాడన్న మాట షాలూ, స్వెట్టరూ'! ఎందుకో ఇబ్బందిగా వుంది ఆమెకు. వడ్డిస్తున్న బంగారి నడిగింది "నువ్వు తినవా బంగారీ? " అని.

"పెద్ద ప్రాణం కదమ్మా. ముందే తినేస్తాను, రెండు మెతుకులు"... మౌనంగా భోజనం ముగించింది చందన.

★ ★ ★

బాల్కనీలో నిలబడింది చందన. అఖిల్ వచ్చి రెండు ప్లాస్టిక్ ఛైర్స్ లాగాడు అక్కడికి, 'కూర్చోండి' అంటూ. చందన కూర్చున్నాక అతడూ కూర్చున్నాడు. టీకప్పు పట్టుకొచ్చి అఖిల్‌కు అందించింది బంగారి. చందనను అడిగితే "వద్దు" అని చెప్పింది.

"ఇలారండి, మీకో మంచిసీన్ చూపిస్తా" పిలిచేడు అఖిల్ కిందకు చూపిస్తూ. లేచికిందకి చూసింది. కింది వాటాలో వాళ్ళు కాబోలు యాభైపైబడి వుండొచ్చు ఇద్దరికీ. ఆవిడను వీల్‌ఛైర్లో తిప్పుతున్నాడతడు.

"ఆవిడ భర్తా? " అడిగింది చందన.

"కాదు. ఆవిడ భార్యా, ఆయన భర్తా"

నవ్వాపుకొంది చందన.

"అదృష్టవంతురాలు కదూ!" అప్రయత్నంగా అంది చందన.

"ఏమిటి కాళ్ళు పోవటమా? "

చిన్నగా నవ్వింది చందన. "ఆ స్థితిలో అలాచేసే భర్త దొరకటం అదృష్టంకాదూ"

"అఫ్‌కోర్స్! కాని ఇది బ్లాక్ అండ్ వైట్ మాత్రమే. రాత్రి ఏడు దాటేక కలర్ పిక్చర్ చూద్దురుగాని". అర్థం కానట్టు చూసి నెమ్మదిగా లేచి లోపలకు వెళ్లిన ఆమె వైపే చూస్తూ వుండిపోయాడు అఖిల్.

★ ★ ★

వేళకాని వేళ హడావుడిగా వచ్చిన ఆనంద్‌ను ఆశ్చర్యంగా చూసింది మానస.

ఏదో అడగబోతున్న మానసతో విసుగ్గా అన్నాడతను "నేను చెప్పేది సీరియస్ మేటర్ మనూ! ఇందాక ఆఫీస్‌కు చందన హజ్‌బెండ్ వచ్చేడు. అతడిపేరు.. ఆ మధు వచ్చేడు."

"ఎందుకట? "

"అర్జంటుగా చందన అడ్రస్ కావాలట"

"ఇచ్చేసేరా? " ఆత్రంగా అడిగింది.

"ఢిల్లీ అని చెప్పాను. నాకేం తెలుసు? "

"ఢిల్లీ అని చెప్పేరు. అది అక్కడైనా సుఖంగా వుండటం మీకిష్టం లేదా? " కంగారుగా అంది మానస.

"చందనకు ఏవో ముఖ్యమైన వస్తువులు అందజేయాలట అతడు, గెడ్డం పెరిగి ముఖం పీక్కుపోయి వున్నాడు పాపం!"

"పాపం, ఏం రోగం అండీ. మాటలతో దాన్ని ఇన్నాళ్లూ చిత్రవధ చేసేడు. విషప్పురుగులా మళ్లీ అక్కడకు చేరాలని!"

"ఏమో మానసా మనకెందుకు వచ్చిన హెడేక్? నా మాట విను. ఇక వాళ్ళ గొడవలో కలుగజేసుకోవద్దు" కొంచెం విసుగ్గానే అన్నాడతను.

మానస అత్తగారు జగదాంబ వచ్చి "అమ్మా మానసా, ఆప్తులకు సహాయం చేయాలి. మంచిదే. కాని తనకుమాలిన ధర్మం వద్దు తల్లీ".

"ఇప్పుడు నేనేం చేసేనత్తయ్యా" బాధగా అంది మానస. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నే చెప్పేది మీ మంచికేనమ్మా. మీ భార్యాభర్తలిద్దరూ చందనను, భర్తనుండి వేరుచేసి ఇంట్లో పెట్టుకొని విడాకులకు

## కొత్తగాలి...

కలిసి కదిలే
స్నేహాలు
నువ్వూ
నీ నీడా!

– డా.మోపిదేవి విజయగోపాల్,
విశాఖపట్నం

కోర్టు కెక్కించారట"

"ఎవరన్నారమ్మా!" అడిగాడు ఆనంద్.

"చందన అత్తింటివాళ్లు ఇందాక ఇరుగు పొరుగును తీస్కొచ్చి ఇక్కడ గొడవచేశారు. మీరిద్దరూ లేరాయె".

మానసకు దుఃఖం ఆగలేదు. మనుషులు ఇంత హీనంగా ప్రవర్తించగలరా!

"మానసా దయచేసి నేచెప్పేది వింటే మంచిది మనిద్దరికీ కూడ. ఇక ఆ వ్యవహారంలో తలదూర్చవద్దు. వదిలేయ్" విసురుగా వెళ్లిపోతున్న ఆనంద్‌ను చూస్తే ఆమె మనసు వికలమైపోయింది.

మౌనంగా దుఃఖిస్తున్న కోడలిని సమీపించింది జగదాంబ. "వూరుకో తల్లీ. ఏం చేస్తాం, అందరి తలరాతలూ ఆ దేవుడు ఎపుడో రాసి పెడతాడు. అవి నువ్వూ, నేనూ తిరిగి రాద్దాం అంటే అవుతుందా చెప్పు? " కోడలి తల నిమురుతూ కళ్ళు ఒత్తుకొంది ఆవిడ.

★ ★ ★

"ఎటైనా బయటకు వెళ్ళివద్దాం రండి" కారు కీస్ పట్టుకు అటు ఇటూ ఊపుతూ అన్నాడు అఖిల్, చందనతో.

"రాలేనండీ, ఇంకా అలసటగా వుంది నాకు" చెప్పింది చందన.

తరుణ్ అతడితో వెళ్లాడు.

మాగజైన్ తిరగేస్తున్న చందన అలికిడికి తలెత్తి చూసింది. చేతిలో బ్రీఫ్‌కేస్, టీపాయ్‌పైపెట్టి తనవైపే చూస్తున్న వ్యక్తిని ఇబ్బందిగా చూసిందామె.

అతడు సోఫాలో కూర్చొని బూట్లు విప్పుకోసాగాడు. బట్టతల, మిలటరీ మీసాలు, తీక్షణంగాచూసే కళ్లూ. యాభై దగ్గరలో వుండవచ్చు.

"బంగారీ!"

కేక వంటి పిలుపు విని చందన అదిరి పడింది. బంగారి పరుగున వచ్చింది. ఆమె ముఖంలో గాభరా.

"వచ్చేశారా అయ్యగారూ" అంటూ అతడి బ్రీఫ్‌కేసూ, బూట్లూ పట్టుకొని కుడివైపుగా వున్న బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిందామె. ఆమెను అనుసరించి వెళ్తూ, వెనుతిరిగి చూసేడతడు చందనవైపు.

ఆచూపే భయాన్ని కలిగించిందామెకు.

"ఆవిడెవరు? " అతడి గొంతు వినిపిస్తోంది చందనకు. బంగారి ఏదో చెప్తుంది నెమ్మదిగా. అతడు ఏదో మాట్లాడ్తున్నాడు.

కల్పన చిన్నపిల్లలా వుంటుంది. ఇతడిది భారీ కాయం. నిట్టూర్చింది చందన. నెమ్మదిగా వెళ్ళి బాల్కనీలో కూర్చుంది.

సన్నగా తుంపర... అడుగుల సవ్వడికి తలెత్తి చూసింది చందన. కాఫీ కప్పుతో వచ్చి రెండోకుర్చీలో కూర్చున్నాడతను.

సర్దుకు కూర్చుందామె.

మందహాసం చేశాడతడు. "అయామ్ మేజర్ వర్మ" అంటూ చేయందించబోతే నమస్కారం పెట్టింది. "చందన, కల్పన ఫ్రెండునండీ" అంటూ. "మీరు హైదరాబాద్ నుండి వచ్చేరా? అక్కడ నాకు మంచి ఫ్రెండ్సున్నారు. అవును, కల్పన వచ్చే టైమైందిలెండి" వాచ్ చూస్కుంటూ అన్నాడు. "అసలు డాక్టర్ని పెళ్ళి చేస్కోవటమే పొరపాటంటాను. ఇదిగో, జీవితమంతా ఎదురు చూపులే సరిపోతాయి!" చందన అభిప్రాయం కోసం చూశాడతడు.

నవ్వి వూరుకొంది చందన.

"కల్పనేమో మిలటరీ వాడిని చేస్కోవటమే పెద్ద టెన్షన్ అంటుంది" తిరిగి

అన్నాడతడు నవ్వేస్తూ.

"కాదామరి? " అంటూ వచ్చింది కల్పన. "చందూ, వెరీ సారీ.. ఎమర్జెన్సీ ఆపరేషనూ, తర్వాత కాన్ఫరెన్సూ గొడవా..ఇప్పటికి బయట పడగలిగేను" కుర్చీ వెనుక నుంచి చందన మెడ చుట్టూ చేతులు వేసి తలపై ముద్దు పెట్టుకొంది కల్పన.

"ఓహో, మీ ఫ్రెండ్‌కైతే అంత కన్సర్నా? మేమూ ఇపుడే వచ్చేమండీ క్యాంపు నుంచి. మాకేం లేవా? " అతడు సినిమా ఫక్కీలో అనేసరికి కల్పన ముఖం సీరియస్‌గా మారింది.

"స్నానం చేసి వస్తా చందూ" అంటూ వెళ్లిపోయింది. వర్మ లోనికి వెళ్ళిపోయేడు.

★ ★ ★

మెరుపులూ, ఉరుములతో వాన మొదలయ్యేసరికి, పదేపదే గేటువైపు చూస్తోంది చందన. అఖిల్‌తో వెళ్ళిన తరుణ్ ఇంకా రాలేదని వర్రీగా వుందామెకు.

అంతలో కారు హార్న్ విని బాల్కనీలోకి వెళ్ళి చూసింది. అఖిల్, తరుణ్ కారు గారేజీలో పెట్టి మెట్లవైపు వచ్చేరు పరుగున. పూర్తిగా తడిసిపోయారిద్దరూ.

"అయ్యో! తల బాగా తడిసింది" అంటూ కంగారుగా టవల్ తెచ్చి వణుకుతున్న తరుణ్ తల తుడవసాగింది చందన.

"ముందు డ్రెస్ ఛేంజ్ చేస్కో తరూ" అంటూ లోపలికి వెళ్ళిపోయేడతడు.

సూట్‌కేస్ తెరిచి తరుణ్‌కు వేరే డ్రెస్, స్వెట్టరూ తెచ్చి మార్చింది ఆమె.

స్నానం చేసి వచ్చింది కల్పన.

"తరుణ్ రామ్మా!" అంటూ తరుణ్ చెయ్యి పట్టుకున్న కల్పన, ఉలిక్కిపడి "బాబూ! ఒంట్లో బాగాలేదా? " అడిగింది.

రిఫ్రెష్ అయి తెల్లటి లాల్చీ పైజామా వేస్కున్నాడు అఖిల్. టర్కీ టవల్‌తో తల తుడుచుకొంటూ "కొంచెం తడిస్తేనే ఇంత హడావుడా? " ఆశ్చర్యంగా అడిగేడు.

"వాడికి సైనస్" అంది చందన.

"తడవకపోదుం. అప్నాఘర్ దగ్గర వర్షం ఆగకుండా కురుస్తుంటే, తడుస్తూనే పార్కింగ్ దగ్గరకెళ్లాల్సి వచ్చింది.. సారీ "

"మమ్మీ చలి, తలనొప్పి" అంటున్న తరుణ్‌ను దగ్గరగా తీస్కొంది చందన.

"నువ్వేం వర్రీకాకు. బంగారీ రగ్గు తీస్కురా" అని రగ్గు కప్పి పడుకోబెట్టింది కల్పన తరుణ్‌ను. తర్వాత మెడికల్ కిట్ తెరిచి ఇంజెక్షన్ చేసింది.

తను తీస్కెళ్ళటం వల్ల ఇలా అయిందని గిల్టీగా అనిపించింది అఖిల్‌కు. తరుణ్ బెడ్‌కు దగ్గరగా కుర్చీ లాక్కొని కూర్చున్నాడు కాఫీ సిప్ చేస్తూ.

"అరగంట ఆగి ఈ టాబ్లెట్ వెయ్" టాబ్లెట్ చందన చేతిలో పెట్టింది కల్పన. "ఏం వర్రీ లేదు. హివిల్ బి ఆల్‌రైట్ బై మార్నింగ్.. కాసేపు నడుంవాల్చి మళ్ళీ చూస్తా" అంటూ వెళ్ళింది కల్పన.

"మీరు కూడా వెళ్ళండి. నేనున్నానుగా" అఖిల్‌తో అంది చందన.

"నా దగ్గరే వుండు మమ్మీ" అంటూ భారమైన కనురెప్పలను బలవంతంగా ఎత్తిచూస్తూ తల్లి చెయ్యి పట్టుకున్నాడు తరుణ్. అతడి నుదుటిపై నెమ్మదిగా చేత్తో సవరిస్తూ కూర్చుంది చందన.

★ ★ ★

డోర్‌పై చిన్నగా కొట్టి లోపలకు వచ్చాడు అఖిల్. "ఎలా వుందీ? " అంటూ తరుణ్ నుదుటిపై చెయ్యివేసి చూశాడు.

"టెంపరేచర్ తగ్గింది. తరుణ్ దగ్గర నేనుంటాను, మీరెళ్ళి పడుకోండి"

చందన ఇబ్బందిపడటం చూసి, అవసరమైతే పిలవండంటూ వెళ్ళిపోయాడతడు.

అంతలో కల్పన వచ్చి తరుణ్ చెయ్యి పట్టుకు చూసి "హమ్మయ్య తగ్గింది!" అంది.

"నువ్వు వచ్చాక కాసేపు హాయిగా







కూర్చొని మాట్లాడుకోనేలేదు" అంది చందన పక్కన కూర్చొంటూ. "నీకు అంతా కంఫర్ట్‌బుల్‌గా వుంది కదా!" చందన చేతిని చేతులలోకి తీస్కొంటూ అడిగింది.

"పాపం నీకూ, అఖిల్‌గార్కి మాతోనే సరిపోతుంది. మాకు కంఫర్టే"

"ఛ! అఖిల్ అలా అనుకొనే వ్యక్తికాదు, ఇష్టపడితే ప్రాణం ఇస్తాడు. పాపం వాడికే సుఖం లేకుండా పోయింది!" కల్పన మాటల్లో ఏదో బాధ వ్యక్తమైంది.

'ఏమైందో అతడి లైఫ్‌కు!' తెలుసుకోవాలనిపించలేదు.

"ఫోనమ్మా" బంగారి కార్డ్‌లెస్ తెచ్చి ఇచ్చింది.

మానస స్వరం వింటూనే కల్పన ముఖం వికసించింది. తను మాట్లాడి "ఇదిగో మాట్లాడు" అంటూ ఫోన్ చందనకందించింది. మానసకు తనను, తరుణ్‌ను కల్పన ఎలా చూస్తోందో చెప్పింది చందన. "అంకుల్‌కు రేపు ఫోను చేస్తానని చెప్పు..." అంటూ ఫోనిచ్చేసింది. అంతలో తలుపుమీద శబ్దం అవటంతో వెళ్ళి తలుపు తీసింది కల్పన.

"తరుణ్‌కెలా వుంది? " ఆత్రంగా అడిగాడు అఖిల్!! .

"తగ్గింది. నువ్వేంటి నిద్రపోలేదా? రా" అంటూ అడ్డు తప్పుకుంది ఆమె.

"మాటలు వినిపిస్తున్నాయి. తరుణ్‌కెలా వుందో అనిపించింది"

తరుణ్ నుదుటిపై చెయ్యివేసి చూసేడు అఖిల్. అటు ఇటూ కదిలి నెమ్మదిగా కళ్ళువిప్పి చూసేడు తరుణ్.

జగ్గులోంచి నీళ్లుతెచ్చి ఇచ్చింది చందన.

"ఉహూ. కూల్‌డ్రింక్ కావాలి" నీరసంగా అడిగేడు తరుణ్. ఇబ్బందిగా చూసింది చందన.

"ఫర్వాలేదులెండి. ఫ్రిజ్‌లో వుంది.. తెస్తాను" అంటూ వెళ్తున్న అఖిల్‌కు చెప్పింది కల్పన, "చల్లగా వద్దు. బంగారిని గోరువెచ్చటి నీళ్ళలో కాసేపుంచి ఇమ్మను"

బాటిల్ చూస్తూనే లేచి కూర్చున్నాడు తరుణ్. "అంకుల్, నాకు 'థమ్స్‌అప్' ఇష్టమని మీకెలా తెల్సు? " అడిగేడు.

"గుడ్‌బాయిస్ లైక్ మీ, లైక్ థమ్సప్!" అన్నాడు అఖిల్.

ఖాళీ బాటిల్ తీసుకుని "సరే. ఇక గుడ్‌నైట్" అంటూ వెనుతిరిగిన అఖిల్ చేయి పట్టుకున్నాడు తరుణ్.

"నిద్ర రావడంలేదు. నా దగ్గర కూర్చోవా అంకుల్? "

"తరుణ్ ఏమిటమ్మా? నేనుంటానుగా" చిరుకోపంగా అంది చందన.

తరుణ్ చేతిని రెండోచేత్తో కూడా పట్టుకుని అతడి పక్కలో కూర్చుని- "మీరిద్దరూ వెళ్ళి హాయిగా నా రూమ్‌లో పడుకుని కబుర్లు చెప్పుకోండి" గలగలా నవ్వేస్తూ అన్నాడు కల్పన చందనలతో.

స్నేహితురాళ్ళిద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు. మరెన్నో తీపి జ్ఞాపకాలు కలబోసుకున్నారు. మాట్లాడుతూనే నిద్రలోకి జారుకొంది కల్పన. అశాంతిగా వుంది చందన. నెమ్మదిగా లేచి ఎదుటి రూమ్ తలుపు కొద్దిగా తెరిచి చూసింది.

అఖిల్‌పై చేయీ, కాలూ వేస్కుని పడుకున్నాడు తరుణ్.

భారంగా నిట్టూర్చింది చందన 'ఈ అనుబంధం ఎన్నాళ్ళో!' అనుకొంటూ.

★ ★ ★

ఎన్ని సిగరెట్లు కాల్చాడో అతనికే తెలియదు. ఖాళీ సిగరెట్టు పెట్టెను కసితీరా హుస్సేన్ సాగర్‌లోకి విసిరేడు మధు.

అతడి మనసు పగ, ప్రతీకారం అని అలమటిస్తోంది. కసి బుస కొడుతోంది.

ఎదురుగా నడిచి వస్తున్న జంటను చూసి ఆగాడతను..

దగ్గరగా వచ్చేక కాని మానస, ఆనంద్





లు అతడిని గుర్తు పట్టలేదు. తప్పుకొని వెళ్లబోతున్న వారికి అడ్డంగా నిలబడ్డాడు అతడు. "సర్, మీతో మాట్లాడాలి. ఒక్క క్షణం ఆగుతారా? " వినయంగా అడిగేడు.

"చూడండి మధుగారూ! మాకూ, మీ వ్యవహారానికీ ఏం సంబంధం లేదు. దయచేసి మీరు పదే పదే మమ్మల్ని డిస్టర్బ్ చేయకండి" కారు డోర్ ఓపెన్ చేస్తూ అన్నాడు ఆనంద్.

మానస చటుక్కున ఫ్రంట్ సీట్లో ఎక్కి కూర్చోని డోర్ వేసేస్కుంది.

"మేడమ్, వారు ఢిల్లీలో ఎక్కడుంటారో చిరునామా యిస్తారా? మిమ్మల్ని పదే పదే డిస్టర్బ్ చేసే అవసరం నాకుండదు"

"అడ్రస్ మాకూ తెలియదండీ. లెటర్ రాస్తానంది. రాయలేదు. డాక్టర్‌గారిని అడగండి. ఇక నన్ను కలిసే ప్రయత్నం చేయొద్దు. మీ శ్రేయస్సు కోరి కాళ్లావేళ్లా పడినపుడు కాలదన్నేరు. ఇపుడిలా వేధించటం బాగా లేదు" అంది మానస.

కారు వెళ్లిపోయింది. నేలను ఒక తన్ను తన్నాడు మధు "డామిట్." అంటూ కసితీరా.

★ ★ ★

ఇంటికి చేరాక, ఆనంద్ డ్రెస్ మార్చుకుని గదిలోనే వుండిపోయేడు. భోజనానికి రమ్మని పిలిచినా మౌనంగా కూర్చున్నాడు. మళ్లీ అడిగితే "ఆకలి లేదు. నువ్వు తిను" అంటూ విసుక్కున్నాడు.

మధువల్ల తమిద్దరిమధ్యా గొడవలు .. ఈ సమస్యనెలా పరిష్కరించాలా అని ఆలోచించసాగింది మానస. అన్నీ సర్దేసి, తలుపులు వేసేసి వచ్చి పడుకుంది.. ఆమెను చూస్తూనే అటు తిరిగి పడుకున్నాడు ఆనంద్. కనుకొలకుల్లోంచి రాలిన నీటి ముత్యాలను కొంగుతో ఒత్తుకొని లేచి, పెన్ను, లెటర్‌పాడ్ తీస్కుని, టేబుల్ లైట్ ఆన్ చేస్కొని కల్పనకు లెటర్ రాయటం మొదలు పెట్టింది మానస.




శనివారం కల్పనకు సెలవుకావటంతో రెడ్‌ఫోర్ట్, ఇండియా గేటు చూద్దామని బయల్దేరదీసింది చందనను.

మేజర్ వర్మ ఏడు గంటలకే వెళ్లిపోయాడు హడావుడిగా.

"పనుంది. ఆఫీస్‌కు వెళ్లాలి" అన్న అఖిల్‌ను కేకలేసింది కల్పన.

"ఆయనగారు ఎవర్ బిజీ! నీకేమో పనుంది. సరే మేమే వెళ్తాంలే ఏ టాక్సీలోనో, ఆటోలోనో." నిష్ఠూరంగా అంటున్న కల్పనను ఒక్కటేశాడు అఖిల్.

"అంతేకాని, హాయిగా అందరమ్మాయిల్లాగ కారు డ్రైవ్ చేద్దాం, స్వశక్తి మీదే ఆధారపడదాం అన్న బుద్ధే లేదు. ఈవిడ డాక్టరేంటండీ బాబూ!" చందనను చూస్తూ అన్నాడు. నవ్వింది చందన.

"సరే, నేను రావటం లేదని ఆఫీసుకు ఫోన్ చేసేస్తాను. అలక మాని చకచకా తయారవ్వండి" అంటూ ఫోన్ డయల్ చేయసాగేడు అఖిల్.

బాస్కెట్లవీ తెచ్చి కార్లో సర్దేరు బంగారి, అఖిల్. తరుణ్ కారెక్కి కూర్చున్నాడు.

"పోస్ట్!" అంటూ లెటర్ తెచ్చి అఖిల్ చేతికందించాడు పోస్ట్‌మాన్.

అటూ ఇటూ తిప్పి చూసి వెనుక సీట్లో కూర్చుంటున్న కల్పనకిచ్చాడు అతడు.

"మానస రాసింది" అంటూ చందనకిచ్చిందామె.

## కొత్తగాలి...

**ఆ పిల్లాడికి**
**దెయ్యమంటే భయం**
**వాళ్ల నాన్నకేమో**
**బియ్యమంటే భయం**

*-గరిమెళ్ల నాగేశ్వరరావు,*
*కొమ్మాది, విశాఖపట్నం.*

"నీకేగా రాసింది" అంటూ కల్పనకిచ్చేసింది చందన, పక్కనే కూర్చుంటూ.

ఫ్రంట్ సీట్లో అఖిల్ పక్కన కూర్చున్న తరుణ్ 'ఢిల్లీలో ఏం వుంది చూడటానికి? ఇపుడెక్కడికెళ్తున్నాం? ' లాంటి ప్రశ్నలతో బిజీగా ఉన్నాడు.

ఓపికగా సమాధానాలు చెప్తూ, డ్రైవ్ చేస్తున్నాడు అఖిల్.

నెమ్మదిగా కవర్ ఓపెన్ చేసింది కల్పన. చదువుతున్న కొలదీ ఆమె ముఖంలో మారుతున్న రంగులు కలవరపరచాయి చందనను.

"ఏం రాసింది? "

కల్పన ఉత్తరాన్ని చందన చేతికిచ్చింది. ఆసాంతం చదివి నిట్టూర్చింది చందన. తెలియని నీరసం ఆవహించిందామెను.

వెనుకకు తల ఆనించి చేర్లబడిన చందనను చూస్తే అఖిల్‌కు అర్థమైంది, 'సమ్‌థింగ్ ఈజ్ రాంగ్!' అని.

"ఇదిగో ఇది రామకృష్ణాపురం. ఇక్కడంతా మన తెలుగువాళ్ళే ఎక్కువగా ఉంటారు. ఇదే సఫ్దర్‌జంగ్‌రోడ్. పార్లమెంట్ అదుగో.. రాష్ట్రపతి భవన్. ఇటు ఇండియాగేటు!" చూపించేడతడు.

యాంత్రికంగా చూస్తోంది చందన.

కారు ఇండియా గేటు సమీపంలో ఆగింది.. అందరూ దిగి నెమ్మదిగా ఇండియాగేటును సమీపించేరు.

"మమ్మీ, కోతి అదుగో. అంకుల్... మంకీ. ప్లీజ్ దాని దగ్గరకు వెళ్దాం" అంటూ పరుగు తీశాడు తరుణ్.

ఫొటోలు తీసుకొనేందుకు కోతులతో షేక్‌హ్యాండ్స్ ఇప్పించి, డబ్బు తీస్కుంటున్నారు కోతులను ఆడించుకొనేవాళ్ళు.

ఎందుకో చందనకు తల తిరిగినట్లైంది ఒక్కసారిగా. మానస లెటర్ చదివేక ఒంట్లో ఉన్న శక్తినంతా ఎవరో లాక్కున్నట్లయిపోయిందామెకు.

కుప్పగా కూలబడిపోతున్న చందనను ఇటునుంచి అఖిల్, అటునుంచీ కల్పన పట్టుకున్నారే కాని, లేకుంటే దెబ్బ తగిలి వుండేది ఆమెకు. అఖిల్ పరిగెత్తి వాటర్ బాటిల్ తెచ్చాడు. చందన ముఖంపై నీళ్ళు చల్లాడు. కొంచెం నీళ్ళతో నోరు తడిపింది కల్పన. అప్పటికే ఇద్దరు ముగ్గురు ఫారినర్స్‌తో సహా చాలామంది చుట్టూ చేరి చూస్తున్నారు.

"మమ్మీ... మమ్మీ!" ఏడుపు మొదలుపెట్టాడు తరుణ్.

"తరూ! మమ్మీకి కళ్ళు తిరిగాయి అంతే. వూరుకో" అన్నాడు అఖిల్.

నెమ్మదిగా కళ్ళు తెరిచింది చందన. అయోమయంగా చుట్టూ చూసి చటుక్కున లేచి కూర్చుంది బిడియంగా. "కొద్దిగా కళ్ళు తిరిగేయి. పడ్డానా? " నెమ్మదిగా అడిగింది.

కూల్‌డ్రింక్ తీస్కు వచ్చేడు అఖిల్.

కొద్ది కొద్దిగా తాగుతూ చుట్టూ చూసింది. జనం వెళ్ళిపోయారు.

"ఎలా వుంది? " అఖిల్ అడిగాడు.

లోలోపల సిగ్గుపడింది చందన.

"బాగానే వుంది. నాకేం ఫర్వాలేదు" అంటూ లేచింది చందన. కారు డోర్ తెరిచాడు అఖిల్. ఎక్కి కూర్చుంది చందన.

"ఇంటికేనా? " కల్పనను అడిగేడతను.

"రెడ్‌ఫోర్ట్ చూద్దాం అంకుల్" బతిమిలాడుతున్నట్లు అడిగేడు తరుణ్.

"ఫర్వాలేదు. నేను కార్లో కూర్చుంటాను. మీరు తిరిగి వద్దురుగాని" అంది చందన.

"వచ్చిందే మీకోసం, తరుణ్ కోసం" నిరాశగా అన్నాడు అఖిల్.

"మరోరోజు వద్దాంలే" అంది కల్పన.

"లేదు. ఇప్పుడే వెళ్ళాలి" మంకుపట్టుగా వుంది తరుణ్ స్వరం.

"సరే పద అఖిల్. పాపం... పిల్లలు డిజప్పాయింట్ అవటానికి ఇష్టపడరు" అంది కల్పన.

కారు రెడ్‌ఫోర్ట్‌ను సమీపించింది. టూరిస్టు బస్సులలో వచ్చిన జనంతో సెలవురోజు కావటంవల్లా రద్దీగా వుంది.

"లోపల ఏముంది? " అడిగేడు తరుణ్.

"లోపల రాజుగారు ఎవరూ వుండరు. రకరకాల షాపులున్నాయి. ఇక వీరిద్దరూ వెళ్ళేరంటే, సాయంత్రం వరకూ బయటకి రారు" అన్నాడు అఖిల్ నవ్వుతూ. నవ్వేడు తరుణ్. "అయితే వీళ్ళను లోపలకు వెళ్ళనీయొద్దు. మనమే వెళ్దాం"

"యూ నాటీ!" అంటూ తరుణ్ ముక్కు పట్టుకు ఆడించింది కల్పన.

నేను కూర్చుంటాను. మీరెళ్ళి రండి" అంది చందన.

"నేను ఎన్నిసార్లో చూశాను... కానీ కొన్ని కొనుక్కోవలసిన అయిటమ్స్ వున్నాయి. తొందరగానే వచ్చేస్తాను" అంది కల్పన.

కళ్ళు మూసుకుని సీటులో తల వెనక్కు ఆనుకుని కూర్చుంది చందన.

"అరె, నిద్రపోతున్నారా? "

ఉలిక్కిపడి చూసింది చందన.

"ఇదిగో ఫ్రూట్ జ్యూస్. నీరసం తగ్గుతుంది" అంటూ గ్లాసందించేడు అఖిల్.

"అయ్యో, మీరు పనిగట్టుకు తెచ్చేరా? థ్యాంక్సండీ!" అంటూ అందుకుంది.

అతడు ఫ్రంటు డోర్ తీస్కుని డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

నెమ్మది నెమ్మదిగా పళ్ళరసం తాగుతుంటే అతడి భార్యా, పిల్లలూ ఎక్కడున్నారోనని అడగాలనిపించింది. కాని మౌనంగా వుండిపోయింది.

కాసేపలాగే కూర్చున్నాడతడు. వెనక్కి తిరిగి చూడకుండానే "చందన గారూ!" అన్నాడు నెమ్మదిగా.

"ఏమిటండీ? " అంది చందన.

"మీ సమస్య ఏమిటో తెలియదు కానీ, లెటర్ చదివేక మీరు ఎందుకో బాధపడ్తున్నట్లు అనిపిస్తోంది నాకు. మీ సమస్య ఏదైనా... దానికి పరిష్కారం వెతకటానికి నాకు చేతనైన ప్రయత్నం చేస్తాను"

"సమస్యలున్నాయని మీకు తెలుసా? " నిష్ఠూరం ధ్వనించింది చందన గొంతులో.

చటుక్కున వెనుతిరిగి చూసేడు అఖిల్.

"కొన్ని విషయాలు తెల్సుకోవటానికి భాష అవసరం వుండదు" అంటూనే కారు దిగి డోర్ వేసేసి చకచక నడిచి వెళ్ళిపోతున్న అతడివైపే చూసింది. భారంగా నిట్టూర్చి కళ్ళు మూస్కుంది. 'భగవంతుడా! చేతకానివాడు చదరంగం ఆడినట్లు ఆడుతున్నావ్ నా జీవితంతో.'

★ ★ ★

చందన, మానసకు ఫోన్ చేసింది. మానస లెటర్ చదివేక ఆమె మనసు అలజడికి లోనైంది. ఫోన్ ఆనంద్ లిఫ్ట్ చేసేడు. చందనని తెలియగానే "మనూ, ఫోన్ నీకే" అంటూ ఇచ్చేశాడు. చివుక్కుమంది చందన మనసు 'ఎలా వున్నారన్న పలకరింపు కూడా లేనందుకు'. మానస ఆత్రంగా పలకరించింది చందనను. ఆప్యాయంగా మాట్లాడింది.

"నీ లెటరందిందే" అంది చందన.

"కల్పనకు కదా రాశాను" అందామె.

"అది నేనూ చదవటం మంచిదైంది. మనూ! నా వల్ల మీరంతా చాలా ఇబ్బందిని ఎదుర్కొంటున్నందుకు సిగ్గుతో చచ్చి



పోవాలనిపిస్తోంది నాకు. కానీ... తరుణ్ కోసం ఆ పని చేయలేకపోతున్నాను."

"ఏం మాటలే అవి? ఇదొక టైమ్ అంతే. అన్నీ సర్దుకుంటాయి"

"నన్ను చెప్పనియ్యి మానసా. ఇక ముందు మధు వలన మీకెలాంటి ఇబ్బందీ లేకుండా చేస్తాను" చందన స్వరం గద్గదమైంది. "అతడు, అదే మధు అడుగుతున్న బ్యాంకు పేపర్సు సైన్ చేసి పంపించేస్తున్నాను అతడికి. ఆ ఐదు లక్షల కోసమేగా ఇంత అల్లరి చేస్తుంటా. ఇపుడే బాబాయికి ఫోను చేస్తున్నా. నీ ఆప్యాయతనూ, ఆదరణనూ ఎన్ని జన్మలకూ మరువలేను మనూ! బై" అని ఫోను కల్పనకు ఇచ్చి గదిలోకి వెళ్ళింది చందన

"ఏమైందే? " అంది కల్పన.

"కల్పనా, అది చాలా అప్‌సెట్ అయినట్టుంది. అసలు లెటరు దానికెందుకు చూపించావ్? నీకు బుద్ధి లేదు"

"దానికీ జరుగుతున్నది తెలియాలిగా. అనవసరంగా మీ ఇద్దరికీ గొడవలు.. అందుకే చూపించాను లెటరు"

"అంత మొత్తం అతడికి ఇచ్చేస్తాననటుం దేమిటి? " దిగులుగా అంది మానస.

"నే దానితో మాట్లాడి, మళ్ళీ నీకు ఫోను చేస్తాను బై" అంటూ ఫోన్‌పెట్టి నెమ్మదిగా చందన గదిలోకి వెళ్ళింది కల్పన.

"చందూ, నీ బాధ నాకు తెలుసు. నువ్వు ధైర్యంగల దానివి. నీకు నేను చెప్పక్కర్లేదు. పాపం మానస లెటర్ రాసినందుకు ఫీలవుతోంది. మనలో అందరికీ తలా ఒక సమస్యా వున్నాయి. ఆ దేవుడు నీకు ఇంకొంచెం ఎక్కువ పరీక్ష పెట్టేడు. కానీ ఏం చేస్తాం చెప్పు. పిల్లల భవిష్యత్ కోసం జీవితాన్ని నడిపించాలి అంతే..."

"అవునులే కానీ, ఆ ఐదు లక్షల గురించే అతడి బాధ. కోర్టులో అయితే అది తరుణ్‌కు చెందేలా చేస్తారు. ఆలోగా హస్తగతం చేసుకోవాలన్నదే అతడి ప్లాన్"

"నువ్వు సంతకం పెడితే కదా. ఇక్కడుండగా నిన్నూ, తరుణ్‌నూ అతడేం చెయ్యలేడు"

"నాకు భయం లేదు, కాని అక్కడ అంకుల్, మానసా, వాళ్ళాయనా ఇబ్బందికి గురవుతున్నారు. బాబాయిపై చెయ్యి కూడా చేస్కున్నాడంటే చాలా బాధగా వుంది. అందుకే ఒక నిర్ణయానికి వచ్చేను" స్థిరంగా అంది చందన.

"చందూ ఆ డబ్బు తరుణ్ భవిష్యత్‌కు ఉపయోగపడాలని కదా మీ బాబాయి కోరిక" కల్పన అంది.

"ముందు మనశ్శాంతి కావాలి. అందు కోసం కొన్ని వదులుకోక తప్పదనుకుంటాను" ఆవులిస్తూ లేచింది చందన.

"సరే ఏది మంచిదైతే అదే చేయొచ్చు. పడుకో" అంటూ దిండ్లు సర్ది, బెడ్‌లైట్ వెలిగించి, ట్యూబ్ ఆఫ్ చేసింది కల్పన.

అఖిల్ గదిలో ఆడుకొంటున్న తరుణ్ పరుగున వచ్చి తల్లి పక్కలో చేరాడు. "గుడ్‌నైట్" చెప్పి కల్పన వెళ్ళిపోయింది. తరుణ్ వీపుపై తడ్తూ నెమ్మదిగా నిద్రలోకి జారుకొంది చందన.

★ ★ ★

"మీదసలు మగజన్మేనా? " కోపంలో వూగిపోతూ భద్రకాళిలావుంది రాజ్యలక్ష్మి.

"అబ్బ రాజ్యం. కాస్సేపు నన్ను ఒంటరిగా వదిలేయ్" భార్యతో విసుగ్గా అన్నాడు గోపాల్రావ్.

"కాస్సేపేం ఖర్మం? తల్చుకొంటే పూర్తిగానే వదిలేస్తా, జాగ్రత్త! వీరేశలింగంలా దానికి మళ్ళీ పెళ్ళి చేశావ్. లక్షణంగా ఇంట్లో పడుండి, ఏదో ఒకటి చేస్కు బతుకును. రోగం చప్పగా కుదురుతుంది ఇప్పుడు ఇద్దరికీ"

"నా ఖర్మంకొద్దీ దొరికావు కదే రాక్షసీ. అది పాపం నీ రంపపు కోత నుంచి విము

క్షుల‌రాలవుతుందనే ఈ పెళ్ళి చేశాను..." బాధగా అన్నాడాయన.

"ఆ మధుగాడి మీద పోలీసు కంప్లైంట్ ఇస్తావా లేదా" ఆమె స్వరం పెరిగింది.

"నేనివ్వనే.. ఫో ఇక్కడ్నుంచి"

"హవ్వ! ఆసుపత్రిలోకి తాగొచ్చి, నానా బూతులూ కూసి, బుర్ర పగులగొట్టాడు. అయినా రుచిగానే వుంది"

"రుచి కాదే దయ్యం. చందన పేరు వీధిన పడ్తుంది. ఆ దరిద్రుడిని జైలులో పెడతారు. లేనిపోని రభస. వూరుకొంటే అదే మానిపోతుంది" నుదుటి మీది గాయానికి అంటించిన దూదిని చేత్తో నెమ్మదిగా ఒత్తుకొంటూ అన్నాడాయన.

"అబ్బో... పరువు రోడ్డున పడటం ఇపుడు రెండు పెళ్ళిళ్లూ పెటాకులైతే ఇన ప్పెట్టెలో వుందా పరువు? ఆ కొట్టేదేదో ఇంకాస్త గట్టిగానైనా కొట్టేడుకాదు వెధవ" సణుగుకొంటూ విసవిసా వెళ్లిపోతున్న భార్యవైపు నిస్సహాయంగా చూశాడాయన.

ఫోను మోగింది. పరుగున వెనక్కు వచ్చి ఫోను ఎత్తింది రాజ్యలక్ష్మి.

"ఎవరూ? ఓహ్... మానస అంటే నువ్వేనా తల్లీ? ఇదిగో చూడూ మరోసారి ఇక్కడకు ఫోను చేశావంటే మర్యాద దక్కదు. ఆ దౌర్భాగ్యాన్కి మాకు ఏం సంబంధం లేదు"

"ఏమిటీ? అవసరంగా మాట్లాడాలా? దాని మొగుడు కొట్టిన దెబ్బకి మంచాన్కి అడ్డంగా పడున్నాడు. పెళ్లి చేసినందుకు ఆయన శ్రాద్ధం పెడతారా మీరందరూ? "

"కుదరదు.. పెట్టు ఫోను. నిన్ను జాగ్రత్త పెట్టుకోమని, మీ ఆయనకు అత్త గార్కి చెప్తాను"

"రాజ్యం! విషయం కనుక్కో, ప్లీజ్"

"విషయమా? విషమా? " అంటూ ఫోను పెట్టేసింది ఆమె ధడేలున.

మళ్లీ మోగింది ఫోను. ఎత్తి పక్కన పడేసింది రిసీవర్ ఆమె.

## ఇదే నా తొలి నవల



విజయరాణి

'అనిర్వచనీయం' నవలతో నవలా ప్రపంచంలోకి తొలి అడుగు వేశాను. నాకు నడకలు నేర్పిన నా తల్లిదండ్రుల సంస్కారం, చిన్నక్క సుప్రసిద్ధ రచయిత్రి కోడూరి కౌసల్యాదేవి ఇచ్చిన రచనాస్ఫూర్తి నన్ను ఒక రచయిత్రిగా తీర్చిదిద్దాయని చెప్పటానికి గర్విస్తున్నాను. నేను పెద్ద రచయిత్రిని కాకపోయినా, వివిధ పత్రికలలో విభిన్న అంశాలపై అనేక వ్యాసాలు రాశాను. కొన్ని కథలు కూడ ప్రచురితమయ్యాయి. అముద్రిత నవల కూడా మరొకటి సిద్ధంగా ఉంది. తోటి మనుషులపట్ల మానవత్వంతో ప్రవర్తించటం, చేతనైన సాయం చేయటం నాకు సంతోషాన్నిచ్చే పనులు. ఎన్నో అందమైన ఊహల్ని, ప్రయోజనకరమైన ఆలోచనల్ని ఇచ్చాడు భగవంతుడు. వాటిని సద్వినియోగం చేసుకోవాలన్న ఆరాటం మనసులో! నన్ను ప్రోత్సహిస్తున్న ప్రతి ఒక్కరికి కృతజ్ఞతలు. నా తొలి నవలను స్వీకరించి ఆదరించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

గబగబ సమీపంగా ఉన్న కార్డ్‌లెస్ అందుకున్నాడాయన.

ఒక్క ఉదుటన వచ్చి ఆ ఫోను లాగి విసిరి కొట్టింది ఆమె.

"అదీ, దాని దిక్కుమాలిన స్నేహితులూ,



మొగుడూ ఇక్కడకు రావటానికి కాని, ఫోను చెయ్యటానికి కాని వీలులేదు" అంటూ విసవిసా అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

కళ్లు మూసుకుని పడుకున్నాడాయన, ఒక తలగడ ముఖంమీద వేస్కొని.

★ ★ ★

హడావుడిగా హాస్పిటల్‌కు వెళ్లటానికి తయారవుతున్న కల్పన దగ్గరకు పరుగున వచ్చింది బంగారి. "కల్పనమ్మా" అంటూ.

"ఏమిటీ? " హాండ్‌బ్యాగ్‌లో దేనికో వెతుకుతూ అడిగింది.

"చందనమ్మకు ఒళ్లు బాగాలేదు"

"ఏం ఏమైంది? " అంటూ చందన గదివైపు నడిచింది కల్పన. ముడుచుకు పడుకొన్న చందన నుదుటిపై చేయివేసి 'చందూ' అని పిలిచింది.

చందన వెనుతిరిగి చూసింది కల్పనను. ఆమె కళ్లు వాచి ఉన్నాయి.

"నన్ను కారణం అడగొద్దు ప్లీజ్! నేను వెళ్లిపోతాను ఇక్కడ్నుంచి... కాదు వెళ్లిపోవాలి" తలవంచుకొని చెప్తున్న చందనవైపు అయోమయంగా చూసింది కల్పన.

"ఏం జరిగింది చెప్పు" చందన చెయ్యి పట్టుకొని అనునయంగా అడిగింది ఆమె.

ఒక్క ఉదుటన బాత్‌రూమ్ దగ్గర ఉన్న వాష్‌బేసిన్ దగ్గరకు పరుగుతీసి వాంతి చేస్కొని వచ్చింది చందన.

"చందనా!" ఎదురుగా నిలబడి గడ్డం పుచ్చుకు పైకెత్తుతూ ఆమె కళ్లలోకి చూసింది. సమాధానం చందన కళ్లలోనే చదువుకొంది కల్పన.

"మైగాడ్!" అంటూ సోఫాలో కూలబడింది కల్పన. ఆమెను చెప్పలేనంత నీరసం ఆవహించింది. ఏం మాట్లాడాలో ఏం చెయ్యాలో అర్థంకాలేదు.

"బంగారీ" హీనస్వరంతో పిలిచింది.

"చందనకు కాస్త కాఫీ కలిపివ్వు... వద్దు కాంప్లాన్ కలిపివ్వు" అంటూ వెళ్లి హాలులో ఉన్న డైనింగ్ టేబిల్ దగ్గర కూలబడింది కల్పన. అలా ఎంతసేపు కూర్చుందో తెలియదు. భుజంపట్టి కుదుపుతున్న అఖిల్ వైపు చూసింది పరధ్యానంగా.

"ఏమైందక్కా? " కల్పన ముఖంలోకి చూస్తూ ఆత్రంగా అడిగేడతడు. ఆమె కళ్లలో కన్నీరు కనిపించకుండా రెప్పలు వాల్చింది ఆమె.

"బావ రాలేదుగా? " అనుమానంగా అడిగేడు కల్పన బెడ్‌రూమ్‌వైపు చూస్తూ.

ఆమె అలా ఉండగా అతడెన్నడూ చూడలేదు. భర్త మేజర్ వర్మ వల్ల ఎన్ని సమస్యలెదురైనా లెక్క చేయకుండా తిరిగే కల్పన, ఇంత బేలగా అయిపోవటం చూస్తే ఏదో జరగకూడనిదే జరిగి ఉంటుంది అనిపించింది అతడికి.

"అఖిల్! చందన ఎదుర్కొంటున్న సమస్య ఏమిటని అడిగేవ్ నన్ను. దానికి సమాధానం ఇపుడు చెప్తాను నీకు" నెమ్మదిగా అంది కల్పన. అలా అని చందన ఢిల్లీ వచ్చేవరకూ జరిగిన విషయాలన్నీ క్లుప్తంగా చెప్పింది. భారంగా నిట్టూర్చాడతడు.

"అవునూ, ఇపుడు కొత్తగా వచ్చిన సమస్యేమిటి? త్వరలో ఆమెకు లీగల్‌గా పరిష్కారం దొరుకుతుందిగా? "

"ఇపుడు సమస్య అది కాదురా..."

"కల్పనమ్మా..!" గాభరాగా పిలుస్తోంది బంగారి.

"చందనమ్మా, తరుణ్ బాబూ లేరమ్మా"

"లేరా!!"

"లేరమ్మా ఎటెళ్లిపోయారో" ఆదుర్దాగా చెప్పిందామె.

పరుగున వెళ్లి చూసేడు అఖిల్. సూట్‌కేసూ, మిగిలిన బట్టలూ, వస్తువులు ఎక్కడివక్కడే ఉన్నాయి. వాళ్లిద్దరూ ఇంత పొద్దుటే ఎక్కడికెళ్లుంటారు?

"అసలేం జరిగింది? " సీరియస్‌గా

అడిగేడతడు.

తలవంచుకొంది కల్పన. .

"ఆవిడకు ఉన్నట్టుండి చెప్పకుండా వెళ్ల పోవలసినంత సమస్య ఏమిటటా? " విసుగ్గా ఉంది అఖిల్ స్వరం.

కల్పన కళ్లు చెమర్చాయి. "అఖిల్! షీ ఈజ్ ప్రెగ్నెంట్" అని ఉదయం జరిగిన సంభాషణ చెప్పిందతడికి.

"ఏ మెడికల్ షాపుకో వెళ్ళిందేమో? "

"చెప్పకుండా వెళ్లదది. నిద్రపోతున్న పిల్లాడిని లేపి తీస్కెళ్లిందంటే నాకు భయంగా ఉందిరా"

కారు తాళాలు తీస్కొని కిందకు పరిగెత్తాడు అఖిల్.

"మీ బంధువులు బయటకు వెళ్లేరు" చెప్పేడు పక్కింటి ముసలాయన.

"ఎటువైపు వెళ్లేరు? " వీలైనంత సహజంగా అడిగేడు, కర్చీఫ్‌తో ముఖం తుడుచుకొంటూ. ఫ్రంట్ సీట్లో అతడి పక్కన ఎక్కి కూర్చుంది కల్పన.

"అటు" అంటూ చూపించేడతడు.

కారు ఆ దిక్కుగా దూసుకుపోయింది.

"అవునూ... ఆవిడిది ఏ రంగు చీరో గుర్తుందా? " అడిగేడు అఖిల్.

ఒక్క క్షణం ఆలోచింది "స్కై బ్లూ కలర్" అంది కల్పన.

తిరిగిన వీధులే తిరుగుతూ, కొత్తచోట్ల వెతుకుతూ ఎంత తిరిగినా లాభం లేకపోయింది.

"ఇంత తక్కువ టైమ్‌లో ఎంతదూరం వెళ్లగలరు? "సాలోచనగా అన్నాడు అఖిల్.

కల్పన అసలు మాట్లాడే పరిస్థితిలోనే లేదు. ఏ అఘాయిత్యం తలపెడుతుందో నన్న బాధ గుండెను పిండుతుంటే కళ్లు ఒత్తుకుంటూ కూర్చుండిపోయింది ఆమె.

"ఒక్కసారి ఇంటికి వెళ్దాం. వచ్చేసి ఉండొచ్చుగా" అంటూ కారు అటు పోనిచ్చాడు. కారు రోడ్డుమీదే ఆపి పెద్ద పెద్ద అంగలు వేస్తూ వెళ్తున్న అఖిల్‌కు ఎదురు

**కొత్తగాలి...**

**గంధం వృక్షంలా జీవించు**
**తనని నరికే గొడ్డలికి కూడ**
**సుగంధం అందించు**

–మైనంపాటి కృష్ణప్రసాద్,
శ్రీకాళహస్తి

వచ్చింది బంగారి.

ఆమె కళ్లు ఇంతింత చేసి చెప్తున్న తీరు చూస్తే ఏమిటోనని భయపడింది కల్పన. అఖిల్ పరుగునవచ్చి కారు స్టార్ట్ చేశాడు.

"అఖిల్ ఏమైంది? బంగారి ఏం చెప్పింది? " ఆదుర్దాగా అడిగింది కల్పన.

"తరుణ్ ఫోను చేశాడు. వాడికి ఉన్నచోటు పేరు తెలియదు. ఏదో ఆన వాళ్లు చెప్పాడు"

"ఏమనీ? "

"చందన రైల్వేట్రాక్‌పై పరిగెత్తిందట!" ముఖం తుడుచుకొంటూ చెప్పాడు.

"ఏమైందీ? " కంగారుగా అడిగింది.

"ఏమైందో నాకు మాత్రం తెలుసా? " అంటూ ఎదురుగా వేగంగా వచ్చిన బస్సును తప్పించటాన్కి సడన్ టర్న్ తీస్కొనేసరికి, కల్పన వచ్చి అతడిపై పడింది ఆ విసురుకు.

కారు స్లో చేసి, కల్పన పరిస్థితి చూసి నెమ్మదిగా చెప్పేడతడు "తరుణ్ ఏడుస్తూ ఫోన్ చేసేడట. వాడి లేత బుర్ర ఫోనునెంబరు గుర్తు పెట్టుకోవడం గొప్పే"

అఖిల్ కళ్లు చెమ్మగిల్లాయి.

'ఈ తల్లీకొడుకుల రాకతో తన జీవితంలో ఒక అలజడి బయల్దేరింది. ఆ అలజడి తుపానై తనను మరోసారి కుంగదీయకుండా చూస్కోవాలి. తరుణ్‌తో తనకెందుకీ బంధం!'

అతి దగ్గరగా ఉన్న రైల్వే ట్రాక్‌ను వె



దకడంలో నిమగ్నమైంది అతడి ఆలోచన.

కారు శరవేగంతో పోనిచ్చాడు. ట్రాక్‌ను సమీపించాక వీలైనంత దూరం గాలిస్తున్నాయి అతడి కళ్లు.

'అంత తక్కువ సమయంలో ఇంతకంటె దూరం వెళ్లటం అసాధ్యం.' కారాపి దిగాడు అఖిల్. కల్పన పట్టాలవైపు పరుగు తీసింది. అఖిల్ మరోవైపు వెతుకుతున్నాడు ఆత్రంగా.

"అంకుల్!" అన్న కేకకు మెరుపులా వెనుతిరిగి చూశాడు.

'అది తన తరుణ్ పిలుపే!'

అది ఒక టీ దుకాణం. అక్కడ చాలా మంది గుంపులుగా నిలబడి వున్నారు. తరుణ్ పరుగున తనవైపే వస్తున్నాడు.

వేగంగా అటుకదిలాడు అఖిల్. పరుగున వచ్చి అతడిని చుట్టేశాడు తరుణ్.

"అంకుల్... అంకుల్" అనటం తప్ప వెక్కిళ్ల మధ్య మాట్లాడలేకపోతున్న వాడిని గుండెకు హత్తుకున్నాడు అఖిల్. అతడికీ కళ్లు నిండి నోట మాట రాలేదు.

తరుణ్, ఎడారిలా వున్న అతడి మనసులో రాగం పలికించాడు. రాతి పలకగా మారిన గుండెను తన బుల్లి ప్రేమతో తట్టి మెత్తపరిచాడు. అతడిలో ఒక స్పందన!

అనుకోని ఈ సంఘటనతో అతడి మనసు తీవ్రమైన ఒత్తిడికి లోనైంది.

తేరుకొని నెమ్మదిగా "మమ్మీ ఎక్కడ?" అనడిగేడు.

ఓ చేత్తో షాపు వైపు చూపిస్తూ రెండో చేత్తో కళ్లు తుడుచుకున్నాడు తరుణ్.

కారు తెచ్చి టీ దుకాణం దగ్గరగా ఆపి బ్యాక్‌డోరు తెరిచి పెట్టాడు.

ట్రాక్ పక్కన వున్న కంకర రాళ్లపై నడవలేక, హైహీల్స్ చెప్పులు చేత్తో పట్టుకు అవస్థపడుతూ వచ్చింది కల్పన.

"ఉందా?" తరుణ్‌ను దగ్గరకు తీస్కుంటూ అడిగింది.

ఆ దుకాణం నడుపుతున్న వ్యక్తి ఒక సిక్కు. పంజాబీ కలిసిన హిందీలో మొత్తం జరిగింది వివరించాడు అఖిల్‌కు.

పిల్లాడితో సహా ఆత్మహత్యకు ప్రయత్నించిందనీ, సమయానికి అడ్డుకొని కాపాడేననీ, తృటిలో ఇద్దరికీ ప్రమాదం తప్పిందనీ సారాంశం. భాష సమస్యవల్ల తరుణ్ వాళ్లకేం చెప్పలేకపోయాడు.

"మై గాడ్!" మనసులోనే దేవుడికి అంజలి ఘటించాడు అఖిల్. చాలాకాలం తర్వాత, తనకు లభించిన ఈ చిన్ని సంతోషాన్ని మాయం చేయనందుకు!

అఖిల్ చుట్టూ చేరేరా జనం.

"ఎందుకయ్యా ఆడోళ్లని బాధించటం! చూడు, ప్రాణం తీస్కోబోయిందిగా!" అని ఒకరు, "ఇలాంటివాళ్ళను పోలీసులకు అప్పగించాలి" అని ఒకరూ హిందీలో మందలిస్తున్నారు! దుయ్యబడ్తున్నారు!

అఖిల్ నెమ్మదిగా లోపలకు వెళ్లాడు. మోకాళ్ళలో తలదాచుకు కూర్చుంది చందన. అఖిల్ పిలుపుకు ఉలిక్కిపడి చూసి అటు తిప్పుకొంది ముఖం.

"చందూ, రావే!" అంటూ చేయిపట్టి లేపింది కల్పన. ఓ పక్క ఆమె కదలికలను జాగ్రత్తగా గమనిస్తూ, ఆమెకు కార్లోకి తప్ప మరో వైపు వెళ్లటానికి తావివ్వకుండా నిలబడ్డాడు అఖిల్.

కిమ్మనకుండా కార్లో కూర్చుంది చందన. ఫ్రంట్ సీట్లో ఎక్కిన తరుణ్‌ను బ్యాక్ సీట్లోకి పంపించేడతడు "మమ్మీ దగ్గర కూర్చో" మంటూ. కళ్ళతోనే కల్పనకు 'జాగ్రత్త' అన్నట్లు సైగచేశాడు అఖిల్.

కుదుటపడ్డ గుండెతో సీట్లో వెనక్కు చేర్లబడి కూర్చుంది కల్పన. ఎడమ అరచేతిలో నుదురు ఆనుకొని తలవాల్చుకుని కూర్చుంది చందన.

కారులో వున్న నలుగురూ మాటలకు అతీతమైన భావోద్వేగంతో, ఎవరి ఆలోచ

నల్లో వారు మౌనంగా వుండిపోయేరు.

తిరిగి కల్పన ఇంటికే రావలసి వచ్చినందుకు దుఃఖిస్తోంది చందన మనసు. అందులోనూ అఖిల్‌కే దొరికినందుకు, తన హీనస్థితి అతడికి తెలిసిపోతోందన్న ఉక్రోషంతోనూ మనసు ఉడికిపోతోంది.

క్షణంలో అవకాశం చేజారిపోయింది. ఎందుకూ కొరగాని తన జీవితం ముగిసినా ఎవరికి నష్టం? తరుణ్ తన తర్వాత అనాధగా అష్టకష్టాలు పడతాడేమోనన్న వూహే భరించరానిదిగా వుంది. అందుకే వాడినీ తనతో తీసుకుపోదామనుకుంది.

చందన మనసలా అల్లకల్లోలంగా వుంటే, కల్పన మనసూ అశాంతికి గురైంది. 'నెమ్మదిగా చందనను ఏదైనా ఏవగేషన్‌లోకి డైవర్ట్ చేద్దాం, తరుణ్‌ను స్కూల్లో జాయిన్ చేద్దామని ప్లాన్ చేస్తుంటే ఏం జరిగింది? గాలివానకు చెట్టు నీడకు పరుగు తీస్తే నెత్తిన పిడుగు పడ్డట్టైంది... లేకుంటే ఈ పరిస్థితిలో చందూ ప్రెగ్నెంట్ అవడం ఏంటి? భగవంతుడా ఏం పరీక్ష పెట్టేవు? నుదుటిని వేళ్ళతో రాసుకోసాగింది ఆమె అశాంతిగా.

ఇక తరుణ్ పసి మనసు తుపాను గాలికి అల్లాడుతూన్న చిగురుటాకులా వుంది. ఆ టీ దుకాణంవాడు పట్టుకోకుంటే మమ్మీ, తనూ కూడ రైలు కింద పడి చనిపోయి వుండేవారు! కళ్ళు మూసినా, తెరిచినా, దడదడదడా దగ్గరగా దూసుకుపోయిన ఆ రైలే కనిపిస్తుంది.

అందరిలా తనకూ హాయిగా చూసుకునే అమ్మా, నాన్నా వుంటే ఎంత బాగుండేది? తల్లి అనురాగంలో పెరుగుతున్నా, ద్వేషాన్నీ విదిలింపులనూ మాత్రమే చవి చూసిన తరుణ్‌కు, అఖిల్ తనకు దేవుడిచ్చిన వరంలా కనిపించసాగేడు.

'తనను కూడా కూడా తిప్పుకొంటూ, సందేహాలు తీర్చే అంకుల్, సొంతం

**కొత్తగాలి...**

**రామరాజ్యం రాబోదు ఎప్పుడూ**
**వేటకొడవళ్ల, యాసిడ్‌ల**
**రాజ్యమే ఇప్పుడూ, ఎప్పుడూ**

–వై.కె.మూర్తి,
విజయవాడ

కాదన్నది గుబులు పుట్టిస్తోంది వాడికి.

ఆప్యాయంగా చూస్తున్న అఖిల్‌పై ఆ పసి మనసులో గౌరవభావం.. అనిర్వచనీయమైన అనుబంధం ఏర్పడింది.

ఆకస్మికంగా తన జీవితంలో ప్రవేశించి, మానుతున్న గుండె గాయాన్ని రేపి, మందు రాసి ఉపశమనం కలుగజేస్తున్న ఈ ఇద్దరి సమస్యనూ పరిష్కరించాలన్న దృఢ నిర్ణయం ఆ క్షణంలో అఖిల్ మనసులో అంకురించింది.

★ ★ ★

ఫోన్ మాట్లాడి, రిసీవర్ పెట్టిన మానసకు స్థిమితంగా లేదు. సోఫాలో చేర్లబడి కళ్ళు మూస్కుంది.

భార్య వైఖరిని గమనిస్తున్న ఆనంద్ అశాంతిగా లేచి కూర్చున్నాడు.

"మనూ!"

ఉలిక్కిపడి చూసింది మానస.

"ఫోనులో ఎవరు? "

ఇబ్బందిపడింది మానస. చందన విషయాలలో కలుగజేసుకోవద్దని అతడు శాసించిన దగ్గర్నుంచీ, ఆమె ఆ ప్రస్తావన అతడి సమక్షంలో తేవటం లేదు.

నెమ్మదిగా చెప్పింది "నా ఫ్రెండు దగ్గర్నుంచి" అని.

"చందన నుంచా? "

"కాదు"

"మరెవరో చెప్పచ్చుగా" అసహనంగా వుంది అతడి స్వరం.

## కొత్తగాలి...

**మనిషి విలువ**
**వెల్లడయ్యేది**
**చేతలలో!**
**వేషంలో కాదు**

– ఆర్.ఎస్. హైమవతి, చెన్నై

"కల్పనండీ" అంది అతడి ముఖంలో మార్పును గమనిస్తూ.

"ఓహో" అన్నాడు, మళ్ళీ మేగజైన్‌లో ముఖం దాచుకొంటూ.

"ఆనంద్!" చిన్నగా పిలిచింది ఆమె.

చటుక్కున చూశాడు ఆమె ముఖంలోకి. ఎప్పుడో కొన్ని సందర్భాలలోనే మానస అతడిని అలా సంబోధిస్తుంది.

"ఆనంద్, నాకు ఓ స్నేహితుడిగా ఓ సాయం చేస్తారా? " ఆశగా అడుగుతున్న భార్యవైపు అనుమానంగా చూసేడతడు.

"ఏమైంది మనూ? వ్వాట్ హాపెండ్? "

ముఖకవళికలనుబట్టి భార్య దేనిగురించో విపరీతంగా మథనపడుతోందని అర్థమైంది ఆనంద్‌కు.

"కోప్పడనని మాటిస్తారా? " అరచేయి ముందుకు చాచింది మానస. నెమ్మదిగా లేచి వచ్చి ఆ చేయి అందుకుని మృదువుగా నొక్కాడు ఆనంద్. అతడు దేనికీ మానసను నొప్పించి ఎరుగడు ఎన్నడూ.

మధు చేసిన చికాకువల్ల అతడిలో విసుగు చోటుచేసుకున్న మాట నిజమే. అది కూడా మానస ప్రశాంతత భగ్నం కాకూడదన్న దృష్టితో పెట్టిన ఆంక్షే!

మానస తలను గుండెకు ఆనించుకు తలనిమురుతూ అడిగేడతడు. "నీకొచ్చిన సమస్య ఏమిటి చెప్పు? "

ఆమెలోని బెదురు తొలగిపోయింది.

"నేను అర్జంటుగా ఢిల్లీకి వెళ్ళాలి" అని తలవంచుకు కూర్చుంది మానస. వెనక్కు జరిగి ఆశ్చర్యంగా చూసేడు ఆనంద్.

"అసలేం జరిగిందో చెప్పు"

మౌనం వహించింది మానస.

"ఎందుకో చెప్పకుండా ఎలా? " ఆమె ముఖంలో భావాలను పరిశీలిస్తూ అడిగేడు ఆనంద్.

"కల్పనకు నా సహాయం అవసరం"

"ఆమెకేమైంది? ఇంతకూ చందన బాగుందా? " ఆత్రంగా అడిగేడతడు.

"నేనిప్పుడే ఏం చెప్పలేను. ప్లీజ్, నన్ను ఢిల్లీ పంపించండి" అభ్యర్థించింది.

భారంగా నిట్టూరుస్తూ "నా బాధ కూడా అర్థం చేసుకో మనూ. ఒక్కో తుపాను తనకు ఎదురైన ప్రతి చెట్టునూ పెకలించి వేస్తుంది. మనం ఈ మెస్‌కు దూరంగా వుండలేమా? ఏదో మనపాటికి మనం హాయిగా బతుకుతున్నవాళ్ళం..." అర్థోక్తిగా ఆగాడతడు.

మౌనంగా తలవాల్చి కూర్చున్న మానసవైపు ఒక్క క్షణం చూసి లేచాడు ఆనంద్.

"ఆల్ రైట్... కాని నాలుగు రోజులలో హిమ వస్తుంది సెలవులకు. నేనెలాగో సర్దుకుంటాను. నువ్వు లేకుండా అమ్మకు కూడా కష్టమే"

"హిమ ఎపుడు వస్తుందా అని నేనూ ఎదురుచూస్తున్నానండీ. అంతకంటే ముందే వచ్చేద్దాం అనుకుంటున్నాను" నొచ్చుకొంటూ అంది మానస.

హిమను ఊటీలో స్కూల్లో చేర్పించిన దగ్గర్నుంచీ ఆమె మనసులో కొంతభాగం మొద్దుబారినట్లైంది. కూతురికోసం, గుండెలోంచి పొంగివచ్చే దుఃఖాన్ని దిగమింగుకుంటూ కాలం వెళ్ళబుచ్చగలిగేది, ఆమె వచ్చేరోజుకోసం ఎదురుచూసే ఆశతోనే.

"అమ్మకు చెప్పేవా? "

"లేదు. మీరు సరేనంటే చెప్తాను" పైట కొంగు వేలికి చుడుతూ, విప్పుతూ అంది.

"సడెన్‌గా ఎ.పి.కి. టికెట్టెలా దొరుకు

తుంది? " అన్నాడు ఆనంద్ సాలోచనగా.

"ప్లీజ్, మీ ఆఫీసు తరపున ట్రై చేస్తే ఫ్లైట్‌కు దొరుకుతుందేమో చూడండి"

"ఫ్లైట్‌కా? సరే" అని ఫోను చేతిలోకి తీస్కున్నాడు ఏ భావం ప్రకటించకుండా.

అతడేం చెప్తాడోనన్న ఆత్రంతో అతడి వైపే చూస్తూ కూర్చుంది మానస.

"ఎమర్జన్సీ ట్రిప్? ఏజ్ అర్లీ ఏజ్ పాసిబుల్ చేయండి" అని ఫోన్ పెట్టేసి మళ్లీ మాగజైన్ చేతిలోకి తీస్కున్నాడు ఆనంద్. ఒక్కక్షణం అటూ ఇటూ తిప్పి టీపాయ్ మీదకు విసిరికొట్టేడు బుక్‌ను.

ఆ గదిలో మౌనమే చోటు చేస్కుంది. దాన్ని భంగంచేస్తూ ఫోను మ్రోగింది.

"హలో... ఆ... ఓకే, ఓకే థాంక్యూ" అని ఫోను పెట్టేశాడు ఆనంద్.

"నీకు రేపు మార్నింగ్ ఆరుగంటలకే ఫ్లైట్." చెప్పేసి వెళ్లిపోయాడు ఆనంద్.

అత్తగారు జగదాంబ గదిలోకి వెళ్లింది మానస కంగారుగా. ఇపుడే చెప్పకపోతే ఆమె నిద్రపోతుంది. ఉదయం అంత వేకువనే ఆవిడకు చెప్పినా, మర్యాద కాదు.

టీవీ చూస్తున్న జగదాంబ మానసను చూసి "రామ్మా! దక్షయజ్ఞం చూపిస్తున్నాడు" అని టీవీలో నిమగ్నమైంది.

సీరియల్ అయ్యేవరకూ మానస అక్కడే కూర్చుంది. ఆ తర్వాత కోడల్ని పరిశీలనగా చూసి "ఏమిటమ్మా... అలా ఉన్నావేం? ఒంట్లో బాగాలేదా? నీకు ఈమధ్య పని ఎక్కువైపోతోంది, సరైన పనిమనిషి లేక" విచారంగా అందావిడ.

"అది కాదత్తయ్యా... ఊరు వెళ్దాం అనుకుంటున్నాను. నాలుగురోజులలో వచ్చేస్తాను" గబగబ చెప్పేసి 'హమ్మయ్య' అనుకుంది మానస.

"అమ్మను చూసొస్తావా? హిమ వచ్చేక కదా వెళ్దాం అనుకున్నారు? "

"గుంటూరు కాదత్తయ్యా, ఢిల్లీ"

నిట్టూర్చిందావిడ "ఎందుకూ? " అంటూ.

కొత్తగాలి...

**చతుర నవలావనంలో**
**నడుస్తుంటే...**
**'కొత్త గాలి'పూల**
**పరిమళాలు**

*–లోగిశ లక్ష్మీనాయుడు,*
*సింహాచలం*

"చిన్న అవసరం వచ్చింది అత్తయ్యా. కల్పన రమ్మని ఫోన్ చేసింది."

"అలాగా... చందన బాగుందా? "

"ఆ"

"ఏమీ అనుకోనంటే ఒక్కమాట చెప్తా" అనునయంగా ఉంది ఆమె కంఠస్వరం.

"చెప్పండి." అంది మానస మంచం అంచున కూర్చుంటూ.

"కష్టంలో స్నేహితులను ఆదుకోవద్దని చెప్పేదాన్ని కాదు. కాని ఎపుడూ నిన్ను పన్నెత్తి ఏమీ అనని అబ్బాయి ఈ వ్యవహారం కదిలినప్పుడల్లా చిరాకు పడుతున్నాడు. నువ్వు చదువుకున్నదానివీ, తెలివైనదానివీ, నీకే తెలుసు నీకేది మంచో, కాదో!" నడుం వాలుస్తూ అందావిడ. ఒక్కక్షణం మౌనంగా ఉండిపోయింది మానస. తర్వాత-

"ఈ ఒక్కసారికీ నన్ను క్షమించండి. వంటింట్లో కావలిసినవన్నీ కిందే అందుబాటుగా ఉంచుతాను. కొంచెం రెండ్రోజులు ఎలాగో సర్దుకోండి" అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది మానస.

భారంగా నిట్టూర్చి ఎదురుగా ఉన్న వెంకటేశ్వరా స్వామి పటానికో దణ్ణం పెట్టిందావిడ మౌనంగా. కోడలే కూతురావిడకు. ఆమె ఒక్క కూతురూ అమెరికాలో ఉంది. రెండేళ్ళకో, మూడేళ్ళకో వచ్చి వెళ్తూ ఉంటారు. మానస కూడా ఆవిడనలాగే చూస్కుంటుంది కూతురిలా. అందుకే







ఇంత బాధ.

★ ★ ★

అలారం పెట్టుకుని మూడు గంటలకే లేచిన మానస గబగబ టిఫిన్, కాఫీతయారు చేసి హాట్‌పాక్‌లో, ఫ్లాస్కులో సర్దింది. రెండు మూడు రకాల కూరలు, పచ్చళ్ళు, సాంబారు చేసింది. ఆ పూటకు సరిపడా టేబిల్‌పై ఉంచి, మిగిలినవి ఫ్రిజ్‌లో ఉంచింది. అన్నీ ఆనంద్‌కు చూపింది.

ఒకవేళ హిమ వచ్చేసరికి తను రాలేక పోతుందేమోనని, కూతురుకు అవసరమయ్యే డ్రెస్‌లూ, నైటీలు, బీర్వాలో సర్దుతుంటే ఆనంద్ వచ్చాడు.

"హిమ బీర్వా కూడా సర్దుతున్నావంటే లాంగ్ ట్రిప్పేనన్నమాట" అన్నాడు.

"అయ్యో, కాదండీ, ఎందుకైనా మంచిదని. ఒకవేళ నేను లేకపోయినా, అది ఇబ్బంది పడకూడదని..."

"నాకేం సంజాయిషీలు అక్కర్లేదు.. పసిపిల్ల అది. ఏడాది తర్వాత వస్తోంది ఇంటికి. అప్పటికి నువ్వు లేకుంటే ఎంత బాధపడుతుందో ఆలోచించు."

మౌనంగా బీర్వా లాక్‌చేసి తాళాలు దానికే ఉంచేసింది. ఆ రోజుకు కావలిసిన షర్టూ, ప్యాంటూ తీసి మంచంపై పెట్టబోతుంటే, మానస చేతిలోంచి లాక్కున్నట్టు తీసుకున్నాడు ఆనంద్. అవి మళ్ళీ బీర్వాలో పడేసి విసురుగా తలుపు మూశాడు.

"నీకు మతి పోయిందా? టైము చూడు ఎంతయిందీ? నాల్గురోజులు మేం ఎలాగో సర్దుకుంటాం. నువ్వెళ్ళిరా." మానస కళ్ళలో నీళ్ళు చూసిన ఆనంద్ చిరునవ్వు తెచ్చుకున్నాడు ముఖం మీదకు.

నమ్మలేకపోయింది.

అతడికి తనపై చాలా కోపం వచ్చిందని బాధపడుతున్న మానసకు ఆ చిరునవ్వు మలయ మారుతంలా తోచింది. అలాగే చూస్తున్న మానసను దగ్గరకు తీస్కొన్నాడు ఆనంద్.

అతడి కళ్ళలో సన్నటి నీటి పొర.

"తొందరగా వచ్చేయి మనూ, నువ్వు లేకుండా నేను అస్సలు ఉండలేను." పసిపిల్లవాడిలా చెప్తున్న అతడిని చుట్టేసి "అలాగే.. నేను కూడ మిమ్మల్ని వదిలి బ్రతకలేను ఆనంద్" అంది మానస.

## 4

ఎయిర్‌పోర్టుకు అఖిల్‌తో కలిసి వచ్చిన తరుణ్, మానస కనిపించగానే "అదుగో ఆంటీ" అంటూ అరిచేడు.

తరుణ్‌ను దగ్గరకు తీస్కుని ముద్దాడింది మానస. అఖిల్ వైపు చూస్తూ "మీరు కల్పన బ్రదర్ కదూ!" అంది మానస పలకరింపుగా.

"అవునండీ! ప్రయాణం బాగా జరిగిందా? " అడిగేడు.

"ఆc... ఎంతండీ, అక్కడ ఎక్కి ఇక్కడ దిగేను" అంది చిరునవ్వుతో మానస.

"ఆంటీ మీరు లేనపుడు జిమ్మీకి పాలు ఎవరు తాగిస్తారు? " దిగులుగా అడిగేడు.

"నువ్వు జిమ్మీని మరిచిపోలేదా? నానమ్మగారు పోస్తారు పాలు."

కారు ఆగగానే ఎదురొచ్చి మానస చేతులు పట్టుకొంది కల్పన. మానసను చూడగానే ఆమె గుండె బరువు తగ్గింది.

ఇద్దరి కళ్ళలోనూ మెరుస్తున్న తడిని చూసి "స్నేహమంటే... ఇదీ. అనుకున్నాడు అఖిల్.

బంగారి వచ్చి అఖిల్ చేతిలో అట్టపెట్టెను అందుకుంది.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

"చందన ఎక్కడ? " నెమ్మదిగా అడిగింది మానస.



"మైల్డ్ సెడేషన్‌తో నిద్రపోయింది" అంది కల్పన. వెంటనే చందనను చూడ టానికి సంశయించింది మానస.

సేఫ్‌గా రీచ్ అయ్యానని మానస మొబైల్‌లో ఆనంద్‌కు చెప్పింది.

★ ★ ★

కళ్ళు మూసుకుని అటు తిరిగి పడు కొంది చందన.

చందన నిద్రపోవటం లేదని గమనించి ఆమె భుజంపై చెయ్యి వేసింది మానస.

"నువ్వు ఆస్పత్రికి వెళ్ళు. పడుకుంటా నులే" అంది చందన కల్పన అనుకొని.

"చందూ!" పిలిచింది మానస.

ఉలిక్కిపడి వెనుతిరిగి చూసిన చంద నకు నోట మాటరాలేదు. "మనూ! నువ్వా? " అంది.

ఒక్కసారిగా వెనుతిరిగి మానస చేతుల లో ముఖం దాచుకొందామె.

"చందూ!" మమ్మల్ని ఏం చేద్దామని అలాంటి పని తలపెట్టావు? " తల నిము రుతూ గద్గద స్వరంతో అంది మానస.

నెమ్మదిగా లేచి కూర్చుంది చందన.

"నా కోసం ఇంత దూరం పరిగెత్తుకొ చ్చావా? నా వల్లేగా మీ అందరికీ ఈ కష్టం? " దిగులుగా అందామె.

"ఏం ఫర్వాలేదు నీ ఆరోగ్యం పాడయితే, పసివాడు తరుణ్ ఏమవ్వాలి చెప్పు? " చందన చేతి గాజులను అటూ ఇటూ జర పుతూ అడిగింది మానస.

బంగారి ముగ్గురికీ కాఫీ అందించింది. నోటి దగ్గరైనా పెట్టుకోకుండానే బాత్ రూమ్‌లోకి పరిగెత్తింది చందన. ఆమె వాంతి చేసుకోవటం తెలుస్తోంది.

మానస ముఖంలో ఆందోళన చూసి నెమ్మదిగా చెప్పింది కల్పన.

"మార్నింగ్ సిక్‌నెస్"

"అక్కా!" అఖిల్ పిలుపుకు లేచి వెళ్లింది కల్పన. "ఆఫీసుకు వెళ్తున్నాను. తరుణ్‌ను నాతో తీస్కెళ్తున్నాను." అని చెప్పేడు.

"సరే!" అంది కల్పన.

తరుణ్ పేరు వినపడటంతో ఏమిటని అడిగింది చందన.

"తరుణ్, అఖిల్‌తో వెళ్తున్నాడు. లంచ్ టైమ్‌కు వచ్చేస్తారట" చెప్పింది కల్పన.

"బంగారీ! ఫ్రంట్ డోర్ వేసిరా" అంటూ కిచెన్ వైపు ఓ కేక వేసింది కల్పన.

"ఆయన లేరా? " అడిగింది మానస.

"ఆc ఆ మహారాజు వచ్చిన నాడు వచ్చి నట్టు, లేనినాడు లేనట్టు" నిర్లిప్తంగా చెప్పింది కల్పన.

చందన ముఖంలోకి చూస్తూ, తిరిగి "ఈ మొద్దు ఏదో కష్టాలన్నీ దీనికే ఉన్నట్టూ, మనమంతా హ్యాపీలైఫ్ ఎంజాయ్ చేస్తున్నట్టు అనుకొంటుంది"

స్నేహితురాళ్ళిద్దరి ముఖాలలోకి చూసి తలవంచుకొంది చందన.

"నా బాధ ఎవరికి చెప్పుకోను? మేజర్ వర్మగారి భార్యను. డాక్టరుగా సొసైటీలో ఒక హోదా ఉంది నాకు. కాని... కాని నా మనసులో గూడుకట్టుకున్న బాధ ఏమిటో తెల్సా మీకు? చెప్పనా? "

చెప్పమన్నట్టు చూసేరిద్దరూ మౌనంగా.

"మేజర్ వర్మగారు ఒక టీవీ ఆర్టిస్ట్‌తో షికార్లూ, టూర్లు సాగిస్తుంటే... అతడిం టికి కాపలా కుక్కలా ఉంటున్నా. ఒక్కగా నొక్క కొడుకు అజయ్! తండ్రి చేష్టలు చూసి పాడౌతాడని, పిన్ని దగ్గర బెంగుళూ రులో చదివించుకోవల్సి వస్తోంది"

"ఏం చదువుతున్నాడు వాడు? " అడి గింది మానస.

"ఎయిత్" కల్పన స్వరంలో పలికిన జీరకు, ఆమె ముఖంలోకి చూసింది చందన. కల్పన కళ్ళు వర్షించటానికి సిద్ధంగా ఉన్న మేఘాల్లా ఉన్నాయి.

తనవైపే చూస్తున్న చందనతో, "చందూ! గలగలా నవ్వేస్తూ, చైతన్యానికి

మారుపేరులా కనిపించే అఖిల్ గుండెలో ఎన్ని అగ్నిపర్వతాలు దాచుకున్నాడో తెల్సా? " కల్పన ముఖంలోకి చూసి తల దించుకొంది చందన.

"అఖిల్‌కు ఏమైంది చెప్పు? " ఆసక్తిగా అడిగింది మానస.

"వాడు డిగ్రీ చదివే రోజులలోనే తల్లీ, తండ్రీ, చెల్లి స్వర్ణ ఉన్న విమానం బే ఆఫ్ బెంగాల్‌లో కూలిపోయింది"

ఉలికిపడి చూసింది చందన. 'అతడూ తనలాగే అనాథ అన్నమాట'

"ఆ విషాదం నుంచి బయటపడటానికి అతనికి చాలా కాలం పట్టింది. కంప్యూటర్ ఇంజనీరింగ్ చదువుతూ, క్లాస్‌మేట్ చంద్రకు అతడి మనసు దగ్గరవటం, నేను పూనుకొని ఆ పెళ్లి నా చేతులమీదుగా జరిపించటం జరిగాయి" చెప్పటం ఆపి కళ్ళు ఒత్తుకొంది కల్పన.

"ఇపుడు చంద్ర ఎక్కడుంది? " అప్రయత్నంగా అడిగింది చందన.

పేలవంగా నవ్వింది కల్పన. "అయిదేళ్ల క్రితం ఇదే మే నెల. నెలలు నిండి ఉంది చంద్ర. ఊరు వెళ్ళక తప్పలేదు అఖిల్‌కు. నేనున్నానన్న భరోసాతో వెళ్లేడు బాంబే" కల్పన గొంతు గద్గదమైంది.

"ఆ రాత్రే పెయిన్స్ ప్రారంభం అయ్యేయి. హాస్పిటల్ అడ్మిట్ చేశాను. ఈ పాపిష్టి చేతులతోనే సెలైన్ పెట్టేను. కొద్ది నిమిషాలలోనే చంద్ర శరీరం నీలిరంగుకు మారిపోయింది. స్టాఫ్ అందరం ఎంత ప్రయత్నించినా, ఆమెను కాపాడుకోలేకపోయాం... పరిస్థితి క్షణాల్లో చేయి దాటిపోయింది..." కనురెప్పలు గట్టిగా మూసుకుంది కల్పన. ఆమె చెంపలమీద కారుతున్న కన్నీటిని తుడిచింది మానస.

నెమ్మదిగా అడిగింది. "ఎందుకైంది అలా? "

"ఎక్స్‌పైర్డ్ సెలైన్ స్టాకును కొత్త లేబిల్స్ వేసి సప్లై చేశారట. అందులోంచి మొదటి

## కొత్తగాలి...

**సంచులతో డబ్బు**
**జేబుల్లో సరుకు**
**దిగిరాని ధరలు**
**దగాలో ప్రజలు**

-పి.నరసింహారావు,
దుబ్బాక, నల్లగొండ జిల్లా

ప్యాక్‌ను చంద్రకే పెట్టటం జరిగింది. ఆ క్రూరమైన ధనాశకు తల్లీ బిడ్డా బలైపోయారు. మరునాడు, పుట్టబోయే బిడ్డకోసం ఎన్నో కొని తెచ్చిన అఖిల్ జరిగిన సంఘటనతో పిచ్చివాడైపోయేడు. చంద్ర సాంగత్యంలో గతాన్ని మరిచి హాయిగా బతుకుతున్న అతడిని, విధి గుండెపై గురి చూసి కొట్టింది. ఆ దెబ్బతో రోజుల తరబడి వెలుగును చూడకుండా, ఆహారం తీసుకోకుండా గడిపేవాడు. పసివాడ్ని లాలించినట్లు లాలించి, బుజ్జగించి మళ్ళీ మనిషిని చేస్కున్నాను. భర్త ఉండీ ఒంటరి బతుకు బ్రతుకుతున్న నాకు ఆసరాగా నిలబడ్డాడు" ముగించింది కల్పన.

గలగలా నవ్వేస్తూ, జోకులేస్తూ హడావుడిగా తిరిగే అఖిల్ గుండె ఒక అగ్ని పర్వతమా ఆశ్చర్యపోయింది చందన.

కళ్ళు మూస్కుని వెనక్కు వాలి కూర్చున్న కల్పనను చేతులు పట్టుకుంటూ అంది చందన. "కల్పనా, ప్లీజ్ బాధపడకు. నావల్ల గతం అంతా మళ్ళీ గుర్తుచేస్కొని, తల్చుకొని బాధపడ్తున్నావ్ కదూ" పశ్చాత్తాపం ధ్వనించింది ఆమె స్వరంలో.

"బాధ పడటం అన్నది ప్రతి జీవితంలోనూ, ఎపుడో ఒకపుడు తప్పదు. ఆ సమయంలో ధైర్యం కోల్పోకుండా నిలబడగలిగితే, ఆ కష్టాన్ని అధిగమించవచ్చు !"

కల్పన మాటలకు "అవును" అంటూ మంచంపై వాలింది మానస. జరిగి చోటి

## కొత్తగాలి...



**నేను క్షేమమే...**
**నా పల్లె**
**ప్రాజెక్టులో**
**బతుకమ్మ**

*-మంత్రి లక్ష్మీనారాయణ,*
సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా

చ్చింది చందన. "మీ సమస్యలు మీకుండగా నేను వచ్చి మీకింకా తలనొప్పిని సృష్టిస్తున్నాను కదూ!" అంది చందన.

"నువ్వు బేలవైపోకుండా ఒక నిర్ణయం తీస్కోవాల్సిన సమయం ఇది. అదీ సరైన నిర్ణయం సుమా!" అంది మానస.

చందన చాలాసేపు ఆలోచించింది.

"నేను మరో బిడ్డకు న్యాయం చేయలేను. అలా అని ఒక ప్రాణాన్ని బలీ తీసుకోలేను!" కంపించింది ఆమె స్వరం.

కల్పన కసురుకుంది. "ఏయ్ నీకు ఆలోచనలేదా? ఎందుకలా బెంబేలెత్తిపోతావ్? అసలు ఓసారి హాస్పిటల్‌కు వెళ్దాం. కన్‌ఫర్మ్ చేస్కోవాలిగా అవునో... కాదో!"

మానస తయారైవచ్చింది. చందన కూడ లేచి అద్దంలో చూస్కుంటూ, తలా, చీరా సర్దుకుంది.

"టిఫిన్ తింటారామ్మా!" అంటూ బంగారి ప్లేట్లు తెచ్చింది.

"బంగారీ, ఇక్కడ నువ్వే మాకు పెద్ద దిక్కువి. ఈ పరిస్థితిలో మమ్మల్ని ఏం చేయమంటావ్ చెప్పు" అంది కల్పన.

"చంద్రమ్మా, అఖిల్ బాబూ కావాలని కలలు కన్నబిడ్డ ఈ ప్రపంచాన్నే చూడకుండా ఎగిరిపోయింది" ఆగి కళ్ళు తుడుచుకుంది బంగారి. తర్వాత తనే-

"బిడ్డను నేను పెంచుతాను. మీరు దిగులు పడొద్దు. పిల్లల్ని కనకపోయినా పిల్లలంటే ఏమిటో, ఎలా పెంచుకోవాలో తెలుసమ్మా" దుఃఖంతో పూడిపోయింది ఆమె గొంతు.

బంగారిని దగ్గరకు తీస్కుంది కల్పన.

"థాంక్యూ బంగారీ, థాంక్యూ! నీ మనసే బంగారం" అంటూ.

★ ★ ★

డాక్టర్ టెస్టులవీ చేసేక ప్రెగ్నెన్సీ కన్‌ఫర్మ్‌చేసి చెప్పింది. తీస్కోవలసిన జాగ్రత్తలు చెప్పి, మందులు రాసిచ్చింది. అక్కడే మెడికల్ షాపులో మందులన్నీ తీస్కుంటున్న కల్పనవైపు అయోమయంగా చూసింది చందన.

కల్పన నిర్ణయం చూచాయగా అర్ధమైంది చందనకు. ఏదీ ఆలోచించగల స్థితిలో లేదు ఆమె మానసిక స్థితి.

హాస్పిటల్ బయటకు వచ్చేరు. కల్పన మనస్సు తేలికపడింది. సమస్యను బంగారి పరిష్కరిస్తుందని వూహించలేదామె. ఆనందంగా వుంది. అఖిల్‌కు కూడ ఈ విషయం చెప్పాలనుకుంది.

మానస ఆలోచన మరోలా ఉంది. కల్పన ఆలోచన బాగానే వుంది. కాని... చందన భవిష్యత్తుకే ఒక ప్లాను లేదు. ఎలాగో... ఏమో కాని, కల్పనకు ఇలాంటి విషయాల్లో నిర్ణయం తీసుకోగల ధైర్యం, చొరవ వున్నాయి.

"ఆటో!" వేగంగా వెళ్తున్న ఆటోను పిలిచింది కల్పన. అది ఆగలేదు. "అటువైపుకు వెళ్తే దొరుకుతాయి ఆటోలు" అంది కల్పన. రోడ్డు క్రాస్ చేయటానికి ముగ్గురూ చేయీ చేయీ పట్టుకున్నారు. "రండి... రండి" అంటూ రోడ్డు క్రాస్ చేస్తున్నారు. చటుక్కున చందన మానస చెయ్యి విడిచిపెట్టేసింది. కీచుమన్న బ్రేకుల శబ్దాలు.

ట్రాఫిక్ ఆగిపోయింది.

కన్ను మూసి తెరిచేలోగా ఏం జరిగిందో తెలియలేదు.

ఒక అడుగు వెనకబడిన చందనను

వేగంగా వస్తున్న ఆటో గుద్దేయటం... ఆమె అంత దూరాన ఎగిరి పడిపోవటం క్షణాల్లో జరిగిపోయింది.

"చందూ... చందూ" అంటూ పరుగు తీశారు మానసా, కల్పనా.

రక్తం కారుతోంది చందన కాలుకైన గాయం నుంచి. స్పృహలోనే వుంది. కాని షాక్‌లో మాట్లాడ లేకపోతోంది. కుడిచేయి అంతా రక్తసిక్తంగా వుంది. ఎవరో ఇచ్చిన నీళ్ళ సీసా అందుకుని మానస ఏడుస్తూ చందన నోట్లో పోస్తోంది.

ఏక్సిడెంటు చూసి అటుగా వెళ్తున్న కారు వాళ్ళు ఆగేరు. ఆ కార్లోవున్న ఇద్దరూ దిగి వచ్చి చందనను జాగ్రత్తగా ఎత్తి బ్యాక్ సీట్లో పడుకోబెట్టారు. కాలు నుంచి రక్తం ఎక్కువగా కారుతోంది. తన చున్నీ తీసి బిగువుగా కట్టింది కల్పన గాయం చుట్టూ.

తమ హాస్పిటల్‌కు తీస్కెళ్ళమని చెప్పింది డ్రైవ్ చేస్తున్న అతడికి. మానస మౌనంగా రోదిస్తూనే ఉంది.

చందన కావాలనే ఇలా చేసిందనిపించింది కల్పనకు.

"చందనా ఎలా వుందే?" కల్పన ప్రశ్నకు సమాధానం రాలేదు. కంగారుగా కుదిపి పిలిచింది "చందూ... చందూ!" అంటూ.

బలవంతంగా కళ్ళు తెరిచింది చందన.

కారు హాస్పిటల్ ముందు ఆగింది. కల్పన రిసెప్షన్‌లో మాట్లాడి వచ్చింది. ఆమెను చూస్తూనే సెక్యూరిటీ గార్డు సెల్యూట్ చేశాడు. కార్లో తీస్కువచ్చిన వారికి కృతజ్ఞతలు తెలియజేసింది కల్పన.

చందనను స్ట్రెచర్‌పై పడుకోబెట్టారు. పల్సు చూసిన కల్పన, మానస వైపు చూసింది సంతృప్తిగా. "పల్స్ బాగానే వుంది మానసా, నువ్వేం వర్రీ అవకు. ఒక్కసారి ఇంటికి ఫోను చేసి, అఖిల్ వస్తే ఇక్కడకు రమ్మని చెప్పమను" మానసకు చెప్తూనే స్ట్రెచర్ వెంట పరుగు లాంటి నడకతో వెళిపోయింది కల్పన. యాంత్రికంగా ఫోను దగ్గరకు నడిచింది మానస.




**చం**దనకు కాలుపై, మోకాలు వెనుక కుట్లు పడ్డాయి. కుడిచేయి మోచేతి దిగువ భాగం కొట్టుకుపోయింది. కడుపులో నొప్పి అని మెలికలు తిరగసాగిందామె. పరిస్థితి అర్థమైంది కల్పనకు. కొలీగ్ డాక్టర్ అరుణ, కల్పనకు పరిస్థితిని వివరించింది.

తనకు సంతోషంగా స్వాగతం పలికే వారెవరూ అక్కడ లేరనీ, రాంగ్ నంబర్‌కు వచ్చాననీ కడుపులో బిడ్డకు అర్థమైనట్లుంది. బయటకు రాకుండానే తనను మోయవలిసిన తల్లిని అంత బాధపెట్టటం నచ్చనట్లు, వచ్చిన దారినే వీడ్కోలు తీస్కుంది. కొన్ని సమస్యలను దేవుడే పరిష్కరిస్తాడు! మానస, కల్పనా కుర్చీలలో చేర్లబడ్డారు.

తలుపుతీసిన శబ్దానికి తలెత్తింది కల్పన. వగరుస్తూ నిలబడ్డ అఖిల్, ఒంట్లో ఓపిక లేనట్టు ఒక కుర్చీలో కూలబడ్డాడు. రెండు చేతులు తలకు చెరోవైపు వేస్కుని వెనక్కు చేర్లబడ్డాడు.

అతడి ముక్కుపుటాలు అదురుతున్నాయి. అతడి మనసులో గతపు నీలినీడలు కదలాడుతున్నాయి.

ఇలాగే... ఇలాగే సడన్‌గా, ఇదే హాస్పి





## కొత్తగాలి...

**అప్పుచేసి**
**పప్పుకూడు**
**నిజం చేసి**
**కంది పప్పు**

– బద్దినాగేశ్వరరావు,
అనకాపల్లి

టల్‌కు పరిగెత్తుకు వచ్చాడు ఐదేళ్లక్రితం! 'చందూ...' 'చందూ' అని ఉచ్చరించాయి పెదవులు అప్రయత్నంగా. కళ్లనుంచి రెండు నీటిబొట్లు చెంపలపైకి జారాయి.

కల్పన అఖిల్‌ను సమీపించి తల నిమురుతూ "ప్లీజ్ కంట్రోల్ యువర్‌సెల్ఫ్" అంది. ఉలిక్కిపడి చుట్టూ చూసి లేచి బయటకు వెళ్లిపోయాడతను.

మానస, కల్పన ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది. అఖిల్ ప్రవర్తన ఆమెకు అంతు పట్టలేదు. 'చందూ' అంటూ అతడు పడిన ఉద్వేగం ఎందుకో ఆమెకు అర్థంకాలేదు.

మానస స్థితిని గమనించిన కల్పన చిన్నగా చెప్పింది. "అఖిల్, భార్యను 'చందూ' అని పిల్చుకొనేవాడు. ఇదే హాస్పటల్‌లో వారి జీవన మాధుర్యాన్నీ తన కడుపులోనే దాచుకుని దూరతీరాలకు కదిలిపోయింది చంద్ర!" కిటికీలోంచి బయటకు చూస్తూ బాధగా చెప్పింది కల్పన.

తరుణ్‌ను తీస్కొచ్చేడు అఖిల్. "ఇక్కడేం చూడవలసి వస్తోందో తెలియక తరుణ్‌ను బయటవదిలి వచ్చేను" నెమ్మదిగా చెప్పేడు కల్పనకు.

"నువ్వింత డెలికేట్ అయిపోతే ఎలారా? " దిగులుగా అడిగింది కల్పన.

"డెలికేటా? రాంగ్ అక్కా... రాయిలా మొండిగా బ్రతుకుతున్నాను!" గద్గదంగా ఉంది అతడి స్వరం.

కల్పన అతడి చెయ్యి పట్టుకుని తల వాల్చి నిలబడింది. చేతిపై పడిన కన్నీటి బిందువుకు ఉలిక్కిపడి కల్పన ముఖంలోకి చూసేడు. తలతిప్పుకొంది కల్పన "నేనే చేసేన్రా నిన్ను రాయిని!" అంటూ.

అఖిల్ బాత్‌రూమ్‌లో ముఖం కడుక్కొని కర్చీఫ్‌తో తుడుచుకుంటూ వచ్చేడు. "సారీ అక్కా" అన్నాడు కల్పనతో.

యాక్సిడెంట్ ఎలా అయిందో అడిగి తెల్సుకున్న అతడు "ఆవిడ కావాలనే చేసిందా ఇలా? " అడిగేడు.

"నాకు అదే అనుమానం" అంది కల్పన.

నెమ్మదిగా "అమ్మా" అంటూ కదిలింది చందన. కళ్లుతెరిచి చుట్టూ చూసింది. పెదవులు అదురుతున్నాయి. కన్నీళ్లు కారుతున్నాయి.

"నువ్వలా చేయక పోవల్సింది. తృటిలో ప్రమాదం తప్పింది".

"ఛ.. ఛ! నేను... కావాలని చేయలేదు. కల్పనా, నన్ను నమ్ము" అంది హీన స్వరంతో.

"అమ్మా" అంటూ చేతిని, కాలును చేత్తో పాముకుంది నెమ్మదిగా.

"కల్పనా.. నేను చెప్పేది నిజం. మన ముందు నుంచి వెళ్లిన ఆటోలో మధు కనిపించాడు" ఆగింది చందన.

"మధా? " ఆశ్చర్యంగా అడిగింది కల్పన. అదిరిపడింది మానస ఆ పేరు వింటూనే!

"అతడు... నన్ను ఎక్కడ చూస్తాడో... మళ్లీ మీ అందరికీ చికాకు... అని ఒక అడుగు వెనక్కు వేసేను అప్రయత్నంగా... అంతే ఆ తర్వాత... నాకు తెలియదు." ఆయాసపడుతూ చెప్పింది చందన.

ఏదో గుర్తువచ్చినట్లు ఎడమ చేత్తో పొత్తి కడుపుపై చేయుంచి చూస్కుంది. అఖిల్ నెమ్మదిగా గదిలో మూలగా ఉన్న కుర్చీ దగ్గరకు వెళ్లిపోయాడు.

"నా బిడ్డ... నన్ను అమ్మగా వద్దని వెళ్లిపోయింది కదూ!" రోదించింది చందన.

తరుణ్ "మమ్మీ కేమైంది? " అంటూ

చిన్నగా ఏడుపు మొదలుపెట్టాడు.

"చందనగారూ, తరుణ్ వచ్చేడు, కాస్త కంట్రోల్డ్‌గా వుంటారా, వాడు భయపడి పోతున్నాడు"

అఖిల్ మాటలతో అతడు కూడ అక్కడ వున్నాడని గమనించింది చందన.

ఇబ్బందిగా కదలబోయి నొప్పికి 'అమ్మా' అంది. "కాలు చాలా నొప్పిగా వుంది. ఏమైంది నా కాలుకు? " భయం తొంగిచూసిందామె ముఖంలో.

"ఏం కాలేదు. చిన్న గాయాలే చందనా. వర్రీ కావల్సినవి కావు. రెండ్రోజుల్లో ఇంటికి వెళ్లిపోదాం" చెప్పింది కల్పన ఆమె పక్కలో కూర్చుంటూ.

"మమ్మీని ఎవరు కొట్టేరు? వెళ్లిపోదాం మమ్మీ" ఏడవసాగేడు తరుణ్.

"తరుణ్ అరె... అలా అమ్మాయిలా ఏడవకూడదు! హీరోలా నిలబడాలి" వాడి క్రాఫ్ సరిచేస్తూ అన్నాడు అఖిల్. ఆపుకుంటున్న దుఃఖానికి ఛాతీ ఎగిరి పడ్తోంది తరుణ్‌కు. దగ్గరకు తీసుకుని, కళ్లు కర్చీఫ్‌తో తుడిచాడు అఖిల్.

"నీకివాళ ఒక మంచి ప్లేస్ చూపిస్తా" అఖిల్ ముఖంలోకి చూస్తూ "వూ" అన్నాడు తరుణ్.

గంటక్రితం వచ్చినపుడు అతడి ముఖంలో కనిపించిన విషాద ఛాయలకు, ఇప్పటి ఈ ఛలాకీ మాటలకూ లోలోన ఆశ్చర్యపోయింది మానస.

నవ్వుతూ కబుర్లు చెప్తున్న కొడుకును తృప్తిగా చూసింది చందన.

'హాలాహలం నిండిన తన జీవితంలో, ఈ అమృతమూర్తుల ఆగమనం తనకెంతో వూరట కలిగిస్తోంది. కల్పన, మానస, అఖిల్. వీళ్ళ రుణం తనెలా తీర్చుకోగలదు?

తనవైపే చూస్తున్న తల్లికి చెయ్యివూపి, అఖిల్ వెంట బయటకు నడిచేడు తరుణ్.

వాళ్ళనే చూస్తూ నిట్టూర్చింది కల్పన. వీళ్ళిద్దరి అనుబంధం చిత్రంగా వుంది. ఎవ్వరితో అంత క్లోజ్‌గా మూవ్ అవ్వని అఖిల్, తరుణ్ గురించి అంత పట్టించుకు చూడటం ఆశ్చర్యంగా వుంది ఆమెకు. ఆఖరుకు తన కొడుకు అజయ్‌ని కూడ అంత ఎంటర్‌టైన్ చేయడు. ఎపుడూ స్తబ్దంగా అవసరమైన మటుకే మాట్లాడే అతను ఇన్నాళ్ళకు మళ్ళీ హాయిగా నవ్వుతూ తుళ్ళుతూ తిరగటం చూసి ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి!

డాక్టర్ అరుణ రావటంతో కల్పన ఆలోచనలు చెదిరిపోయాయి.

చందనకు బి.పి. వగైరాలు చెక్‌చేసి చూసి తృప్తిగా నిట్టూర్చిందామె.

"ఎల్లుండి ఇంటికి వెళ్ళిపోవచ్చు. అది కూడ కాలి గాయం వల్ల. ఇంట్లో రెస్ట్ ఇవ్వగలం అనుకుంటే రేపే తీస్కెళ్ళొచ్చు" చెప్పింది.

ఇక్కడ పరిస్థితి చూస్తే ఇలా ఉంది. తను ఇంటికి ఎపుడు తిరిగి వెళ్ళగలదో! మనశ్శాంతి కరువై అక్కడ ఉన్న సోఫాలో ముడుచుకు పడుకుంది మానస. వచ్చే ముందురోజు రాత్రి అత్తగారు చెప్పిన మాటే పదేపదే గుర్తువచ్చి బాధిస్తోంది.

"ఒక్కసారి ఇంటికి ఫోను చేసొస్తాను" అంటూ వెళ్లింది కల్పన.

చందనకు కళ్లు మూసినా, తెరిచినా జరిగిపోయిన, జరుగుతున్న సంఘటనలే పీడ కలలా పదేపదే మదిలో మెదుల్తున్నాయి.

మధు ఢిల్లీకి తన అన్వేషణలోనే వచ్చి ఉంటాడు! ఈ ఆలోచనతో కళ్లు మూతపడేసరికి అతడు రాక్షసుడిలా తనను వేటాడుతున్నట్లు కలలు!

★ ★ ★

బంగారి కేరియర్ తెచ్చింది. పరిస్థితి విని కళ్లనీళ్లు పెట్టుకుంది. "పోనీలే అమ్మా. గండం గట్టెక్కింది" అంది.







చందనకు పాలూ, బ్రెడ్ కొసరి కొసరి బతిమిలాడి తినిపించింది ఆమె.

మర్నాడు ఉదయం డ్రెస్సింగ్ ఛేంజ్ చేసేక ఇంటికి తీస్కెళ్ళటానికి నిర్ణయించుకొంది కల్పన. అఖిల్, తరుణ్‌ను ఆ రాత్రి తన దగ్గరే ఉంచుకున్నాడు.

చందనను డిశ్చార్జి చేస్తున్నట్లు ఫోను చేయటంతో కారు తీసుకు బయల్దేరాడు హాస్పిటల్‌కు అఖిల్.

మెడిసిన్స్, ఫ్లాస్కు వగైరాలన్నీ ఒక బాస్కెట్‌లో సర్దేసి కారుకోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు కల్పన, మానసా.

మధు కనిపించేడని చందన చెప్పిన మాట సడన్‌గా గుర్తొచ్చింది కల్పనకు.

"చందూ! ఒక్క విషయం అడుగుతాను. నిజం చెప్పాలి" అంది కల్పన.

చిరుకోపంగా చూస్తూ "నీకు అబద్ధం చెప్తానా నేను? " అంది చందన.

"నిన్న మధు కనిపించేడన్నావ్. నిజమే కదూ. కావాలని అలా చేయలేదుగా? "

పేలవంగా నవ్వింది చందన. "ఒకసారి ఆత్మహత్య చేస్కోవాలనుకొన్న మాట నిజం. అప్పుడు, తరుణ్‌ను అనాథగా వదిలి వెళ్లడం ఇష్టంలేక నాతోనే తీస్కెళ్దాం అనుకున్నది నిజం! నిన్న మధును స్పష్టంగా చూశాను. గెడ్డం పెరిగి ఎలాగో ఉన్నాడు"

"నీ కోసమే వచ్చేడంటావా? "

"ఇంకెందుకు వస్తాడు? బ్యాంకులో ఐదు లక్షలు కావాలి అతడికి"

"చందన అడ్రస్ కావాలని అడిగితే ఢిల్లీ వెళ్లిందని మాత్రం ఈ మహానుభావుడు ఎందుకు చెప్పాలి? " బాధగా అంది ఆనంద్ గురించి మానస.

తరుణ్ వచ్చేడు "మమ్మీ!" అంటూ. వాడిచేయి తనచేతికి తగలడంతో "అమ్మా!" అందామె.. బిక్కముఖం పెట్టాడు.

వెనుకే అఖిల్ వచ్చాడు.

మందులూ, బట్టలవీ ఉన్న ప్లాస్టిక్ బాస్కెట్ అందుకోబోయిన అతడిని వారించింది మానస.

"ఫర్వాలేదండీ. బరువేం లేదు" అంటూ చందనను వీల్‌ఛైర్‌లో తీస్కెళ్లి కారెక్కించారు. ఇదంతా లాంజ్‌లో స్తంభం చాటునుండి ఒక వ్యక్తి రహస్యంగా గమనిస్తున్నట్లు వారికి తెలియదు. ఆలోగా "డాక్టర్" అంటూ వచ్చి, కల్పనకు ప్రిస్క్రిప్షన్ ఇచ్చింది నర్సు.

ఆమెకు 'థ్యాంక్యూ' అని చెప్పి హాస్పిటల్ ప్రెమిసెస్‌లోనే ఉన్న మెడికల్ షాపులో మందులు తీస్కుంది కల్పన.

కారు హాస్పిటల్ గేటు దాటగానే అతడు బయటకు వచ్చి "సిస్టర్, సిస్టర్" అంటూ ఆత్రంగా పిలిచేడు.

"ఎస్" అంటూ వెనుదిరిగింది సిస్టర్.

"నేను ఆ డాక్టర్‌గారితో అర్జెంట్‌గా మాట్లాడాలి. ఫోన్ నెంబర్ కావాలి" కారు వెళ్ళిన దిక్కే చూపిస్తూ అడిగేడు ఆ వ్యక్తి... మధు.

"ఎవరు మీరు? " అనుమానంగా చూస్తూ అడిగిందామె.

"కాగితాలు పడేసుకున్నాను. బంధువులే. ఒకసారి మాట్లాడాలి. చాలా నొప్పిగా ఉంది" బాధగా మాట్లాడ్తున్న అతడికి కల్పన ఫోన్‌నంబర్ ఇచ్చింది నర్సు.

"సిస్టర్ ఆ చక్రాల కుర్చీలో కూర్చోబెట్టారే, ఆవిడకేమైంది పాపం? " సానుభూతి ప్రదర్శిస్తూ అడిగేశాడు వచ్చీరాని హిందీలో.

"ఏక్సిడెంటయి, అబార్షన్ అయింది"

ఉలిక్కిపడ్డాడు చాచి ఎవరో చెంపమీద కొట్టినట్టు. రాయిలా నిలబడిపోయాడు. తనూ, తన తల్లీ పిల్లల కోసం ఎంత ఆశ పడ్డారు! రాక్షసి లేకుండా చేసింది. అయినా ఇంకా దాంతో ఏం అనుబంధం మిగిలింది? కొద్ది రోజులలో శని వదిలి

# శ్వేత సౌధం ఎదుట పోరాటం



అమెరికా అధ్యక్షుడి శ్వేతసౌధం ముందు మానవ హక్కుల కోసం అరవై మూడేళ్ల స్పెయిన్ మహిళ, పిసిటో 28 ఏళ్లుగా పోరాడుతోంది. మొదట్లో 1981లో అణుబాంబు తయారీకి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించింది. తర్వాత ఇరాన్ నుంచి అమెరికా సేనలు వైదొలగాలని కోరింది. వైట్‌హౌస్ గేటు ఎదురుగా పేవ్‌మెంట్ మీద చిన్న గుడారంలో నివసించే ఆమె నిత్యం వివిధ అంశాల ప్లకార్డులను ప్రదర్శిస్తుంది. వీటిని వైట్‌హౌస్‌లోకి వెళ్లి వచ్చే అధ్యక్షుడు, విదేశీ ప్రముఖులూ చదువుతుంటారు. జూనియర్ జార్జిబుష్‌ని అమెరికా లాడెన్‌గా చిత్రించే పోస్టర్‌ని ఆమె ప్రదర్శించింది. ఆమె బాల్యంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకుంది. న్యూయార్క్‌లోని స్పెయిన్ రాయబార కార్యాలయంలో 1953లో పద్దెనిమిదో ఏట ఉద్యోగంలో చేరి, ఇటలీ వ్యక్తిని పెళ్లాడింది. వీరికి కలిగిన ఓ కూతుర్ని తీసుకుని పిసిటో భర్త 1974లో ఇటలీ వెళ్లిపోయాడు. కుమార్తె కోసం చేసిన న్యాయపోరాటంలో ఉద్యోగం పోగొట్టుకుంది. 1981లో నాటి అమెరికా అధ్యక్షుడు రొనాల్డ్‌రీగన్‌ని కలిసి, న్యాయం చేయమని కోరింది. అది తన పరిధిలో లేదని చెప్తే ఆమె వైట్‌హౌస్ ఎదురుగా లపాటే పార్క్‌లో నివసిస్తూ మౌన పోరాటాన్ని సాగించింది. తర్వాత పేవ్‌మెంట్ మీదకి మకాం మార్చింది.




పిసిటో రోజూ తెల్లవారుజామునే నిద్రలేచి అనాథ శరణాలయంలో కాలకృత్యాలు తీర్చుకుంటుంది. దినపత్రికలు తిరగేసి మానవహక్కుల వార్తల ఆధారంగా పోస్టర్స్ చేసి ప్రదర్శిస్తుంది. వైట్‌హౌస్ సందర్శకులు ఆమె గుడారాన్నీ దర్శిస్తూంటారు. వారిచ్చే తినుబండారాలు, డబ్బుతోనే జీవిస్తోంది. 'పిసిటో, వైట్‌హౌస్ గేట్, వాషింగ్టన్ డిసి' ఆమె చిరునామా. ఆమెకు ప్రపంచం నలుమూలల నుంచి వచ్చిన ఉత్తరాలు బట్వాడా చేయడమేగాక, ఆమె రాసిన వాటిని పోస్ట్‌మేన్ డబ్బాలో వేస్తాడు. వైట్‌హౌస్ భద్రతా సిబ్బంది ఆమెను తరిమేయాలని విఫలయత్నం చేసింది.

పోతే హాయిగా మరోపెళ్ళి చేస్కోవచ్చు. 'అయినా ఇది మాత్రం తన సంతానం అని గ్యారంటీ వుందా?' వక్రపు ఆలోచనలతో అతడి ముఖం వివర్ణమైంది.

ఫోన్ నెంబర్ వున్న కాగితాన్ని భద్రంగా జేబులో పెట్టుకున్నాడు.

★ ★ ★

"ఫోన్‌లైను దొరకటమే కష్టమైంది. ఆపైన అక్కడ లిఫ్ట్‌చేసే దిక్కేలేనట్లుంది!" ఆనంద్ ఫోను పెట్టేయబోతుండగా, స్నానంచేసి టవెల్‌తో తుడుచుకుంటూ వస్తున్న అఖిల్ పరుగున వెళ్ళి ఎత్తాడు.

"మానసగారూ ఫోన్ మీకే" అంటూ తెచ్చి ఇచ్చేడు అఖిల్.

"హలో!" అంది మానస.

"చాలా బిజీగా వున్నట్టున్నావ్ పాపం! మ్యూజిక్ వినిపిస్తోంది. ఎంజాయ్ చేయ్. నీ ఇష్టం వచ్చినప్పుడు రా" అంటూ ఫోన్ పెట్టేసేడు ఆనంద్.

"అరె, అపుడే పెట్టేసేరా ఫోన్. కట్ అయిందా?" కుర్చీలో కూర్చుంటూ అడిగేడు అఖిల్.

"మాట్లాడేనులేండి. ఎ.పి.కి ఒక టిక్కెట్టు దొరుకుతుందా?"

"ఎప్పటికి?" అడిగేడతడు.

"టూడేస్‌లో.. పాప హాలీడేస్‌కు ఇంటికి వస్తుంది.. వెళ్ళాలి. కల్పనకూ ఒక మాట చెప్పి, మీకు డేట్ చెప్తాను" అంది మానస.

"రేపటికే అయినా సంపాదించొచ్చు. ఆపాటి పలుకుబడి వుందిలెండి" అంటున్న అతడు మానస ముఖంలో అప్రసన్నతను గమనించకపోలేదు. 'పాపం ఆవిడకేం సమస్యలో!' అనుకున్నాడు.

ఆనంద్ మాటలే ఆమెను బాధిస్తున్నాయి! అతడి కోసం భోజనం చేయ





## కొత్తగాలి...

కొండెక్కిన పప్పు
కొండ దిగని వాన
కొంప ముంచేట్టున్నాయి

– ఎ.మునిశేఖర్ నాయుడు,
మునగలపాళెం, చిత్తూరు జిల్లా

కుండా ఎదురు చూసిన రాత్రులు ఎన్నో! కార్డ్స్ ఆడి ఏ తెల్లవారుజాముకో ఇల్లు చేర తాడు అనేకసార్లు!

అది వాళ్ళ అహంకారం! ఇది తమ దుర్బలత్వం!! ఎన్ని యుగాలైనా ఇంతే!

అఖిల్ తన అవస్థను గమనిస్తున్నట్లు గ్రహించలేదు మానస.

"ఏమండీ ఏమైనా ప్రాబ్లమా? " అడిగేడ తను.

"అహఁ. అదేం లేదు" అంది.

"తెల్సులెండి, మీ మనసుకు రెక్కలు వచ్చి హైద్రాబాద్‌కు ఎగిరిపోయింది!" అన్నాడు నవ్వుతూ.

బలవంతంగా నవ్వింది మానస.

ఆలోగా కల్పన వచ్చింది.

"ఫోను ఎక్కడ్నుంచీ? ఏమైందక్కా? " అడిగేడు అఖిల్.

మానస నెమ్మదిగా లేచి వెళ్ళబోతే చెయ్యిపట్టి ఆపి కూర్చోబెట్టింది కల్పన "రహస్యం ఏం లేదులే" అంటూ.

"అఖిల్ మీ బావగార్ని తీస్కురా వెళ్ళి"

నిట్టూరుస్తూ లేచాడు అఖిల్. అతడు డ్రెస్ ఛేంజ్ చేస్కుని కారు తీసేవరకూ వెళ్ళి బాల్కనీలో నిలబడింది కల్పన. అఖిల్ వెళ్ళేక వచ్చి మానస దగ్గర కూర్చుంది కల్పన.

"ఏమైందీ? " అడిగింది మానస.

"ఏమీ లేదుగాని నువ్వేంటి అలా డల్‌గా వున్నావ్? సడన్‌గా ప్రయాణం అంటున్నావేమిటే? "

మాట్లాడలేదు మానస.

"ఎపుడూ లేనిది నీకింత బాధ కల్గిం దంటే, ఆ మానవుడు నిన్నేదో అనే వుంటాడు!"

"అనటం కాదు. అసలు ఏం బతుకులే మనవీ? చీరలూ, నగలూ, వాళ్ళ పిల్లలను పెంచటం, ఫలానా వ్యక్తి భార్యగా సొసై టీలో చలామణీ అవటం- ఇదేనా జీవితం? ఇంతకంటే ఆనందం ఎందుకు వుండకూడదు జీవితంలో? "

మానస మనసులో రేగిన తుఫాను అర్థ మైంది కల్పనకు. నిట్టూర్చి అడిగింది "ఈరోజు నీకు ఏమైంది మనూ? "

"నా ఒక్కత్తెకే కాదు! అందులో కల్పన, మానస, చందనా ఇంకా రోజా, రాజీ, సీతా, వసంతా, శ్రీలక్ష్మి... ఎందరో ఎందరో నలిగిపోతున్నారు..."

ఆమె ఉద్వేగం ఆగేవరకూ మౌనంగా కూర్చుంది కల్పన.

"మనిద్దరివీ చెరో రకం జీవితాలు. ఏదో లాగేస్తున్నాం కానీ చందూ ఆవేదన వేరు! నేను చూశాను అది అతడితో పడే మాటలు? " మానస అంది.

"పైకి దుర్మార్గుడిలా కనిపించడనుకొం టాను" గుర్తు చేస్కుంటూ అంది కల్పన.

"అదే టాలెంట్. అందరితో తీయగా మాట్లాడతాడు. భార్యను మాత్రం ఈటెల లాంటి మాటలతో పొడిచి పొడిచి బాధి స్తాడు. ఆదర్శం ముసుగు వేసి, పెళ్ళా డేడు. డబ్బులూ ముట్టేయి. ఇపుడు కని పించకుండా పోయిన ఆ రమేష్ గురించి నిత్యం ఎత్తి పొడుస్తాడు. తరుణ్‌ను తరి మేయాలి, చందనను మాత్రం వాడి అవస రాలకు, వాడి తల్లి ఆగడాలకు బానిసగా వుంచుకొంటారట! ఎంత అసహ్యకరమైన ప్రవర్తనంటే, ఏం నేను నీ ముందు మొగు డిలా అనిపించటం లేదా? వాడు నా

కన్నా బాగుండేవాడా? వాడికంత తొందరగా ఎలా పుట్టేడు కొడుకు? నాకేం తక్కువనీ!... ఇంకా అసహ్యమైన టార్చర్"

"పాపం చందన, ఎలా భరించిందో? సంపెంగ పువ్వులా సున్నితంగా ఉండేది. ఆ ముళ్లపంది మనస్తత్వాన్ని ఎలా సహించిందో!" బాధగా అంది కల్పన.

"ఈ యాక్సిడెంటు కూడ ఒక రకంగా చందూ మంచికే జరిగింది అనిపిస్తుంది" అంది మానస. "ఇంకా ఆ దరిద్రుడి బిడ్డను మోయాలా అది? " కసిగా అంది.

"అవును" అంది కల్పన.

"చందూ కొంచెం నార్మలయ్యేక ఏదైనా జాబ్ చూస్తావా? నేను అశక్తురాలిని. నువ్వే దాని మంచీ చెడ్డా చూసి దానంతట అది బ్రతికేలా చేయాలి"

తల పంకించింది కల్పన.

"అదే ఆలోచిస్తున్నాను. ఇక్కడే మాతో వుంటే నాకేం అభ్యంతరం? అందుకు అదే ఒప్పుకోకపోవచ్చు.. పైపెచ్చు మేజర్‌గారి వెకిలి వేషాలకు దానికేం ఇబ్బంది కలుగుతుందోనన్న భయం కూడ నాకు" కల్పన బాధగా అంది ఆఖరి మాటలు.

"నేను వచ్చేక ఆయన అసలు కనిపించలేదు" అంది మానస.

"ఇంట్లో వుండేది అరుదే అయినా, ఆ కొద్ది సమయం కూడ ప్రశాంతంగా వుండరు. హాలులోనే సీసాలూ, గ్లాసులూ పెట్టుకు తాగటం... ఇక కొంచెం తాగేసరికే గుర్రానికి కళ్ళెం వుండదు!" దిగులుగా అంది కల్పన.

కారు లైట్ల వెలుగు చూసి కిందికి చూసింది మానస. ఆగిన కార్లోంచి అఖిల్, మరొక అతడు దిగారు. కారు వెనుక డోరు తెరిచి ఒక భారీ కాయాన్ని పైకి మోసుకు వస్తున్నారు.

మానస "కల్పనా..." అని ఏమో అనేలోగా కల్పన ముఖం పక్కకు తిప్పుకుంది.

దుఃఖంతో పూడిన గొంతుతో "ఇదే నా స్వర్గం... ఇదేనే నా ఆనందం. తాగి తాగి స్పృహ కోల్పోయేక వాళ్ళు ఫోన్ చేస్తారు. అఖిల్‌కు సగంటైం దీనికే సరిపోతుంది... ఒక కడుపున పుట్టకపోయినా నాకు... కొండంత అండగా నిల్చిన దేవుడే వాడు. అఖిల్‌కు ఒకపక్క ఆయనిలా అయిపోయినందుకు బాధ, మరోపక్క బయట నలుగురిలో తలవంపులు. అన్నీ నాకోసం భరిస్తున్నాడు పాపం!"

"ఊరుకో కల్పనా" భుజంపై చేయివేసి నొక్కుతూ అంది మానస వూరడింపుగా.

"అఖిల్ నా పాలిట వరమో, నేను వాడి పాలిట శాపమో అర్థం కావటంలేదు" కళ్లు ఒత్తుకుంటూ అంది కల్పన.

హాలులో సోఫాలో కూర్చుని, బెడ్‌రూమ్‌లోకి వెళ్ళనని పేచీపెడుతున్న వర్మను నెమ్మదిగా బుజ్జగించి లోపలకు తీస్కెళ్ళాడు అఖిల్. అతడి షూస్‌విప్పి మంచం కింద పడేశాడు. అస్తవ్యస్తంగా పడుకొన్న అతడిని సరిగా సర్ది, తలుపులు దగ్గరగా వేసి, తన రూమ్‌వైపు వెళిపోతున్న అతడిని చేయి పట్టుకు ఆపింది కల్పన. "నువ్వేదో తప్పు చేసినట్లు బాధపడతావెందుకు? నీకిలాంటి బాధలు నా మూలంగా కలుగుతున్నందుకు నేను సిగ్గుపడాలి"

"అక్కా" బాధగా అన్నాడు అఖిల్, "నేనిలా బతకగలుగుతున్నానంటే నీ ప్రేమే కారణం. నన్ను నీ నుంచి వేరుచేసి మాట్లాడకు" అంటూ తన గదిలోకి వెళ్లిపోయేడు అఖిల్. ఆ పరస్పర అనుబంధానికి, ప్రేమకు ముగ్ధురాలైంది మానస.

'నాకూ ఇటువంటి తమ్ముడో, అన్నో ఉంటే ఎంత బాగుండేది' అనుకుంది.

★ ★ ★

హాలులో అందరూ కూర్చుని కాఫీలు తాగుతున్నారు. తరుణ్ కార్టూన్ పిక్చర్ చూస్తూ కేరింతలు కొడుతున్నాడు.







మానసకు మర్నాటికే హైదరాబాద్‌కు టికెట్ రిజర్వ్ అయింది.

ఫోన్ మోగటంతో తీశాడు అఖిల్. "డాక్టర్‌గార్ని పిలుస్తారా కొంచెం? " అవ తలి వ్యక్తి కంఠంలో వినయం.

"ఎవరు? " అడిగేడు అఖిల్.

"ఒక పేషెంట్ గురించి మాట్లాడాలి."

అఖిల్ కల్పనకు ఫోన్ ఇచ్చేడు.

"డాక్టర్ గారూ శభాష్! అడ్డూ, బరువూ అనుకొన్న ప్రతిదానిని తొలగించేస్తూ పోతే ఎలా? " అన్నాడా అపరిచితవ్యక్తి.

"ఎవరు మీరు? ఏం మాట్లాడుతు న్నారు? " తీవ్రంగా అడుగుతున్న కల్పనను ఆశ్చర్యంగా చూశారంతా.

"నేనా..." వంకర నవ్వు. "నీ స్నేహితు రాలి రెండో మాజీ భర్తను." ఆ మాట వినేసరికే ఏదో పాకినట్లైంది కల్పనకు.

"మీరు డాక్టరైతే హత్యలు చేసే అధి కారం ఉందనుకొంటున్నారా? పిల్లలు కావాలని ఎదురుచూస్తున్న నాకు తెలియ కుండానే అబార్షన్ చేస్తారా చందనకు? "

అతడి మాటలకు తలపట్టుకుంది "ఓ... గాడ్" అంటూ.

"ఎవరూ? ఏమిటీ? " అని ఫోను అందుకోబోయిన అఖిల్‌ను వారించింది కల్పన.

"మీరు మొదట కాస్త సభ్యత పాటిం చండి మాట్లాడేటపుడు. విషయం పూర్తిగా తెలియకుండా మాట్లాడకండి దయచేసి" ఆవేశంగా అంది కల్పన.

"నాగోడు వింటానికే మీకంత బాధయి తే భార్యా బాధితుడిని నాకెంతుంటుంది? దయచేసి చందనకి ఫోనివ్వండి"

"అది సరేగాని, మీరు ముందు తెల్సుకో వలసిన విషయం, రోడ్ క్రాస్ చేస్తుంటే యాక్సిడెంట్ అయింది. లక్కీగా తను బతి కింది. కడుపులో బిడ్డమాత్రం దక్కలేదు. తెలిసిందా? పిల్లలు కావాలని మీకెంత ఆశో, ఆమెకూ అలాగే ఉంటుంది"

"ఆవిడకి ఆల్‌రెడీ, రెడీమేడ్ ఫస్ట్ మాజీ ఉన్నాడుగా. అయినా నీ ఉపన్యాసం వినను. చందనను పిలువ్ ఒకసారి"

సంభాషణ వింటూ ముగ్గురూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటున్నారు.

చందనను పిలిచింది కల్పన.

వివర్ణమైన ముఖంతో చూసిందామె. మౌత్‌పీస్ మూసి సంగతి చెప్పింది కల్పన.

"మాట్లాడండి" అంటూ కార్డ్‌లెస్ ఫోను అందించాడు అఖిల్, చందనకు.

కంపిస్తున్న చేత్తో అందుకుని "హలో" అంది చిన్నగా. నెమ్మదిగా రిసీవర్ పెట్టేసి వచ్చి చందన ప్రక్కన కూర్చుంది కల్పన.

"ఏం హాయిగా ఉన్నావా నీ కొడుకుతో కలిసి? ఆ దరిద్రుడి క్షేమం కోసం నాకు పుట్టబోయే బిడ్డను హత్య చేశావ్ కదూ! రాక్షసీ నిన్ను వదలను"

నీరసంగా ఉన్న చందనకు అతడి కరకు మాటలకు కళ్లు తిరిగినంత పనైంది.

ధైర్యం తెచ్చుకుని జవాబు చెప్పింది. "చూడు మిస్టర్ మధూ! నేను నీకు దేనికీ ఆన్సర్‌బుల్ కాదు. ఈ పెళ్లాం నాకొద్దు అని... నువ్వంటే, ఈ మొగుడు నాకు వద్దని నేనూ అన్నాను. కోర్టు ఎక్కాక నీడలా నా వెంట తిరగటం ఎందుకు? అన్ని బాధలకూ పరిష్కారం అక్కడే దొరు కుతుంది. ఆలోగా నా మీదేం అధికారం చేయాలనుకోవద్దు."

"ఇదిగో చూడూ, నేను నీ కోసం రాలేదు. ఆ బ్యాంకులో జాయింట్ అకౌంట్ సంగతి తేల్చటానికి వచ్చేను. ఆ ఐదు లక్షలు కావాలి అర్జంటుగా. లేకుంటే నిన్ను వెంటాడతా, వేటాడతా. నీ చిన్నాన్న బుర్ర పగిలింది తిక్క సమాధానాలిస్తే. ఆ మానసనూ బతకనివ్వను..."

"ఇక చాలు మాట్లాడకు. ఆ బ్యాంకు

పేపర్లు సంతకం చేసి పడేస్తా రా."

"కర్మ... కర్మ..." అంటూ నుదురు కొట్టుకుంది మానస.

మౌత్‌పీస్ మూసి అంది కల్పన. "చందనా అతడిని ఇంటికి రమ్మనొద్దు."

చందన జనాంతికంగా అంది, "నేను అతడిని కలవటానికి ఏదైనా ప్లేస్ చెప్పండి" అని.

"రేపు ఉదయం పదింటికి లోటస్ టెంపుల్ దగ్గరకు రమ్మనండి" అని చెప్పేడు అఖిల్. అక్కడ్నుంచి లేచి బయటకు వెళ్ళిపోయాడతడు అప్రసన్నమైన ముఖంతో. అది గమనించిన చందన లోలోన కించపడింది.

అఖిల్ చెప్పిన ప్రకారం చెప్పి యాంత్రికంగా ఫోను పెట్టేసింది చందన.

ఆ రోజు రెడ్‌ఫోర్ట్ దగ్గర తను అన్న మాటలు తననే వెక్కిరిస్తున్నాయి, చెవులలో రింగుమంటూ. 'నాకు సమస్యలున్నాయని మీకెలా తెలుసు?' ఇపుడిదంతా అతడి సమక్షంలోనే జరుగుతోంది. ఈ అవమానం భరిస్తూ బ్రతికి తీరాలి! నెమ్మదిగా లేచి గదిలోకి వెళ్లిపోయింది చందన.

మళ్ళీ మోగుతున్న ఫోనును కల్పన తీసి "అలాగే. సరే." అంటూ పెట్టేసింది.

"ఎవరు? " అడిగేడు అఖిల్.

"మీ బావ. ఊరెళ్తున్నాడట. రెండ్రోజుల వరకూ రాడట."

"ఇంక మార్పు రాదు!" బాధగా అన్నాడు అఖిల్. ఎవరి ఆలోచనలలో వారు భారమైన మనసులతో టిఫిన్ పూర్తి చేశారు.

న్యూస్ పేపరు చూస్తున్న మానసను ఉద్దేశించి "మీరు రేపు వెళ్ళిపోతున్నారుగా, కనీసం అలా షాపింగ్‌కైనా వెళ్దరు గాని. రండి తీస్కెళ్తాను" అన్నాడు అఖిల్.

సంశయంగా అంది మానస "ఎందుకులెండి" అని.

"లేదు మనూ, వెళ్లు. నే వస్తే చందన ఒంటరిగా ఉంటుంది" అంది కల్పన.

తన జవాబు కోసం ఎదురు చూస్తున్న అఖిల్‌తో, "సరే వెళ్దాం. మీరు బిజీ అని అలా అన్నాను."

"ఈవెనింగ్ టైముండదు. మా ఇన్‌స్టిట్యూట్ నుంచి ఇద్దరు యూ.ఎస్.ఎకు వెళ్తున్నారు. ఇపుడైతే ఓ రెండు గంటలు స్పేర్ చేయగలుగుతాను. అందుకనీ" అన్నాడు అఖిల్.

తరుణ్‌ను తీస్కుని అఖిల్, మానసా వెళ్లారు. చందన పడుకోవటంతో కల్పన కూడా రెస్ట్ కోసం సోఫాలోనే పడుకుంది హాలులో.

తమ ముగ్గురి జీవితాలూ, మూడు రకాలు! కాలేజీ రోజుల్లో అది సాధిద్దాం, ఇది సాధిద్దాం అన్న ఊహల ఊయలలూగే మనసులతో ఆనందమయ జీవితం గడిపారు. ఇపుడో... ఇలా తలో రకం బాధతో, అసంతృప్తితో వెళ్లదీస్తున్న అసంపూర్ణ జీవితాలు. అసలు ఏ బాధ లేని మనిషి ఎక్కడైనా ఉంటాడా.?

నెమ్మదిగా నిద్రలోకి జారుకుందామె.

★ ★ ★

కాస్సేపటికే అఖిల్ దగ్గర బిడియం పోయింది మానసకు. అతడి ఓపికకు అబ్బురపడింది. చిన్న విషయాన్ని కూడా నెగ్‌లెక్ట్ చేయడు. కావలసినవన్నీ కొనుక్కొనే వరకూ మార్కెట్స్ అన్నీ తిప్పేడు.

బెడ్‌షీట్లూ, సోఫాకవర్స్, ఆర్టిఫిషియల్

## కొత్తగాలి...

**శ్రమజీవికి సమస్యావలయం**
**సోమరిపోతుకు స్వేచ్ఛానిలయం**
**ఎదలు మీటే కోకిలకెన్నో పాట్లు**
**కాకిమూకలకేమున్నాయి కట్టుబాట్లు**

**-చారి,** హైదరాబాద్



ఇన్‌డోర్ ప్లాంట్స్, హిమకు డ్రెస్‌లూ, అత్త గార్కి దేవుడి దగ్గర వెలిగించే లైట్ల గుత్తులూ వగైరా లెన్నో కొంది.

తనకూ, కల్పనకూ, చందనకూ ఒకే రకం వేర్వేరు రంగులలో తీస్కుంది చీరలు. బంగారికొక చీర తీస్కుంది.

జెంట్స్ కర్చీఫ్‌ల పాకెట్ తీస్కుని అఖిల్‌కు ఇచ్చింది.

"అంటే ఇపుడు నాకేదైనా కొని పెట్టమని బయటకు తీస్కువచ్చేనా? " నవ్వుతూ అందుకున్నాడు. మంచి ఖరీదైన టీ షర్టు ఒకటి సెలెక్ట్ చేశాడు అఖిల్. "బావగారు టీ షర్టులు వేస్తారుగా" అంటూ.

"ఇటువంటి సోదరుడున్న కల్పన అదృష్టవంతురాలు" అనుకుంది మానస. తిరిగొచ్చే దారిలో తమ పరిస్థితులను చెప్పింది మానస. చందన భవిష్యత్ గురించి ఏదైనా ఆలోచించాలని చెప్పింది.

చందన జీవితంలో రెండుమార్లు ఎదుర్కొన్న అవాంఛనీయమైన పరిస్థితులనూ, సంఘటనలనూ వివరించిందతడికి.

చందన బాధ్యత తనదే అన్నట్లు మానస చెప్పిందనిపించిందతడికి.

మౌనంగా తలపంకిస్తూ ఉండిపోయేడు.

తరుణ్ స్తబ్దత గమనించి "అలా ఉన్నావేమమ్మా? " అడిగింది మానస.

"నువ్వెళ్ళిపోతున్నావుగా" దిగులుగా అంటున్న తరుణ్ చుట్టూ చెయ్యివేసి దగ్గరకు తీస్కుంది.

"మళ్ళీ వస్తానుగా. మీరూ రావచ్చు" వింటూనే తల అడ్డంగా తిప్పేడు తరుణ్.

"నో...నేనింక హైదరాబాద్ రాను నాకు ఆ అంకుల్ అంటే ఇష్టంలేదు. ఎపుడూ మమ్మీని నన్నూ తిడుతూ, కొడుతూంటాడు" చెప్పేడు తరుణ్.

"సరే, రావద్దులే" అంది మానస.

"నిన్న ఆ అంకుల్ ఫోన్ చేశాడుగా. వచ్చి తీస్కుపోతాడా మమ్మీని? "

కళ్ళు చెమ్మగిల్లాయి మానసకు.

అతడి లేత మనసులో గూడుకట్టిన నీలి నీడలను తొలగించాలని అఖిల్-

"మై డార్లింగ్ ఛైల్డ్! ఇక నువ్వూ, మమ్మీ ఇక్కడే ఉంటారు హాయిగా. ఎవరు వచ్చినా పంపించంగా!" అన్నాడు.

"నిజంగా? !"

ఎప్పటికీ అంకుల్ దగ్గరే ఉండిపోవాలనిపించే వాడికి అతనలా అనేసరికి మనసులోనే తీయని కలలు కన్నాడు.

★ ★ ★

ఆ రాత్రి స్నేహితురాళ్ళు ముగ్గురూ ఒక చోటే పడుకొన్నారు. తీపిజ్ఞాపకాలూ చేదు వర్తమానాలనూ కలబోసుకున్నారు.

మర్నాడు ఉదయం మధును కల్సుకోవటానికి వెళ్ళేటప్పుడు తను వెళ్ళలేనని చెప్పింది మానస. హైదరాబాద్‌లో అతడితో ఎదురైన చేదు అనుభవాలు మరిచిపోలేకపోతోందామె. "అలా అయితే చందనతో అఖిల్, నేనూ వెళ్తాం. తరుణ్, నీవూ ఇంట్లో ఉందురు గాని" అంది కల్పన.

మళ్ళీ ఎపుడు కలుస్తామో అన్న దిగులు మనసును భారం చేయగా... అన్ని విషయాలు మాట్లాడుకుంటూ నిద్రపోయేరు.

★ ★ ★

ఉదయం మెలకువ వచ్చింది చందనకు. మానసా, కల్పనా నిద్రలో ఉన్నారు. తరుణ్ అఖిల్ దగ్గరే పడుకొన్నాడు. వంటింట్లో బంగారి పని చేసుకుంటోంది.

మంచం ప్రక్కనే ఉన్న కిటికీ తెర తొలగించింది చందన.

"కుక్కతోక బుద్ధి నీది, మారదు. తాగి నానా అల్లరీ చేస్తావు..." వెక్కిళ్ళ మధ్య సాగిపోతోంది కింది పోర్షన్‌లో వీల్ ఛైర్లోని ఆవిడ గొడవ.

అతడు భార్యను బ్రతిమలాడుతున్నాడు. "నీ మీద ఒట్టు. మళ్ళీ తాగితే అడుగు"

అఖిల్ మాటలు గుర్తొచ్చేయి చందనకు,

అతడు భార్యకు చేసే సేవలు చూస్తుంటే "అది బ్లాక్ అండ్ వైట్ మాత్రమే. పంచ రంగులు రాత్రికి చూపిస్తాడు" అని ఆ మాటలకు అర్థం ఇపుడు బోధపడింది. పెదాలపై సన్నని చిరునవ్వు విరిసింది.

నెమ్మదిగా లేచి కూర్చుంది. బంగారి సాయంతో ముఖం కడుక్కు వచ్చి చైర్లో కూర్చుంది చందన "అమ్మా" అంటూ.

"ఒళ్ళు నెప్పులు తగ్గాయే? " మానస లేస్తూ అడిగింది.

"ఆ కాస్త బెటర్"

మెలకువ వచ్చిన కల్పన చటుక్కున లేచి కూర్చుంది "టైమెంతా? " అంటూ.

"బంగారీ, తరుణ్ లేవలేదా? " అడిగింది చందన.

"అఖిల్ బాబుతో కుస్తీపట్లు పడుతున్నా రమ్మా" నవ్వుతూ చెప్పింది బంగారి.

నిట్టూర్చింది చందన. ఆ నిట్టూర్పుకు అర్థం వెతుక్కో సాగింది కల్పన మనస్సు.

ఒక్కొక్కరూ స్నానాలు చేసి బ్రేక్‌ఫాస్ట్‌కు కూర్చుంటున్నారు. ముఖం నిండా పౌడరుతో పరుగున వచ్చేడు తరుణ్ "మమ్మీ... మమ్మీ" అంటూ.

తల్లి ముఖంలో కనపడిన భావం చూస్తూనే ఆగిపోయాడు తరుణ్. తిరిగి అదే పరుగుతో లోపలకు వెళ్ళిపోయేడు.

మౌనంగా టిఫిన్, కాఫీలు ముగించేరు.

ఖాళీ కప్పు టేబిల్‌పై ఉంచుతూ తరుణ్ వైపు చూసింది చందన. నీట్‌గా తల దువ్వి, పౌడర్ వేస్కొని, డ్రెస్ వేస్కొని ముద్దుగా ఉన్నాడు.

తల్లి తనను పరిశీలనగా చూడటం గమనించిన తరుణ్ "మమ్మీ ఈ రోజు అంకులే నాకు స్నానం చేయించి, ఇదిగో ఈ కొత్త డ్రెస్ వేసేరు. బాగుందా!" మురిపెంగా అన్నాడు తరుణ్.

చందన మనసు అదేం గమనించే స్థితిలో లేదు. అల్లకల్లోలంగా ఉంది, తుపానులో ఎరిగిపడే సంద్రంలా.

## కొత్తగాలి...

**గరీబోడు తప్పు చేశాడా**
**వెంటనే బొక్కలో వెయ్**
**అమీరోడి దారుణ కృత్యాలైతే**
**నిదానంగా దర్యాప్తు చెయ్!**

—మాధవీ సనారా, అనకాపల్లి

ఇక ఆ మధు ఎలాంటి సీన్ సృష్టిస్తాడో అఖిల్ ముందు. తను ఎవరి కంటికీ కనిపించనంత సూక్ష్మంగా అయిపోయి, అక్కడ్నుంచి మాయమైపోతే బాగుండును.

ఈ రకమైన ఆలోచనలు ఒక పక్క. మరోవైపు తరుణ్, అఖిల్‌తో అంత క్లోజ్‌గా మూవ్ అవటం చూస్తుంటే మనసు ఏదో అనిర్వచనీయమైన అవస్థకు లోనవుతుంది. మౌనంగా తరుణ్ వైపు చూసి నెమ్మదిగా అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయింది చందన.

చిన్నబోయిన తరుణ్ ముఖం చూసి, చందన వెళ్ళినవైపే సాలోచనగా చూస్తూ ఉండిపోయాడు అఖిల్.

కల్పన అతడి భుజంపై చెయ్యివేసింది. "తొమ్మిది అయిందిరా. పద" అంటూ.

తొందరగా కాఫీ ముగించి క్రిందకు వెళ్ళి పోర్టికోలోంచి కారు తీసాడు అఖిల్.

కల్పనా, బంగారిల సాయంతో మెట్లు దిగింది చందన. ముఖం తెల్లగా పాలిపోయి ఉండటంతో అడిగింది కల్పన.

"చందూ, వాటీజ్ రాంగ్? "

సీట్లో వెనక్కు చేర్లబడుతూ "చాలా వీక్‌గా ఉందే ఎందుకో" అంది చందన.

బంగారి తల కార్లోకి పెట్టి చెప్పింది. "అమ్మా, ఫ్లాస్కులో కాఫీ ఉంది తాగు"

తన గురించి ఆమెకెంత జాగ్రత్త పాపం! నెమ్మదిగా తలవూపింది.

పైన బాల్కనీ లోంచి చూస్తున్న తరుణ్







"ఆంటీ, మమ్మీ, అంకుల్ బై!" అంటూ చెయ్యి ఊపుతున్నాడు.

"బై!" అంటూ తరుణ్‌కు తిరిగి చెయ్యి ఊపి కారు ముందుకు నడిపాడు అఖిల్.

★ ★ ★

అనుకొన్న టైమ్ కంటే ముందే ఆ ప్రదేశానికి చేరుకున్నాడు మధు.

సరిగ్గా పది గంటలు దాటుతుండగా కారు లోటస్ టెంపుల్ దగ్గరకు చేరుకుంది. కారు పార్కింగ్‌లో ఆపి చుట్టూ చూశాడు అఖిల్.

సెలవురోజేమో, సందడిగా ఉంది వాతావరణం. తామర పువ్వు ఆకారంలో ధ్యాన మందిరం ఆకర్షణీయంగా కనిపిస్తుంది.

అదేం గమనించలేని చందన కళ్ళు మధు కోసం వెతుకుతున్నాయి. ఓ చెట్టు కింద నిలబడి సిగరెట్ కాలుస్తున్న అతడిని చూడగానే చందన గుండె ఆగినట్టయింది. వేగంగా కొట్టుకుంటున్న గుండెపై చెయ్యి ఉంచుకుంది నెమ్మదిగా.

"ఆ బ్లూ షర్టే కదూ!" అంది కల్పన.

తలూపింది చందన అవునన్నట్టు. కల్పన దృష్టి కారును సమీపిస్తున్న మధుపై ఉంది. అతడు సమీపిస్తున్నకొద్దీ చందన గొంతు పొడిగా అయిపోతోంది. తను నోరు తెరిచి మాట్లాడగలదా?

"అతడిని కార్లో కూర్చుని మాట్లాడమనండి" కారు ఫ్రంట్ డోర్ తెరుస్తూ జనాంతికంగా చెప్పి అక్కడ్నుంచి కొద్ది దూరం నడిచి కార్లో మనుషులు కనిపించే వ్యూలో నిలబడ్డాడు అఖిల్. అతడి కనుబొమ్మలు ముడివడ్డాయి చిన్నగా.

కారులో ఎవరెవరున్నారో అని పరిశీలించిన మధు కళ్ళు కల్పనపై పడ్డాయి. "హలో డాక్టరుగారూ బాగున్నారా? "

"ఆc" అంటూ ఇబ్బందిగా చెప్పింది "కార్లో కూర్చోండి" అని.

"అక్కర్లేదు మీ సలహాలు.. నా భార్యా, నేనూ అలావెళ్లి మాట్లాడుకుంటాం" తీవ్రంగా ఉంది అతడి కంఠస్వరం.

కోపాన్ని అణచుకుంటూ "చందన కారు దిగి నడిచే స్థితిలో లేదు" అంది కల్పన.

"అయ్యో ఏమైంది నీకు? " అంటూ కారెక్కి డోర్ గట్టిగా వేశాడు. "..మా బంధం కోర్టు కెక్కింది తప్ప తెగిపోలేదని గుర్తుంచుకోండి మీరు" కల్పననుద్దేశించి అన్నాడు వ్యంగ్యంగా.

డోర్ తీస్కుని దిగిపోవటానికి ప్రయత్నిస్తున్న కల్పన చేతిని చిన్నగా నొక్కుతూ, "ప్లీజ్ వుండు" అంది చందన.

ముళ్ళమీద కూర్చున్నట్లు అటు తిరిగి బయటకు చూస్తూ కూర్చుంది కల్పన.

"ఈ వంది మాగధులంతా ఎందుకు? నేనే అక్కడకు వచ్చేవాడిని కదా. బైదిబై తమరి ఆరోగ్యం ఎలా వుంది? " చందన గెడ్డం కింద చూపుడు వేలుంచి విసురుగా పైకెత్తుతూ అన్నాడు.

అతడికి అందకుండా వెనక్కి జరిగి "ఛీఛీ!" అంది చందన.

"మొగుడంటే అంత చికాకేంటే నీకు? వాడితో విచ్చలవిడిగా తిరగటానికి ఏ సిగ్గూ, చికాకూ లేవేం!" అఖిల్ వైపు పళ్ళు కొరుకుతూ చూసి అన్నాడు.

"నీ బుద్ధి మారదు. వచ్చిన పని చూస్కుని వెళ్తే మంచిది"

ఆ మాటలకు వికారంగా నవ్వేడతడు.

"ఇక్కడ ఇంత భాగోతం ఉండబట్టే బరితెగించి ఇలా తిరుగుతున్నావు" కసిగా అన్నాడు మధు.

"మిస్టర్ మధూ! నువ్వేం రాజీకి రాలేదు. నీకు డబ్బు కావాలి. దానికోసం ఇంత దూరం వచ్చావ్. అది పట్టుకు ఫో. మాటలు వద్దు" హ్యాండ్ బాగ్ జిప్ ఓపెన్ చేస్తూ ఆవేశంగా అంది చందన.

"ఇంకా నీ మొగుడినే నేను. 'మర్యాద. మర్యాద'గా మాట్లాడు. 'అరేయ్', 'ఒరేయ్'

అన్నావంటే ఈ రోడ్డుమీదే నీ గుట్టు విప్పాల్సొస్తుంది జాగ్రత్త" అన్నాడతను.

అతడి సంభాషణ వింటుంటే కడుపులో దేవింది కల్పనకు. తప్పనిసరిగా కూర్చుంది కార్లో. చందన బ్యాగ్‌లోంచి పేపర్లు తీయగానే లాగేసుకుని వాటిని గబగబ అటూఇటూ తిప్పి చూసి "ఇక్కడో సంతకం, ఇక్కడో సంతకం పడేయ్" అని తన జేబులోంచి కూడా ఏవో కాగితాలు తీసిచ్చాడు. ఆ పేపర్లను చందన చేతిలోంచి తీస్కొని పరిశీలనగా చూసి ఇచ్చేసింది కల్పన.

"ఆహా! స్నేహం అంటే ఇది" అన్నాడు ఎత్తిపొడుపుగా.

ముఖం తిప్పుకొంది చందన.

"ఇదిగో చూడూ" అంటూ చందన ముఖం విసురుగా తనవైపు తిప్పుకుని "నీకూ నీ ఈ స్నేహితురాళ్లకీ మనశ్శాంతి లేకుండా చేస్తా. పగ తీర్చుకుంటా" కారు దిగి డోరు ధామ్మని వేశాడు.

ఆ శబ్దానికి వెనుతిరిగి చూసిన అఖిల్ కారుదగ్గరకొచ్చి డోర్ తెరిచి ఎక్కాడు.

"బ్రదర్. ఒక్క క్షణం" అన్నాడు మధు కార్లోకి చూస్తూ. తననే ఆ సంబోధన అని నిర్ధారించుకొని ఏమిటన్నట్లు చూశాడతడివైపు అఖిల్ ఇంకా పనుందేమోనని.

విండోలోంచి తల లోపలకు పెట్టి "బ్రదర్, నువ్వూ శాశ్వతం కాదు. నా నంబరు 'టూ'. నీ నంబరు 'త్రీ'. మరో 'ఫోర్' వచ్చేదాకా ఎంజాయ్ చెయ్"

అఖిల్ ముఖం జేవురించింది. కారు రివర్స్‌చేసి ముందుకు పోనిచ్చాడు. మధు ముఖంలో, కళ్ళలో కనిపించిన ఈర్ష్య, ద్వేషాలతో కలిసిన క్రూర భావం కలవరపరచింది చందనను. అప్రయత్నంగా ఆమె కళ్ళు సజలాలయ్యాయి.

కళ్ళు ఒత్తుకుంటున్న చందన చేతిని తన చేతులలోకి తీస్కుంది కల్పన, "బాధపడకు" అంటూ. కారు వెనుకే ఓరగా చూస్తూ నేలను కాలుతో తన్ని ఏదో సణుక్కుంటూ వెనుతిరిగాడు మధు.

నెమ్మదిగా ఫ్రంట్ సీటువైపు వంగి అఖిల్‌కు చెప్పింది కల్పన.

"చందన కాలి సూచర్స్ విప్పాలి ఈ రోజు..."

ఆమె మాటలు పూర్తి కాకుండానే కారు హాస్పిటల్ ముందు ఆగింది.

చందన, కల్పన దిగి హాస్పిటల్‌లోకి వెళ్లేరు. అఖిల్ చలనరహితంగా కూర్చున్నాడు కార్లోనే. మధు మాటలకు అతడి మనసు అతలాకుతలమైంది.

ఆ మాటలు పదే పదే చెవులలో వినిపిస్తున్నాయి. తన మనసును తనే పరిశీలనకు, పరీక్షకూ నిలిపాడతడు. 'ఛ. తనకు

## ఇన్‌స్పెక్టర్ 'పాండిత్యం'

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి రామచంద్రాపురంలో భాషోపాధ్యాయునిగా పనిచేస్తున్న రోజులవి. సంస్కృతం క్లాసుకు ఓసారి స్కూల్ ఇన్‌స్పెక్టర్ వచ్చారు. ఆయనకు ఏమి అడగాలో చట్టున జ్ఞాపకం రాక ఓ శ్లోకంలోని ముక్క తీసుకుని 'ఇది ఏ సమాసం? విగ్రహం ఏమిటి' అని ఒక విద్యార్థినిని ప్రశ్నించారు. ఆమె సమాధానం చెప్పింది. తర్వాత 'సమాసానికీ, సమాసోక్తికీ తేడా ఏమిటి? ఆ మాటకు సమాసం చెప్పావు సరే.. సమాసోక్తినీ చెప్పు' అన్నారు. దానికి సమాసోక్తి చెప్పడమేంటో అర్థంగాక ఆమె తెల్లబోయింది. అప్పుడు ఇంద్రగంటివారు నవ్వుతూ 'ఇన్‌స్పెక్టర్ పరీక్షిస్తున్నారు. సమాసోక్తి అనేది అలంకారం. అది సమాసాల్లో ఉండదని వారికి తెలుసు' అన్నారు. దీంతో ఇన్‌స్పెక్టర్ మేకపోతు గాంభీర్యం ప్రదర్శిస్తూ వెళ్లిపోయారు.





ఆమెపట్ల అటువంటి అభిప్రాయమా? 'నో' నుదురుపై వేళ్లతో రాసుకున్నాడు బాధగా.

'తనకు... తనకు... కేవలం చందన పట్ల సానుభూతి! పసివాడు తరుణ్ పట్ల జాలి! అంతకు మించి మరే అనుబంధం లేదు. ఉండదు కూడా'

'ఒక పనికిమాలిన వ్యక్తి ప్రేలాపనకు తనింత విలువనిచ్చి బాధపడకూడదు' తనకు తెలియకుండానే తరుణ్‌తో బంధం ఏర్పరచుకుంటున్నాడు అతిగా.

తాత్కాలికంగా తమతో కలిసి ఉన్న పరాయి వ్యక్తులు వారు. తనకేమీ కారు. తనవారు తనను విడిచి ఏనాడో సుదూరాలకు సాగిపోయారు.

తనకు తనే మిగిలాడు ఏకాకిగా!

అతడి కళ్లు చెమ్మగిల్లాయి.

"అఖిల్! అఖిల్, అరె నిద్రపోతున్నావా? " భుజం తట్టి కుదిపింది కల్పన.

ఉలిక్కిపడి చూశాడు అఖిల్. అతడి కళ్ళలో మెరిసిన నీటిపొర కల్పన దృష్టిని దాటిపోలేదు.

మధు మాటలు అటు చందనను, ఇటు అఖిల్‌ను కూడా బాధించాయి.

ఆ వాతావరణాన్ని సరిచేయటానికి, అఖిల్ అడగకపోయినా చెప్పింది కల్పన.

"సూచర్స్ విప్పి ఆయింట్‌మెంట్ రాసేరు. ఇంకా టూ వీక్స్ వరకూ మెడిసిన్స్ వాడాలి"

చందనకు కార్లో ఎక్కేందుకు సాయం చేసింది కల్పన. ఇంటికి చేరేవరకూ ముగ్గురి నడుమా మౌనమే రాజ్యం చేసింది. కారు చూస్తూనే పరుగున ఎదురు వచ్చాడు తరుణ్.

చందనకు మెట్లెక్కడానికి చేయందించి సాయపడ్తోంది కల్పన.

"అంకుల్!" చెయ్యి పట్టుకున్న తరుణ్ చేతిని సున్నితంగా వదిలించుకొని గదిలోకెళ్ళి తలుపు వేసుకున్నాడు అఖిల్.

విస్తుపోయి చూస్తూ నిలబడ్డాడు తరుణ్. చందన మానసిక స్థితి తరుణ్‌ను పలుకరించే విధంగా లేదు. ఆమె తన గదిలోకి వెళ్ళిపోయి పడుకుంది నెమ్మదిగా. అందరి ముఖాల్లోకి చూసి వెళ్లిపోయి ఓ మూల కుర్చీలో కూర్చున్నాడు తరుణ్. ఆ పసివాడికి ఒక్కసారిగా ఎంతో దిగులనిపించింది.

కల్పన మానసకు నెమ్మదిగా జరిగిన విషయం చెప్పింది.

"ఎంత హీనంగా తయారయ్యేడు!" బాధగా అంది మానస. వాళ్ళతో వెళ్లకపోవటం కూడ మంచిదైంది అనుకుంది.

అరగంట తర్వాత తన గదిలో నుంచి బయటకు వచ్చేడు అఖిల్.

"నేను వెళ్తున్నాను" అంటూ వెళ్లిపోతున్న అతడి వెనుకే పరుగున వచ్చింది కల్పన, "భోజనం చేసి వెళ్ళరా" అంటూ.

"వచ్చి చేస్తాలే. మానసగారూ మీ ట్రైన్ ఫైవ్ థర్టీకి అంటే మనం ఫోర్‌కు స్టార్ట్ అవుదాం. రెడీగా వుండండి" మానసనుద్దేశించి చెప్పాడు.

తనవైపైనా చూడకుండా వెళ్లిపోతున్న అఖిల్ వెనుకే చిన్నబోయిన ముఖంతో చూసి నెమ్మదిగా అడుగులు వేస్కుంటూ చందన దగ్గరకు వెళ్ళాడు తరుణ్. మధు మాటలే చెవులలో పదేపదే వినిపిస్తుంటే మతిలేనట్లు ఆలోచిస్తోంది ఆమె మనసు. ఆ అవస్థలో తరుణ్ రాక గమనించలేదామె.

అక్కడ నేలపై పరచివున్న రజాయిపై పడుకొని తలగడలో తల దాచుకున్నాడు.

అనుబంధాలకూ, ఆత్మీయతలకూ చెదలంటించగల కుట్రలూ, ద్వేషాలూ, కక్షలూ వుంటాయనీ, అవి మనసుకూ, మనసుకూ మధ్య ఇనపగోడలై నిలుస్తాయనీ తెలియని అతడి లేత మెదడు విపరీతమైన ఒత్తిడికీ బాధకూ గురైంది.

'ఛీ, అందరూ ఇంతే! ఎవరితోనూ ఇక మాట్లాడకూడదు. క్లోజ్‌గా వుండకూడదు. అసలు వీళ్ళంతా తమకేం కారు. ఇక్కడ్నుంచి వెళ్లిపోవాలి మమ్మీ, తనూ'

ఆ చిన్నారి మనసు ఆలోచనల ప్రవాహంలో కొట్టుకుపోతుంది.

అప్పటికి అతడిని గమనించింది చందన. నెమ్మదిగా లేచి వచ్చి పిలిచింది "తరుణ్" అంటూ. పలుకక పోయేసరికి లేపటానికి ప్రయత్నించింది. మరింత బిగిసి పడుకున్న కొడుకును చూసి నిట్టూర్చి వెళ్ళి పడుకుంది.

ఆమె ఆలోచనలు వద్దనుకున్నా మధు చుట్టూనే తిరుగుతున్నాయి. తనకు తనే ధైర్యం చెప్పుకుంది. 'కొద్దిరోజులు ఓపిక పడితే ఆ దుర్మార్గుని ప్రమేయం శాశ్వతంగా తొలగిపోతుంది. తనూ, తన బిడ్డా హాయిగా బ్రతకవచ్చు! ఆ తృప్తితో ఆమె నెమ్మదిగా నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

నాలుగు గంటలవుతుండగా అఖిల్ వచ్చేడు. "ఏం అక్కా రెడీయా?" అంటూ.

"ఆс నేను రెడీయే. మీరు భోజనం చెయ్యండి" అంది మానస.

"నేను బయట చేసేశాను. మీరంతా చేసేరుగా?" అడుగుతున్న అతడి మనసు, కళ్ళూ ఎవరికోసమో వెతుకుతున్నాయి. అతడికి వెల్తిగా, అసౌకర్యంగా వుంది.

"అందరం తిన్నాం.. తరుణ్ తప్ప" అంది మానస

"అదేం?" అని, "తరుణ్" అని పిలవబోయి, ఆ ప్రయత్నం మానుకున్నాడు.

ఎవరు పిలిచినా, ఎందరు లేపినా తరుణ్ లేవక, బదులు పలుకక ఒకేలా పడుకున్నాడు.

బయల్దేరివెళ్తూ మానస, తరుణ్ దగ్గరకు హడావుడిగా వచ్చింది.

"తరుణ్, నే వెళిపోతున్నా. నాతోకూడ మాట్లాడవా? మానాన్న కదూ, రా.. లే.."

## కొత్తగాలి...

నింగి
నేలను
పలుకరించింది
వానగా మారి

—ఆత్రం శశికిరణ్,
రాజారాంపల్లి, కరీంనగర్

అంటూ తరుణ్ ముఖం తనవైపుకు తిప్పేందుకు ప్రయత్నం చేసిందామె.

"నేను ఎవరితో మాట్లాడను. నాకెవరూ వద్దు అసలు" సగం ఏడుపుతో, ఉడుకుమోత్తనంగా అన్నాడు తరుణ్.

కల్పన పరిస్థితి చూసి "ఏయ్ మనూ పద నువ్వు. ట్రైన్ టైమైపోయింది. తరుణ్ ఎందుకో అలిగేడు. నీకు హైదరాబాద్ ఫోన్‌చేసి మాట్లాడ్తాడుగా" అంది.

"సరే" అంటూ లేచింది మానస.

చందన చేతులు పట్టుకుని ఆమె ముఖంలోకి ఒక్కక్షణం చూసి, "చందూ, మన ముగ్గురిదీ ఒకటే ప్రాణం అని మరువకు" అంది గద్గద స్వరంతో.

చందన ఒక్కసారిగా మానసను చుట్టేసింది. ఇద్దరి కళ్ళూ సజలాలయ్యాయి. కల్పన కళ్ళు ఒత్తుకుంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

చందన నుదుటిపై సుతారంగా ముద్దుపెట్టుకొని అక్కడ్నుంచి గబగబా వెళ్ళిపోయింది ఆమె. దుఃఖాన్ని పెదవి బిగువున అణచి త్వరత్వరగా మెట్లు దిగింది.

బాల్కనీలో నిలబడి కళ్ళు ఒత్తుకుంటూ కిందికి చూస్తోంది చందన.

కదిలిపోతున్న కారులోంచి చెయ్యూపింది మానస.

గేటులో నిలబడి కారు వెనుకే చూస్తున్న కల్పనను ఉద్దేశించి "గత జన్మలో ఓ తల్లి కడుపున పుట్టి వుంటారు



తల్లీ మీరు ముగ్గురూ" కళ్ళు ఒత్తుకొంటూ అంది బంగారి.

★ ★ ★

మానస ట్రెయినెక్కి కూర్చుంది. వాటర్ బాటిల్, బిస్కట్ ప్యాకెట్లు, పళ్లవీ తెచ్చి బాస్కెట్లో సర్దాడు అఖిల్.

"ఎందుకండీ ఇవన్నీ ట్రెయిన్‌లోనే దొరుకుతాయిగా" అంది మొహమాటంగా.

"కొంతవరకైనా హెల్త్‌ను వాటినుంచి రక్షించుకోవటానికే ఇవి"

ట్రెయిన్ ఒక్క కుదుపుతో చిన్నగా కదిలింది. "వస్తానక్కా. హ్యాపీజర్నీ" అంటూ కిందికి దిగి కిటికీ దగ్గరకు వచ్చి కూడా నడుస్తూ చెయ్యి వూపుతున్న అఖిల్‌కు కనిపించినంతవరకూ చెయ్యి వూపి తన సీట్లోకి వచ్చి కూర్చుంది మానస.

'ఇటువంటి తమ్ముడు ఒక్కడుంటే ఎంత బాగుండునో!' అఖిల్ గురించి అలా అనుకోవటం అది రెండోసారి.

వెనుతిరగబోయిన అఖిల్ ఉలిక్కిపడి చూశాడు. ఆఖరి కంపార్ట్‌మెంట్ గుమ్మంలో నిలబడిన మధు "హలో బ్రదర్, బై!" అని గట్టిగా అరిచి చెయ్యి వూపాడు. అతడి ఇకిలింపు చూస్తుంటే అఖిల్ పిడికిలి బిగిసింది. "రాస్కెల్" అనుకున్నాడు పళ్ళబిగువున.

మరో ఆలోచన రావటంతో అఖిల్ మనసు అశాంతికి లోనైంది. కొంచెం గాబరా అనిపించింది.

'ఆమెకేం చికాకు కలిగించడు కదా!' మళ్ళీ తనే సమాధానపడ్డాడు. చదువుకున్న అమ్మాయి కదా. తెలివైనది. మేనేజ్ అవుతుందని ధైర్యం చెప్పుకున్నాడు.

వెంటనే ఇంటికి వెళ్ళాలనిపించలేదతడికి. ఎక్కడెక్కడో తిరిగాడు. మనసు మరింత అశాంతికి గురయింది.

'ఎవడో నీచుడు ఏదో అన్నాడని నేనెందుకు మనసు పాడు చేస్కోవాలి?' ఈ ఆలోచనతో కొంచెం ఉపశమనం కలిగింది. తరుణ్‌వైపు మళ్ళాయి ఆలోచనలు. ఉదయం నుంచీ వాడితో మాట్లాడలేదు. బాధనిపించింది. కలవాలన్పించింది. వెంటనే కారును ఇంటిముఖం పట్టించాడు.

★ ★ ★

ట్రెయిన్ న్యూఢిల్లీ స్టేషన్ దాటింది. ట్రెయిన్‌తోపాటు ఆమె మనసు హైదరాబాద్ వైపు పరుగు తీయసాగింది.

"హల్లో మానసగారూ!"

ఆశ్చర్యంగా తిరిగి చూసింది మానస.

ఎదుటి సీట్లో కూర్చుంటూ "బాగున్నారా" అని అడుగుతున్నతన్ని చూసి ఆమె గుండె ఆగింది ఒక్కక్షణం. ఎదురుగా మధు.. శరీరంలో శక్తంతా ఆవిరైపోయింది.

"ఆ.. మీరు బాగున్నారా?" అడిగింది తడబాటుగా.

"మీరు బాగుండనిస్తేగా" వంకర నవ్వు నవ్వుతూ అన్నాడు.

చుట్టూ చూసింది. పక్కనున్న దంపతులిద్దరూ వాళ్ల పిల్లల గొడవలో ఉన్నారు. కాని ఎదుటి సీటులో ఉన్న తెలుగువాళ్ల చెవులు ఇటే ఉన్నాయి. మరో మిలిటరీ అతను ఏదో చదువుకుంటున్నాడు.

"అయితే స్నేహితురాల్ని ఢిల్లీ చేర్చి దగ్గరుండి అబార్షన్ చేయిస్తావా?"

మౌనంగా తల దించుకుంది మానస. అందరి ముందు ఏం రభస చేస్తాడోనన్న భయంతో నోరు ఎండిపోతోంది.

"మీ బెర్త్ ఎక్కడ? ఇక్కడేనా?" ముఖంలో ఏ భావం కన్పించనీయకుండా అడిగింది.

"వెధవ బెర్త్‌దేముంది? ఎక్కడైనా దొరుకుతుంది. నా భర్తపోస్టే ఖాళీ చేయించేరు మీరంతా కలిసి. చూస్తా మీ అందరి అంతూ" అతడి గొంతు పెరిగింది.

"ఏయ్ మానసా. నన్ను, నా పెళ్ళాన్నీ



విడదీసి మీరంతా సుఖంగా కాపురాలు చేస్కుందాం అనుకుంటున్నారా? ... నో. నీకు, నీ ఫ్రెండ్ ఆ మిలిటరీవోడి పెళ్లానికీ సుఖం లేకుండా చేస్తానే..."

"మిస్టర్ మధూ నీ సీట్లోకి వెళ్లు. మీ ప్రవర్తన ఏం బాగోలేదు" శక్తినంతా కూడ దీసుకుని గట్టిగా చెప్పింది మానస.

"నువ్వెవరే నన్ను పొమ్మనటానికి?" అంటూ కాలుమీద కాలు వేస్కు కూర్చున్న అతడి వైపు నిస్సహాయంగా చూసింది. జేబులో నుంచి సీసాతీసి, గటగట తాగేస్తున్న అతడి వైపు ఆందోళనగా చూసింది మానస.

ఎదుటి సీట్లో వాళ్ళు అభ్యంతరం చెప్పటంతో తిట్లూ మొదలుపెట్టాడు. సీసా రెండు సీట్ల మధ్య విసిరి కొట్టడంతో గాజు ముక్కలు చెల్లాచెదరయ్యాయి.

"పోలీస్‌ను పిలవండి" అంటున్నతని కాలర్ పట్టి "పిలవరా పిలువు. బులావో పోలీస్‌కో" అని అరుస్తున్న మధును సమీపించి అతడి రెండు చేతులు ఒడిసి పట్టాడు మిలిటరీ వ్యక్తి. తర్వాత "చల్ రే చల్" అంటూ ఈడ్చుకుపోయాడు అతన్ని.

"నిన్ను సుఖంగా బతకనివ్వనే. చూడు... ఏం చేస్తానో... " వెనుదిరిగి చూస్తూ అరుస్తున్నతడిని చూస్తుంటే నీరసంతో కళ్లు తిరిగినంత పనైంది మానసకు. వణుకుతున్న చేతులతో అఖిల్ ఇచ్చిన మినరల్ వాటర్ బాటిల్ ఓపెన్ చేసి గటగటా సగం నీళ్ళు తాగేసింది.

"అతడెవరు?"

"మీ బంధువా? లేక మీ ఆయనా?" వంటి ప్రశ్నలు గుప్పిస్తున్న వారందరికీ ఏదో ఓ సమాధానం చెప్పేసి, టాప్ బెర్త్‌లోకి ఎక్కి, దడదడలాడుతున్న గుండెతో దుప్పటి కప్పేసుకు పడుకుంది.

వీడు రేపట్నుంచి హైద్రాబాద్‌లో ఏం రభస సృష్టిస్తాడో ఏమో. వద్దంటే వినకుండా ఢిల్లీ వెళ్లేనని ఆనంద్‌కు కోపం వస్తుందేమో. ఈ రకమైన భయంతో, ఆలోచనలతో ఎప్పటికో ఆమె కళ్ళు మూతలు పడ్డాయి. కంపార్ట్‌మెంట్‌లో ఏ అలికిడి అయినా మధేమోనని చూసింది భయంగా.

★ ★ ★

కారు పోర్టికోలో వుంచి పైకి వెళ్లిన అఖిల్‌కు కల్పన ఎదురువచ్చింది.

"ఎక్కడికెళ్ళిపోయావురా?" అంటూ మంచినీళ్ళ గ్లాసందించింది.

"మానసగారు వెళ్ళింది" అంటూ సోఫాలో చతికిలపడ్డాడు. "ఆ మధు కూడా ఈ ట్రెయిన్‌కే పోయాడు" చికాగ్గా వుంది అతడి స్వరం.

కల్పన గతుక్కుమంది. "దాన్నేం అల్లరి పెడతాడో!" అంది ఆందోళనగా.

"మీరంతా మారాలి. అంత అబలత్వం అయితే ఎలా?"

"హైద్రాబాద్ చేరగానే ఫోన్ చేయమన్నానులే" అన్నాడు.

"అవునూ. ఇల్లంతా ఇంత సైలెంట్‌గా వుందేంటి? అప్పుడే అందరూ నిద్రపోయారా?" చుట్టూ చూస్తూ అడిగి కల్పన ముఖంలో మార్పును గమనించాడు. 'సమ్‌థింగ్ ఈజ్ రాంగ్' అనుకున్నాడు.

'తరుణ్!' నాలుగుసార్లు పిలిచినా బదులు రాకపోయేసరికి "ఏమైందక్కా?" అంటూ చందన గది వైపు నడిచాడతడు.

చందన నిద్రపోతున్నట్లే వుంది బెడ్‌లైట్ కాంతిలో. కింద తరుణ్ పడుకున్న పరుపు దగ్గర బంగారి కూర్చునివుంది. తరుణ్ ముఖంపై కర్చీఫ్ వేసి ఉంది మడతగా.

ఆత్రంగా లోనికి రాబోయిన అఖిల్‌కు నెమ్మదిగా చెప్పింది బంగారి.

"మధ్యాహ్నం కాడి నుంచీ తరుణ్ బాబు ఇలా పడుకొనే వున్నాడు అఖిల్ బాబూ. చూస్తే ఒళ్లు పేలిపోతోంది జ్వరంతో"

"ఇపుడు తగ్గిందా? " కంగారుపడ్డాడు.

"అక్క సూదేసింది. మాత్రలు మింగన్నాడు. ఇపుడే చెమట పడతంది. ఇక జ్వరం దిగిపోతందిలే"

తన రూమ్‌లోకెళ్ళి షూస్ విప్పేసి గబగబా వచ్చేడు అఖిల్.

పడుకున్న తరుణ్‌ను రెండు చేతుల్తో పైకెత్తి భుజాన వేసుకున్నాడు అఖిల్.

అలికిడికి కళ్ళు తెరిచిన చందన, "ఏయ్, ఎవరు? " అంది గాభరాగా. అఖిల్‌ను చూసి "మీరా" అంది.

"తరుణ్‌ను నా గదిలోకి తీస్కెళ్తున్నా" అంటూ తీసుకెళ్లి తన మంచంపై పడుకోబెట్టాడు నెమ్మదిగా.

కల్పన వచ్చి మంచం అంచున కూర్చుంది. "ఒన్ నాట్ ఫైవ్ వరకూ వచ్చింది టెంపరేచర్. ఇపుడు హన్డ్రెడ్‌కు దిగింది" అంది నెమ్మదిగా.

తలగడ సర్ది దుప్పటి కప్పి పక్కనే కూర్చున్నాడు అఖిల్.

"ఒక్కసారిగా అంత టెంపరేచర్ ఎందుకు వచ్చిందీ? " అన్నాడు అఖిల్.

తరుణ్ తన చెయ్యి పట్టుకుంటే విదిలించుకు వెళ్ళిపోవటం గుర్తొచ్చింది.

తరుణ్ తల నిమురుతూ కూర్చున్నాడు.

"మమ్మీ" అంటూ కళ్ళు తెరిచిన తరుణ్ అయోమయంగా చూసేడు అఖిల్ వైపు.

నుదుటిపై చెయ్యివేసి చూస్తున్న అఖిల్ చేతిని విసిరికొట్టేడు తరుణ్.

"మమ్మీ ఏదీ... మమ్మీ దగ్గిరకెళిపోతా" అంటూ లేచిపోబోతున్న తరుణ్‌వైపు ఆశ్చర్యంగా చూసేడు అఖిల్.

"తరూ, నేనేనమ్మా," అన్నాడు.

"నాకొద్దు నువ్వు" అంటూ ఏడుపు మొదలుపెట్టాడు.

"బాబూ, రామ్మా" అంటూ పట్టుకోబోయిన కల్పన చేతులు తోసేశాడు.

చందన వచ్చింది కంగారుగా "ఎలా వుందే? " అంటూ.

> **కొత్తగాలి...**
>
> **బండెడు చాకిరీ**
> **శిలువను మోస్తూ**
> **మహిళా క్రీస్తు**
>
> – బద్ది నాగేశ్వరరావు,
> అనకాపల్లి

"బాగానే వుంది. టెంపరేచర్ నైన్టీనైనే వుంది. నీకోసం పేచీ..." అంది కల్పన.

తల్లిచేతిని గట్టిగా పట్టుకున్నాడు వాడు.

"మమ్మీ... మనం ఇక్కడ్నుంచి వెళ్ళిపోదాం" వెక్కుతూ అన్నాడు.

"అలాగే వెళిపోదాం" అంది.

"రేపేనా? "

"ఆ... రేపే" అంది తలనిమురుతూ.

"వింతగా వుంది తరుణ్ ప్రవర్తన" కల్పనతో నెమ్మదిగా అన్నాడు అఖిల్.

"నీ ప్రవర్తనే వింతగా వుందిరా. తట్టుకోలేకపోయేడు వాడు. పిల్లల మనసులు గాజు బొమ్మలురా. అతి జాగ్రత్తగా హ్యాండిల్ చేయకపోతే కష్టం" నెమ్మదిగా చెప్తున్న కల్పనవైపు తప్పుచేసిన వాడిలా చూసి తల వంచుకున్నాడు అఖిల్.

అక్కడ్నుంచి నెమ్మదిగా వెళ్ళిపోతున్న చందన చెయ్యిపట్టి ఆపింది ఆమె.

"మీరిద్దరూ చదువుకున్నవాళ్ళు. మంచిచెడుల విచక్షణ ఉంది. సంస్కారం వుంది. సభ్యతా సంస్కారాలు లేని వాళ్ళ మాటలు పట్టించుకొని, బాధపడితే హాస్యాస్పదం కదూ!"

కల్పన మాటలకు మౌనం వహించేడు అఖిల్. నెమ్మదిగా మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు తరుణ్. తన గదిలోకి వెళిపోయింది చందన.

'ఈ పసివాడి మనసు ఎంత సెన్సిటివ్!' లోలోన మధనపడ్డాడు అఖిల్.



"ఇక మీరెళ్ళి పడుకోండి" కల్పన, బంగారిలనుద్దేశించి చెప్పాడు అతడు.

మంచానికి దగ్గరగా ఈజీఛైర్ లాక్కొని వెనక్కు చేర్లబడ్డాడు.

'తను తరుణ్ గురించి ఎందుకింత తపనను అనుభవిస్తున్నాడు? వాడికి జ్వరం వస్తే తనకెందుకింత ఆరాటం? '

అశాంతిగా దొర్లుతూనే వున్నాడతడు. తెలతెలవారుతుండగా నిద్రపట్టింది.

★ ★ ★

జ్వర తీవ్రత పూర్తిగా తగ్గిపోయిన తరుణ్‌కు మెలకువ వచ్చేసరికి అయోమయంగా తోచింది.

'తను అంకుల్ మంచం మీదకెలా వచ్చేడు? ' పైకి లేవటం అసాధ్యం అనిపించింది. అతడి చెయ్యి తన చుట్టూ గట్టిగా బంధించి వుంది. నెమ్మదిగా తప్పించుకోవటానికి ప్రయత్నించాడు.

అఖిల్‌కు మెలకువ వచ్చింది. ఉలిక్కిపడి లేచాడు.

"అమ్మ దొంగా! నా దగ్గర్నుంచి పారిపోదాం అనా? " అంటూ మరింత దగ్గరకు తీస్కున్నాడు తరుణ్‌ను.

"నాకు నీ మీద కోపం వచ్చింది" ముఖం పక్కకు తిప్పుకున్నాడు వాడు.

"నేనేం చేశానూ? " అమాయకంగా అడిగేడు అఖిల్.

"అమ్మదొంగా! చెయ్యి పట్టుకుంటే వదిలేసి వెళ్ళిపోలేదూ? నాతో మాట్లాడలేదు" తరుణ్ కంఠం దుఃఖంతో పూడిపోయింది.

నివ్వెరపోయాడతడు. బాధగా అన్నాడు.

"సారీ తరూ! తప్పైపోయిందమ్మా"

"నువ్వు మళ్ళీ అలాగే చేస్తావ్" వెక్కుతూ అన్నాడు.

"చెయ్యను రా బాబూ! చెయ్యను" అంటూ గుండెకు హత్తుకున్నాడు. అఖిల్ కళ్ళు చెమ్మగిల్లాయి.

"హైద్రాబాద్‌లో అంకుల్ కూడ అంతే. 'డాడీ' అంటే కొట్టేడు. నాకు అచ్చంగా నా సొంత అంకుల్ కావాలి. నన్ను, మమ్మీని తిట్టకూడదు. కొట్టకూడదు... ఇపుడు నీ దగ్గర కూడా నాకు బాగోలేదంకుల్"

తరుణ్ మాట్లాడే ప్రతిమాట అఖిల్ గుండెను కుదిపినట్లైంది. అతడి కన్నీరు చెంపలపైనుంచి జారి తరుణ్ తలను తడపటంతో ఆశ్చర్యంగా చూశాడు వాడు అఖిల్ ముఖంలోకి.

"నీ చిన్నారి మనసును ఇంకెన్నడూ బాధించను... బాధించను... బాధించను" తరుణ్‌ను గుండెకు హత్తుకున్నాడు.

అఖిల్ గుండెలో ఒదిగిపోయాడు తరుణ్. తరుణ్ లేచాడేమో చూద్దాం అని వచ్చిన చందన, ఆ పసిమనసులోంచి పొంగివచ్చిన ఆవేదనను విని మ్రాన్పడిపోయింది. 'వాడి లేత గుండెలో ఇంత అగ్ని పర్వతం దాగివుందా! భగవంతుడా, ఆ చిన్నారికి మనశ్శాంతిని ప్రసాదించు' మౌనంగా రోదిస్తూ వెనుతిరిగిందామె!

★ ★ ★

ఎవరో తట్టి లేపుతుంటే అదిరిపడి లేచింది మానస.

"సికింద్రాబాద్ స్టేషన్" ఎదుటి సీట్లో తెలుగు వ్యక్తి చెప్పాడు.

బిడియంగా "థాంక్యూ!" అంది. 'ఎంత మొద్దునిద్ర పట్టిందో' అనుకుంటూ.

"నిన్న గొడవ చేసినతడు ఒక గంట క్రితం వచ్చి అటూ ఇటూ చూసి వెళ్లిపోయాడు" అంటూ తన సూట్‌కేస్ తీస్కు దిగిపోయాడతను.

ప్లాట్‌ఫామ్ కనిపించినంత వరకు చూసింది.

'లేదులే. హమ్మయ్య' అనుకుంది.

సూట్‌కేస్ తీస్కుని, బ్యాగ్ భుజానికి తగిలించుకుని ట్రెయిన్ దిగింది ఆమె.

ఆనంద్ జాడే లేదు! స్టేషన్ బయటకు వచ్చింది. ఆనంద్ రాకుండా వుండడే.

# నో స్మోకింగ్ ప్లీజ్



అమెరికాలో పొగ తాగడాన్ని తీవ్రంగా ద్వేషిస్తున్నారు. వ్యాపార సంస్థలు కూడా స్మోకింగును నిషేధిస్తున్నాయి. అక్కడ గర్భవతులు సిగరెట్ను ఓ పట్టాన మానలేరు. దాంతో పుట్టబోయే బిడ్డమీద దుష్ప్రభావం ఉంటోంది. సిగరెట్ తాగనివారికి కొన్ని అమెరికన్ కంపెనీలు 'అలవెన్స్' ఇస్తున్నాయి. ముఖ్యంగా రెడీమేడ్ దుస్తుల సంస్థలు దీన్ని అనుసరిస్తున్నాయి. ప్రస్తుతం గ్రైమేన్ కార్పొరేషన్, బోయింగ్, గుడ్ ఇయర్ టైర్ అండ్ రబ్బర్ కంపెనీలు ఈ విధానాన్ని అమలు చేస్తున్నాయి. దీనికి కారణాలు అనేకం. స్మోకర్స్‌తో కలిసి పనిచేయడం వల్ల ఊపిరితిత్తుల వ్యాధులు సోకితే కంపెనీపై దావా వేయవచ్చు. దీంతో వ్యాపార సంస్థలు చర్యలు తీసుకుంటున్నాయి. పైగా స్మోకర్స్ వల్ల సమయం వృథా. సిగరెట్ కొనడం, మిత్రులతో కలిసి తాగటం వల్ల పనిగంటలు తగ్గుతాయి. వ్యాపార సంస్థలకి ఒక్కో ఉద్యోగి నుంచి సగటున ఏడాదికి వెయ్యిడాలర్లు నష్టమని అంచనా. అలాగే స్మోకర్స్ సిక్‌లీవ్ పెడతారు. దానికన్నా 'నాన్ స్మోకింగ్ అలవెన్స్' ఇవ్వడం చవక. స్మోకర్స్ కూడా దీన్ని ఇష్టపడుతున్నారు. ఫుడ్ ప్రాసెసింగ్ ఉద్యోగులు సిగరెట్లు మానేయడంతో నాణ్యత పెరిగింది. అలాంటి సంస్థలు 'మా ఉద్యోగులు సిగరెట్లు తాగరు' అని కంపెనీ వ్యాపార ప్రకటనల్లో వెల్లడిస్తున్నారు. సిగరెట్ తాగడం మీద ఈ నిషేధాన్ని వాటిని కాల్చేవారు, కాల్చనివారూ సమానంగా మెచ్చుకుంటున్నారు. ఇక మెచ్చుకోనిదల్లా సిగరెట్‌ని తయారుచేసే కంపెనీలు మాత్రమే.




కంపార్ట్‌మెంట్ నంబరు కూడా చెప్పింది.

కాస్సేపు చూసి ఆటో ఎక్కి "వెస్ట్ మారేడుపల్లి" అని చెప్పింది.

ఇంటికి చేరేసరికి ఎనిమిదిన్నరయింది.

"వచ్చేవామ్మా!" అంటూ ఎదురొచ్చింది జగదాంబ.

"ఆనంద్ ఏడి? " గేటువైపు చూస్తూ అడిగిందావిడ. అర్థం కాలేదు మానసకు.

"అబ్బాయి కనిపించలేదా నీకు? "

"లేదత్తయ్యా. చూసి చూసి వచ్చేశా"

"మమ్మీ!" అంటూ పరుగున వచ్చి చుట్టేసింది హిమ.

"వచ్చేవా తల్లీ, రా!" అంటూ కూతుర్ని గుండెకు హత్తుకుందామె.

తను హాస్టల్‌నుంచి వచ్చేసరికి మమ్మీ లేనందుకు గారాలుపోతూ తల్లి ఒడిలో చేరి ఎన్నో కబుర్లు చెప్పసాగింది హిమ.

స్నానం చేసి, గబగబ వంటచేసి అత్తగారికీ, హిమకు వడ్డించింది.

"మీ స్నేహితురాళ్ళు బాగున్నారామ్మా? "

ఆనంద్ చుట్టూ తిరుగుతున్నాయి ఆమె ఆలోచనలు.

"బాగానే వున్నారత్తయ్యా. మిమ్మల్ని అడిగినట్లు చెప్పమన్నారు"

"వాడు ఏం పనిమీద వెళ్లాడో, ఎప్పటికి వస్తాడో! నువ్వా ఒక ముద్ద తినేసి పడుకోరాదమ్మా, అలిసిపోయి వచ్చేవ్"

"ఫర్వాలేదండీ. ఆయనొచ్చేక తింటాం"

ఆవిడ కేవలం అలిసిపోయేననుకుంటుంది పాపం! మానసికంగా తనెంత క్షోభకు గురైందో తెలిసే "వెళ్ళొద్దంటే విన్నావామ్మా? "తో మొదలవుతుంది. ట్రెయిన్‌లో జరిగిన సంఘటన గురించి భర్తకు, అత్తగారికి చెప్పకూడదని నిర్ణయించుకొంది ఆమె. కూతుర్ని చదువు సంగతులు, ఆమె ఫ్రెండ్స్ సంగతులూ అడుగుతూ నిద్రలోకి జారుకుంది మానస.

మగత నిద్రలో వినిపిస్తున్నాయి



మాటలు. "స్టేషన్ కెందుకు వెళ్ళలేదురా. పాపం చీకట్లో ఎలా వస్తుందనుకున్నావ్ చెప్పు?" కొడుకును నిలదీస్తోంది అత్త గారు.

లేచి వస్తున్న మానస, ఆనంద్ సమాధానం విని దెబ్బతిన్నట్టు ఆగిపోయింది.

"రైలెక్కించేవాళ్ళూ, దించేవాళ్ళూ చాలా మంది వున్నారమ్మా నీ కోడలికి!"

ఇష్టపడే పంపించిన ఆనంద్ కంఠంలో ఆ నిష్ఠూరం ఏమిటి? స్టేషన్‌కూ రాకుండా ఉండగలిగేంత కోపమా తనపై. కళ్ళలో నీళ్ళు తిరిగాయి ఆమెకు.

పైట కొంగుతో ఒత్తుకొంటూ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. డ్రెస్ అయినా మార్చుకోకుండా పడుకున్నాడు ఆనంద్. నెమ్మదిగా సమీపించి అతడి ముఖంలోకి చూసింది.

మానసను చూస్తూనే చటుక్కున కళ్ళు మూస్కున్నాడతడు. కొత్త వాసన మానస ముక్కుకు గుప్పున తాకింది. అదిరి పడింది ఆమె.

తాగొచ్చాడు. ఈ వూహించని పరిణామానికి ఆమె ఒంట్లో శక్తంతా ఆవిరైపోయినట్లైంది.

తనకు ఎదురైన చేదు అనుభవానికి చిగురుటాకులా అల్లాడిన ఆమె మనసు ఆనంద్ గుండెపై వాలి సేదతీరొచ్చని ఆశించింది. భారంగా నిట్టూర్చింది ఆమె.

మంచం దగ్గరే అస్తవ్యస్తంగా విసిరి పడేసిన బూట్లు, సాక్స్ తీసి, వాటి స్థానంలో పెట్టొచ్చింది.

"భోజనం చేద్దాం రండి" వీలైనంత మామూలుగా పిలిచింది.

విసురుగా అటుతిరిగి పడుకున్నాడతడు.

రెండు మూడు సార్లు పిలిచినా పలుకలేదతడు. "నిద్రా?" అంటూ అతడిపై చెయ్యివేసి తనవైపు తిప్పబోయింది.

"హూ..." అంటూ ఆ చేతిని విసురుగా తోసిపారేసి ఏదో గొణుక్కుంటూ పడుకున్నాడతడు. అతడి ఉచ్ఛ్వాస నిశ్వాసాలను బట్టి నిద్రపోతున్నాడని తెల్సుకుంది.

అలా ఎంతసేపు నిలబడిపోయిందో ఆమెకే తెలియదు. పెళ్లై ఇన్నేళ్ళ జీవితంలో ఈ చేదు అనుభవం ఇదే ప్రథమం కావటంతో తట్టుకోలేకపోతోంది.

గడియారం రెండు గంటలు కొట్టటంతో టేబిల్‌పై గిన్నెలు, ప్లేట్లు సర్దేసి, ఫ్రిజ్‌లో సర్దేవి సర్దేసి వచ్చి హిమ పక్కన వాలింది. తల్లి స్పర్శతో నిద్రలో ఇటు తిరిగి, దగ్గరగా జరిగి పడుకుంది హిమ.

ఎంత ఆలోచించినా ఆమెకు భర్త వింత ప్రవర్తనకు కారణం తెలియలేదు. ఇందులో మధు పాత్ర వుందేమోనన్న అనుమానం తలెత్తింది ఆమె మనసులో.

ట్రెయిన్‌లో అతడు కసిగా, కక్షగా అన్న మాటలు చెవుల్లో మారుమోగుతున్నాయి. సోలిపోయినట్లు నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

మర్నాటి ఉదయం పేపర్ చదువుతున్న ఆనంద్‌కు కాఫీ అందించింది మానస.

మౌనంగా అందుకుని సిప్ చేస్తూ మళ్ళీ పేపర్‌లో మునిగిపోయేడతడు.

అతడు పేపరు చదవటం పూర్తిచేసేవరకూ ఓపికగా కూర్చుంది మానస అతడికెదురుగా సోఫాలో.

పేపర్ టీ పాయ్ మీద పెట్టి వెళ్తున్న ఆనంద్ చెయ్యిపట్టుకుని లేచింది మానస.

విస్తుపోయినట్లు చూశాడు భార్య ముఖంలోకి. "ఎందుకు నన్నిలా బాధిస్తున్నారు?" అతడి కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది.

"జవాబు తెలిసిన ప్రశ్నలు ఎందుకు?"

అతడికి దగ్గరగా వెళ్లింది మానస.

"నిజం చెప్పండి ఆనంద్. నేను లేనపుడు ఏం జరిగిందిక్కడ?"

పేలవంగా నవ్వాడతడు.

"కొందరు మనుషులకూ, కొన్ని విషయా

లకూ దూరంగా వుందాం అని నిన్ను అర్థించేను. శాసించేను కూడా. కానీ విన లేదు నువ్వు"

"అంటే.. అంటే..." అర్థం కానట్టు చూసింది.

"మురికిని ఇష్టపడి, అందులోనే పొర్లాడే వాటికి దూరంగా వుంటాం. ఎందుకూ?" ఒక్క క్షణం ఆగాడతడు. అతడి కళ్ళలో మెరుస్తున్న నీటిపొర చూసి నిర్ఘాంతపో యింది మానస. అతడేం చెప్తున్నాడో అర్థం కాక, ఏం చెప్పబోతున్నాడో వూహిం చలేక దడదడ లాడుతున్న గుండెతో అతడి చేయి వదిలి ఒక అడుగు వెనక్కు వేసింది తడబాటుగా.

"మానసా... నిన్ను బాధిస్తే క్షమించు. కానీ... నా మనసు తట్టుకోలేకపోతోంది"

సోఫాలో కూలబడి పసివాడిలా చేతుల్లో ముఖం దాచుకు దుఃఖిస్తున్న భర్తను బొమ్మలా చూస్తూ వుండిపోయిందామె. నెమ్మదిగా సమీపించి అతడి రెండు చేతులూ పట్టుకుంది.

"ఏమైందండీ?"

మానస చేతులు విడిపించుకొని సోఫాలో వెనక్కు వాలి కూర్చున్నాడతడు.

"ఏమీ కాకముందు చెప్పాను చందన, మధుల గొడవ విడిచిపెట్టమని..."

మధ్యలోనే "ఇపుడేమైంది?" ఆత్రంగా అడిగిందామె.

"ఇంకా ఏం కావాలి? ఆ దరిద్రుడు మధు స్టేషన్ బయట ఎదురై..."

"ఎదురై?" గుండె ఆగినంత పనైంది మానసకు. తను వూహించినదే జరిగింది.

"మన కారు రిపేరుకిచ్చాను. ప్రసాద్ కార్లో వచ్చేను. అతడి ఎదుటే నోటికొచ్చి నట్లు వాగాడు"

"దేని గురించి?"

ఒక్క క్షణం ఆమె కళ్ళలోకి చూసి తల వంచుకున్నాడు ఆనంద్.

"నువ్వూ, అమ్మా, హిమా నాకు మూడు ప్రాణాలు. మీలో ఎవరు దూరమైపో తున్నా భరించలేను.. అంతేకాదు బతక లేను" ఆవేశంగా వుంది అతడి కంఠ స్వరం.

"అఖిల్ ఎవరు?" తిరిగి అడిగేడు.

ఆ ప్రశ్నకు తడబాటుగా చూసింది అతడి ముఖంలోకి.

"కల్పన కజిన్.. ఏం?" ఆమె కనుబొ మలు ముడిపడ్డాయి.

"అతడే నిన్ను ట్రెయిన్ ఎక్కించాడా?"

"అవునూ!" అయితే ఏమిటి అన్నట్లుంది ఆమె జవాబు.

"నీ ఫ్రెండ్స్ ఏమయ్యారు?"

విషయం అవగతమైంది ఆమెకు.

"ఆ పాము పగ తీర్చుకోవటం మొదలు పెట్టిందన్న మాట. ఆ విషం అతడిని పూర్తిగా కబళించకముందే ఆనంద్‌ను కాపాడుకోవాలి! ఎలా... ఎలా? ఆమె మనసు తుపాను గాలికి అల్లాడుతున్న లేత చిగురులా వుంది.

"మీరు ఎందుకు అడుగుతున్నారు అలా?" తీవ్రంగా వుంది మానస కంఠం.

"ఇంకెలా అడగమంటావ్? ఎవరి కోసమో కాలదన్నుకొనేదా నీ సంసారం?"

"ప్లీజ్ ఆపండి... చిత్రవధ చేయకండి మీ మనసులో ఏమనుకుంటున్నారో చెప్పే యండి. ఆ నీచుడు ఏదో వాగితే అదే మీ తలకెక్కిందా?"

"ఎక్కటం కాదిక్కడ ముఖ్యం. వాడు నీ కేరెక్టర్ అస్సాసినేషన్ మొదలెట్టాడు. అయినా వెళ్ళినదానివి పని చూస్కుని వెంటనే రావాలిగా."

"ఎన్ని రోజులుండి పోయానండీ? శుక్ర వారం వెళ్ళాను. శుక్రవారం వచ్చాను. నాకు ఆమాత్రం సెలవూ దొరకదా మీ దగ్గర?" దుఃఖంలో మాటలు రావటం లేదు మానసకు.







"నీకు భర్త, కూతురు వున్నారు. వాడు నీపై చల్లుతున్న బురదకు మన కుటుంబ గౌరవం నలుగురి నోళ్ళలోనూ నలుగుతుంది. రేపు మనం ఎలా తలెత్తుకు తిరగాలి చెప్పు? " అడిగేడు.

నుదుటిపై చేత్తో కొట్టుకుంటూ "అంతా నా కర్మ!" అంటూ రోదిస్తున్న మానసవైపు చూసి అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

హిమ "మమ్మీ!" అంటూ రావటంతో కళ్ళు తుడుచుకు లేచింది మానస.

★ ★ ★

కోడలు ముభావంగా తిరగటం, కొడుకు ముఖం చిన్నబోయినట్లు వుండటం చూసి జగదాంబ మనసు బాధపడింది. కొడుకు ప్రవర్తన ఆమెకు నచ్చలేదు. 'ఆనంద్‌ను మందలించాలి' అనుకుందామె.

జగదాంబ, మనవరాలు హిమ చదరంగం ఆడుతున్నారు. వాళ్ల ఆటను పరధ్యానంగా చూస్తూ కూర్చుంది మానస.

అంతలో ఆనంద్ వచ్చేడు. అప్రయత్నంగా గడియారంవైపు చూసింది మానస. తొమ్మిది అయింది.

"డాడీ, చెస్‌లో నాన్నమ్మను ఓడించేశాను" అంటూ ఎదురెళ్ళి అతడి చేయి పట్టుకుంది హిమ.

కూతుర్ని దగ్గరకు తీస్కుని " కీప్ ఇట్ అప్" అంటూ లోపలకు వెళ్లిపోయాడు.

సర్దేస్తున్న బోర్డు పరిచింది జగదాంబ.

"రామ్మా, ఇంకో ఆట ఆడదాం" అంటూ. అయిష్టంగానే వెళ్ళి కూర్చుంది హిమ.

దిండుకు ఆనుకొని కూర్చుని టీవీలో న్యూస్ చూస్తున్నాడు ఆనంద్.

మంచంమీద అస్తవ్యస్తంగా పడున్న హిమ డ్రెస్‌లూ, బొమ్మలూ, బుక్కులూ తీస్తూ ఆనంద్‌వైపు చూసింది మానస.

"లేచి స్నానం చెయ్యండి. హిమ కూడా ఇంకా భోజనం చేయలేదు. అందరం కలిసి చేద్దాం" మనసుకు అయిన గాయాన్ని చిరునవ్వు మాటున దాచి అతి సాధారణంగా అంది మానస.

టీ.వీ. ఆఫ్ చేసి బాత్‌రూమ్‌లోకి వెళ్తూ ఫోన్ మోగటంతో లిఫ్ట్ చేశాడు ఆనంద్.

వెంటనే అతడి ముఖం వివర్ణమైంది.

మారు మాట్లాడకుండా ఫోన్ పక్కన పెట్టి వెళ్లిపోయాడు అక్కడ్నుంచి.

భారమైన మనసుతో రిసీవర్ చేతిలోకి తీస్కుని "హలో" అంది మానస.

అవతలి కంఠం వినగానే అర్థమైంది ఆనంద్ ముఖం అప్రసన్నం ఎందుకైందో.

"మానసగారూ.. బాగున్నారా? " అఖిల్ పలకరింపు. ఇబ్బందిగా అన్పించింది.

"ఆ.. మీరంతా బాగున్నారా? " అంది.

"సేఫ్‌గా రీచ్ అయినట్లు ఫోన్ చేస్తారని చూసేం. మీరు చెయ్యలేదని చేసేను"

"సారీ అండి"

"అదే ట్రెయిన్‌లో మధు ఉన్నాడు. అందుకు కొంచెం వర్రీ అయ్యేం. అంతే"

"అవును"

"మీకేం ట్రబుల్ ఇవ్వలేదు కదా? "

"లేదులెండి."

"చందన, తరుణ్ బాగున్నారా? కల్పనను అడిగేనని చెప్పండి" సంభాషణ ముగిస్తూ అంది మానస.

"మీ ఆనంద్‌గార్ని, అదే బావగార్ని పరిచయం చేయరా నాకు? "

"బాత్‌రూమ్‌లో ఉన్నారు" అంది.

'సరే సరే' అని మానస అంటున్నా, అతడు చాలా విషయాలు మాట్లాడేడు. హిమ గురించి అడిగేడు.

"ఆనంద్‌కు టీషర్టు నచ్చిందా" అడిగేడు.

ఫోన్ పెట్టి వెనుతిరిగేసరికి, కార్డ్‌లెస్ ఆఫ్ చేసి పెడుతూ కనిపించేడు ఆనంద్.

'అంటే... అతడు తమ సంభాషణంతా చాటుగా వింటున్నాడన్నమాట'

కళ్లు తిరిగినట్లయింది మానసకు.

ఏదో ఓ బలహీన క్షణం ఎంతటి వ్యక్తి

నైనా సభ్యతా, సంస్కారం మరపింపజే స్తుంది కాబోలు!

"ఆ.. ఎవరు? " సర్దుకోవటానికి ప్రయ త్నిస్తూ అన్నాడు.

"అఖిల్. కల్పన బ్రదర్" అతడి ముఖంలోకి ఒక్కక్షణం చూసి చెప్పింది.

"ఓహో!" అంటూ వెళ్లిపోతున్న భర్తవైపే చూస్తూ ఉండిపోయింది.

'కొన్ని వికారాలకు తనూ, తనవారు లొంగం' అన్న గుడ్డి విశ్వాసం ఎందరినో మోసం చేస్తుంది. అదే తన విషయంలో నిజమైంది. వంటింట్లోకి నడిచింది ఆమె.

రోజులు భారంగా గడుస్తున్నాయి. అం తకు ముందరి వాతావరణం లేదా ఇంట్లో. అన్నీ యాంత్రికంగా జరిగిపోతున్నాయి.

హిమతో గడుపుతూ అన్ని బాధలూ మరిచిపోవటాన్ని అలవాటు చేస్కుం టోంది మానస. కూతురుకు కావలసినవి కొనిపెడుతూ, ఇష్టమైనవి వండిపెడుతూ తీరికే లేదు ఆమెకు!




**చం**దన పూర్తిగా కోలుకొని తిరగ గలుగుతోంది. తరుణ్‌ను తెలిసిన కాన్వెం ట్‌లో జాయిన్ చేశాడు అఖిల్. చందన న్యూస్ పేపర్స్ ముందేస్కు కూర్చుని సూటబుల్ అనిపించిన ప్రతి జాబ్‌కు అప్లై చేస్తోంది. కొన్ని తనకు ఇష్టంకాక, మరి కొన్నింటికి తను సూట్‌కాక ఎన్నో అవకాశాలు చెయ్యిదాటి పోయాయి.

అఖిల్ తన సాఫ్ట్‌వేర్ ఇనిస్టిట్యూట్‌లో ఆమెకోసం ఒక జాబ్ క్రియేట్ చేసి జాయిన్ అవ్వమని అడిగితే, చందన అందుకు అంగీకరించలేదు. తనపై సాను భూతితో దొరికే అవకాశాలను అందుకో వటం తనకిష్టం లేదంది.

"దయచేసి అర్థం చేస్కోండి. నాకూ తృప్తి వుండదు" ఆమె మాటలకు కల్పన, అఖిల్ ముఖాలు చూస్కున్నారు.

"మీరు అలా చూస్తే నాకు ఇబ్బంది. ఆ కంప్యూటర్స్, ఆ ప్రపంచం వేరు. ఎలా... నేను ఇమడగలను? గాలిలో దీపాల్లా రెప రెప లాడుతున్న మా జీవితాలకు మీరి ద్దరూ చెరో చెయ్యికాసి కొండెక్కి పోకుండా కాపాడారు. మా ఇద్దర్ని ప్రాణంలా చూస్కుంటున్నారు..." దుఃఖంతో ఆమె స్వరం గద్గదమైంది.

కల్పన, చందనను భుజం చుట్టూ చెయ్యివేసి దగ్గరకు తీస్కుంది. "వూరుకో చందూ!" అంటూ.

నెమ్మదిగా అక్కడ్నుంచి లేచి తన గది లోకి వెళ్ళిపోయేడు అఖిల్.

'తను అనవసరంగా తొందరపడ్డాడేమో! అయినా ఆవిడ లైఫ్ ఆవిడిష్టం. ఏదో జాబ్ అని ఆఫర్ ఇచ్చేడు తను. కాదంటే తనేం చెయ్యగలడు?' అనుకున్నాడే గాని మనసు ఎంత వద్దనుకున్నా వినకుండా చందన, తరుణ్‌ల చుట్టూనే తిరుగుతుంది.

స్తబ్దంగా సాగిపోతున్న జీవితంలో ఈ ఇద్దరి రాక అలజడి రేపుతోంది! 'చందూ... చందూ!' ఆ పేరే మానుతున్న గాయాన్ని రేపింది.

ఒక 'చందూ' తన జీవితంలో మెరు పులా మెరిసి మాయమైపోయింది! మళ్ళీ చిత్రంగా చందన తారస పడింది! జీవి తాంతం కలిసి బతుకుదాం అనుకున్న బంధమే తనని నిర్దాక్షిణ్యంగా ఒంటరిని చేసి దిగంతాలకు సాగిపోయింది.



అనుబంధాలు, ఆత్మీయతలూ, ఇవన్నీ మనిషి కట్టుకునే పిచ్చుక గూళ్ళు. తెలివి తక్కువగా అవి శాశ్వతం అని భ్రమ పడటం, ఆ మాయతెరలు తొలగిపోయిన సందర్భాలలో వైరాగ్యం కుంగదీస్తే, వేదాంతం చేరదీస్తుంది...

ఏమైనా ఒకసారి విసిరిన రాయికి రేగిన అలలు నెమ్మదిగా ఆగి ప్రశాంతతో, స్తబ్ద తతో తెలియని స్థితిలో జీవిత నావ పయ నిస్తుండగా, మరో రాయిని విసిరే అవ కాశం ఎవ్వరికీ ఇవ్వకూడదు! తట్టుకొనే శక్తి తన మనసుకు లేదు! బాధగా కళ్ళు మూస్కున్నాడు.

★ ★ ★

పేపర్‌లో ఏడ్ చూసి అప్లై చేసిన జాబ్‌కు ఇంటర్వ్యూకి వెళ్ళింది చందన. ఆ పని మనసుకు నచ్చింది ఆమెకు!

'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెర్సీ'లో ఇన్‌ఛార్జ్‌గా చేరింది చందన. అందరూ పసిపిల్లలు! దురదృష్టవంతులై అనాథలుగా అలమటి స్తున్న పసివాళ్ళకు అవసరమైన ఆహార వ్యవహారాలు, వైద్య సదుపాయాలూ వగైరా సక్రమంగా అందేటట్లు చూడటం, పెద్ద పిల్లలకు చదువు చెప్పటం.

ఆ కార్యక్రమాలన్నీ నిర్వర్తించేందుకు ఓ పదిమందివరకూ ఆయాలు, ముగ్గురు నలుగురు టీచర్లు, రోజూ చూసిపోయే డాక్టరూ, అన్ని సౌకర్యాలూ వున్నాయి. కాని ఈ కార్యక్రమాలన్నీ చూస్కొనే వ్యక్తి అవినీతికి పాల్పడటంతో, అతడి స్థానంలో చందనను నియమించారు.

ఆమె ఉదయం ఎనిమిది గంటలకు వెళ్తే, వచ్చేసరికి రాత్రి పది, పదకొండూ కూడా అవుతోంది. ఆలోగా తరుణ్ నిద్ర పోవటం కూడా జరుగుతోంది.

ఒకరోజు రాత్రి పదకొండు దాటినా చందన రాకపోయేసరికి అఖిల్ బయల్దే రాడు ఆమె పనిచేస్తున్న సంస్థకు.

రెండు మూడు సంవత్సరాల వయసు పిల్లలిద్దరికి హైటెంపరేచర్ వుంది. ఒళ్ళెర గకుండా పడివున్నారు. వాళ్ళ దగ్గరే దిగు లుగా కూర్చునివుంది చందన.

"ఒక్క ఫోన్ చెయ్యొచ్చుగా" మనసులో పడిన ఆందోళనంతా అతడి ముఖంలో కనిపిస్తోంది.

"సారీ, ఈ వర్రీలో తెలియలేదు. హోమ్ డాక్టర్ రాలేదు. పిల్లల పరిస్థితి చూస్తే భ యంగా వుంది" దిగులుగా అందామె.

"ఒక పనిచేద్దాం. దగ్గరలో వున్న ఏదైనా హాస్పిటల్‌కు తీస్కెళ్దాం" అన్నాడు.

ఒక ఆయాను సాయం తీస్కొని పిల్లలి ద్దర్నీ కారెక్కించింది చందన.

దగ్గరగా కనిపించిన పిల్లల హాస్పిట ల్‌కు తీస్కెళ్ళేడు అఖిల్.

ఎడ్మిట్ చేస్కుని ఏవో ఇంజక్షన్స్ చేశాడు డాక్టర్. "చాలా బలహీనంగా వున్నారు" అంటూ సెలైన్ పెట్టేడు.

"మీ పిల్లలా? " అడిగేడతడు.

చటుక్కున అఖిల్‌వైపు చూసింది చందన. విషయం వివరించేడు అఖిల్.

"వీళ్ళకేమైనా అయితే బాధ్యత వహిం చేది ఎవరు? "

డాక్టర్ మాటలకు తడబడింది చందన.

తమ సంస్థ అడ్రస్ రాసి, ఇన్‌ఛార్జ్‌గా సైన్ చేసింది చందన.

జ్వరం దిగి పిల్లలు కోలుకున్నారు. ఆయా కునికిపాట్లు పడుతోంది.

అక్కడే స్టూల్‌పై కూర్చుంది చందన.

"కావలిస్తే బిల్లు పేచేసి వెళ్లిపోవచ్చ న్నారు. దే ఆర్ ఆల్‌రైట్ నౌ. ఈ సిరప్ వాడండి. రేపు ఒకసారి ఫోన్ చేయండి డాక్టర్‌కు" అంది సిస్టర్.

హాస్పిటల్ బిల్లు కడుతున్న అతడివైపు ఏదో తప్పు చేసినట్లు చూసింది చందన. అదే సమయంలో అతడిపట్ల కృతజ్ఞతతో మనసులో "థాంక్స్" అనాలనుకుంది. కానీ

మాట పైకి రాలేదు. తెల్లవార్లూ తనతో పాటు మేల్కొని వున్నాడు పాపం. అతడు రాకుంటే పిల్లలేమైపోదురో?

తెల్లవారుజామున అయిదు గంటలకు ఆయాను, పిల్లల్ని హోం దగ్గర దింపి ఇంటిదారి పట్టారు అఖిల్, చందనలు.

ఏమైందంటూ కల్పన ఫోన్‌చేసింది కంగారుగా.

వివరించాడతను క్లుప్తంగా!

ఒక్కసారిగా నీరసం ఆవహించినట్లైంది చందనకు. ఏం తినలేదేమో చల్లగాలి తగిలేసరికి ఒక్కసారిగా సోలిపోయింది ప్రాణం. నిద్రలోకి జారుకుందామె. సీట్లో తన వైపుకు వాలిపోయి నిద్రపోతున్న చందనను చూస్తే జాలేసింది అతడికి.

తన భుజంపై వాలిన చందనను చూస్తే మనసు గతంలోకి పరుగులు తీసింది.

'చందూ, తనూ ఎన్నో వెన్నెల రాత్రులు డ్రైవ్‌కు వెళ్ళినపుడు ఇలాగే తన భుజంపై వాలి కబుర్లు చెప్పేది. గుండెపై వాలి నిద్రించేది. వెన్నెలలో మెరుస్తున్న యమునను చూసి పరవశించేది!'

అప్రయత్నంగా అతడి కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

అంత ప్రేమా, అన్ని అందాలూ, అందమైన అనుబంధం అన్నీ క్షణంలో బూడిదైపోయాయి. తాజ్‌మహల్ చూస్తే మనసును ముక్కలు ముక్కలుగా కోస్తున్నట్లు బాధ కలుగుతుంది.

"అఖిల్, ఒకవేళ నేను చనిపోతే ఇంత వద్దు కాని ఒక బుల్లి తాజ్‌మహల్ కట్టిస్తావా? కాదు చందూ మహల్..."

చటుక్కున ఆమె నోరు మూసేడు. "అలా అనకు సరదాకైనా. నువ్వులేని ఈ ప్రపంచంలో నేనుంటానా? "

పేలవంగా నవ్వుకున్నాడు. 'రాయిలా వున్నాను!' కారు ఇల్లు చేరేసరికి అఖిల్ ఆలోచనలకు కళ్ళెం పడింది. తను దిగాలంటే ముందు చందన లేవాలి.

తనపై వాలి ఆదమరచి నిద్రిస్తున్న ఆమెను తప్పనిసరిగా తట్టి లేపవలసి వచ్చింది. అప్రయత్నంగా "చందూ!" అన్న పిలుపు అతడి పెదవులు దాటి ఆమె చెవిన పడింది.

ఉలిక్కిపడి లేచి అతడివైపు అయోమయంగా చూసి ఒక్క ఉదుటున దూరంగా జరిగింది.

"ఇంటికి చేరేం. దిగండి"

బిడియంగా అంది. "ఛ... ఎంత నిద్ర పట్టేసిందో"

ఇద్దరూ పైకి వెళ్ళేసరికి కల్పన ఎదురు వచ్చింది. ముగ్గురికీ తొందరగా కాఫీ కలిపి తెచ్చింది బంగారి.

"ఎందుకే చందూ, ఇంత బాదరబందీ నెత్తిన పెట్టుకున్నావ్? ఏదో, మనస్థిమితానికి బదులు ఎదురు మరో వర్రీలా వుంది ఈ జాబ్" అంది కల్పన.

"ఏదో ఆ పసివాళ్ళ మధ్య కాలక్షేపం అయిపోతుంది. కానీ అక్కడ ఎవరి పని వాళ్ళు సవ్యంగా చేయటం లేదు. పిల్లలకు సీరియస్‌గా వుంటే ఎన్నిసార్లు ఫోన్ చేసినా డాక్టర్ రాలేదు సరికదా ఫోన్ పక్కన పెట్టేసింది. ఆ పసిపిల్లల కేమైనా జరిగితే తనదే బాధ్యత అవుతుందన్న జంకే కనిపించటం లేదు ఆమెలో"

ఆశ్చర్యంగా చెప్పింది చందన.

"ఇటువంటి సంస్థల పనితీరు అంతంత మాత్రంగానే ఉంటుంది" అంటూ లేచి గదిలోకి వెళ్ళిపోయేడు అఖిల్.

"ఎన్ని చెప్పు. నీ జాబ్ నాకు నచ్చలేదు. నీ కోసం చూసి చూసి నిద్రపోయేడు తరుణ్. పద పడుకో. మళ్ళీ వెళ్ళాలిగా" అంటూ లేచింది కల్పన. లేచి తన గదిలోకి వెళ్ళిపోతూ, అఖిల్‌గదిలో ఇంకా లైటు వెలుగుతుండటంతో అప్రయత్నంగా కిటికీ వైపు దృష్టి సారించింది. మంచంపై



ఇన్ని ఫోటోలు ముందు పరుచుకుని చూస్కుంటున్నాడతను!

'అతడి భార్య ఫోటోలై ఉంటాయి!'

ఆమె ఆలోచనలు అఖిల్ చుట్టూ తిరిగాయి. 'అతడికి భగవంతుడెంత అన్యాయం చేశాడూ!' అనుకుంది బాధగా.

తరుణ్ మంచి నిద్రలో ఉన్నాడు. నెమ్మదిగా అతడి పక్కన పడుకుంది. ఆ స్పర్శకే "మమ్మీ" అంటూ దగ్గిరకు జరిగాడు.

అందరూ నిద్రలోకి జారుకున్నారు.

'ఏం ఉద్యోగాలో ఏమో!' సణుక్కుంటూ పనులకు ఉపక్రమించింది బంగారి.

★ ★ ★

ఎనిమిది గంటలకే హాస్పిటల్‌కు వెళ్లిపోయింది కల్పన.

తొమ్మిది దాటుతుండగా లేచి ఆదరాబాదరా పరుగులు తీస్తూ తయారవుతున్న చందనను చూసి, వెళ్లిపోబోయిన అఖిల్ ఆగి, పేపర్ చూస్తూ బాల్కనీలో నిలబడ్డాడు... "అంకుల్ టైమవుతోంది. మా మిస్ కోప్పడుతుంది" బ్యాగ్ భుజాలకు తగిలించుకుంటూ వచ్చేడు తరుణ్ కంగారుగా. "పాపం మీ మమ్మీకి కూడా లేటవుతోంది కదా, తనని కూడా డ్రాప్ చేద్దాం. మీ మిస్‌కు నే చెప్తాలే."

హడావుడిగా తలదువ్వి క్లిప్ పెట్టుకుంటున్న చందన చెవిన పడ్డాయి ఆ మాటలు. తొందర తొందరగా హ్యాండు బాగ్ భుజానికి తగిలించుకొని కిందకు వెళ్తుంటే బంగారి చేతిలో టిఫిన్ బాక్స్‌తో పరుగున వచ్చింది.

"మీకోసం మేమాగితే మీరేంటి మమ్మల్ని వదిలి వెళ్లిపోతున్నారు? " చిరునవ్వుతో కారు డోర్ తీసి నిలబడిన అఖిల్ కళ్ళలోకి చూసి ముఖం తిప్పుకుంది.

"రా మమ్మీ, ఇవేళ నన్ను మిస్‌తో కొట్టించేలా వున్నావ్" కారులో నుంచి అరిచిన



ట్టుగా బిగ్గరగా చెప్పాడు తరుణ్.

"థ్యాంక్స్" అంటూ కారెక్కి కూర్చుంది.

తనకు, తరుణ్‌కు అడుగడుగునా చెయ్యందిస్తున్నాడు అతడు. కాని ఎందుకో అది అతి చనువుగా అనిపిస్తోంది. ఒక్కోసారి అది తన మనసు ఇష్టపడటం లేదు.

"చందూ!" రాత్రి అతడు పిలిచిన పిలుపు నచ్చలేదు. ఏమైనా కొంచెం డిస్టెన్స్ మెయిన్‌టెయిన్ చెయ్యాలి.

అయినా ఆ ఇంట్లో వుంటూ అతడికి దూరంగా వుండాలనుకోవటం అవివేకం.

నెమ్మదిగా ఏదైనా ఆలోచించాలి.

"ఏమండోయ్ చందనగారూ, ఏ లోకంలో వున్నారు?" అఖిల్ పిలిచేసరికి ఉలిక్కిపడి చూసిందామె.

తరుణ్ స్కూల్ దగ్గర దిగిందే తెలియ లేదు. కారు హోమ్ ముందు ఆగటం గ మనించలేదు. "థాంక్యూ!" అంటూ తనవైపైనా చూడకుండా గేటు తీస్కువెళ్తున్న ఆమెవైపు అర్థం కానట్టు చూసి కారు ముందుకు పోనిచ్చాడతడు.

ఆమె సడన్‌గా ఎందుకలా బిగిసిపోయినట్లు ప్రవర్తిస్తుందో అతడి వూహకందని విషయం.

★ ★ ★

రోజూలాగే పిల్లలందర్నీ పలుకరించి, రాత్రి హాస్పిటల్‌కు తీస్కెళ్ళిన పిల్లల దగ్గరకు వెళ్ళింది చందన. నుదుటిపై చెయ్యి వేసి చూసి తృప్తిగా చూసింది ఆయావైపు.

"ఆ సిరప్ తెల్లారి వెయ్యలేదుగా... అయితే ఇప్పుడు వెయ్యి ఇద్దరికీ" టైమ్







చూస్కుంటూ తన రూమ్‌వైపు నడిచింది.

గదిలో అడుగు పెడుతూనే తన సీట్లో కూర్చున్న సూపర్‌వైజర్ జయరాంను చూసి ఆగింది ఒక్క క్షణం.

"రండి. అక్కడే ఆగేరేం? " అంటున్న అతడి వైపు అర్థం కానట్టు చూసింది.

ఎదురుగా వున్న కుర్చీ చూపి "కూర్చోండి" అన్నాడు.

చందన ఇబ్బందిగా కూర్చుంది. 'తన సీట్లో అతడు కూర్చున్నా డెందుకో!'

"పిల్లల్ని రాత్రి ఆస్పత్రికి తీస్కెళ్ళేరా? "

సూటిగా వున్న అతడి ప్రశ్నకు తడబాటుగా చూసింది. అలా చేయటం 'తప్పు' అన్న భావం ధ్వనించింది అతడి స్వరంలో.

"అవును తీస్కెళ్ళేను"

"ఎవర్నడిగి తీస్కెళ్ళేరు? "

"డాక్టర్‌గార్కి ఎన్నిసార్లో ఫోన్ చేసేను. విసుక్కొని ఫోన్ పక్కన పెట్టేశారు"

"అయితే? "

"మీరూ దొరకలేదు"

"అయితే? "

"పిల్లలిద్దరూ విరోచనాలతో, వాంతులతో నీరస పడిపోయారు. జ్వరం చాలా ఎక్కువగా వచ్చింది. ఆ టైమ్‌లో సెలైన్ పెట్టకుంటే ఆ పిల్లలిద్దరూ దక్కేవారు కాదు"

"రాత్రిళ్ళు మా ఫోనులు పనిచేయవ్. మేమూ పనిచెయ్యం" వ్యంగ్యంగా అతను నవ్వుతుంటే విస్తుపోయింది చందన.

"చూడండి మేడమ్. ఈ హోమ్ మీది కాదు, ఆ పిల్లలూ మీ పిల్లలు కారు. మరోసారి ఇలా ఇష్టం వచ్చినట్లు నిర్ణయాలు తీస్కోవటానికి వీలులేదు. ఇక్కడ నాకు తెలియకుండా ఏం జరగకూడదు"

"అలాగే" నెమ్మదిగా అంది చందన.

అతడు వెళ్ళిపోయేడు బయటకు.

తలవాల్చి కూర్చుండిపోయింది చందన. 'తను చేసింది మంచి! దానికి ప్రశంస లేకపోగా అవమానం బహుమానం!'

కళ్లు చెమ్మగిల్లాయి. ఆమె అలా ఎంతసేపు కూర్చుందో ఆమెకే తెలియదు. మనసు అశాంతిగా వుంది. పని యాంత్రికంగా ముగించి తొందరగా అయిదు గంటలకే బయటపడింది.

"ఈవేళ ఇంత గమ్మున వచ్చేశావేం చందనమ్మా? " అంటూ బ్యాగ్‌లోంచి టిఫిన్ బాక్స్ బయటకు తీసింది బంగారి.

మూత తెరిచి "ఇదేంటి తల్లీ తిననే లేదూ!" అడిగింది.

"ఆకలి లేదు. తలనొప్పిగా వుంది. కాస్త మంచి కాఫీ ఇస్తావా? " అంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది చందన.

అయిదు నిముషాలలో కాఫీ కప్పుతో వచ్చింది బంగారి. ఆమె ఎడమ చేతిలో వున్న కవర్‌పై పడింది ఆమె దృష్టి.

"ఇదిగోమ్మా, నీకే పోస్ట్‌లో వచ్చింది" అంటూ ఇచ్చి వెళ్ళిపోయింది. ఫ్రమ్ అడ్రస్ ఆత్రంగా చూసింది చందన. లాయర్‌గారి దగ్గర్నుంచి!

కాఫీ తొందరగా ముగించి, కవర్ చించి చదివింది. దాన్ని అలాగే పట్టుకుని కళ్ళు మూస్కుని మంచంపై వాలింది చందన.

చేతిలో లెటరు ఎవరో తీయబోయేసరికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసింది. "నువ్వా? " అంది కల్పనను చూస్తూనే.

"ఎవరు? " అడిగింది కల్పన.

"చూడు" అంటూ కవర్ అందించింది. చదివి లెటర్ కవర్‌లో వుంచుతూ చందన ముఖంలోకి చూసింది కల్పన.

"ఏం చేద్దాం? "

"చేసేదేముంది? వెళ్ళాలిగా. తప్పనిసరిగా అటెండ్ కావాలంటున్నారు" నిర్లిప్తంగా అంది చందన.

"నీకు తోడెవరు? "

"తోడనుకున్న బంధాన్నే తెగతెంపులు చేస్కోవటానికి వెళ్ళేదానికి తోడేమిటి? "

కల్పన మనసు చివుక్కుమంది. "మేం అందరం లేమా నీకు తోడు? అలా ఎందుకు అనుకుంటావు?"

"నా ఉద్దేశం అదికాదు".

★ ★ ★

"అమ్మా, నేనూ వస్తాను నీతో" అని తయారవ్వబోయిన తరుణ్, చందన వెళ్తున్నది హైద్రాబాద్ అని విని అదిరిపడ్డాడు. వాడి ముఖం వివర్ణమైంది.

"మమ్మీ ఎప్పుడొస్తావ్?" దిగులుగా అడిగేడు. చందనను ట్రైన్ ఎక్కించటానికి కల్పన, అఖిల్, తరుణ్ బయల్దేరారు.

"తొందరగా వచ్చేస్తా నాన్నా..."

"రేపే" గొంతు నిండా నిండిన దుఃఖంతో అన్నాడు.

"ఆ రేపే వచ్చేస్తా" అంది తరుణ్ తల నిమురుతూ.

"మమ్మీ, నువ్వు.. ఆ అంకుల్ దగ్గరకు వెళ్ళొద్దు" తరుణ్ కళ్ళలో భయం .

తలదించుకుంది చందన. విననట్టు ఎటో చూడసాగాడు అఖిల్.

"ఆ అంకుల్ బ్యాడ్ అంకుల్. ఇంక నిన్ను రానివ్వడు. కొడతాడు కూడా" తరుణ్ కళ్ళలో నీళ్ళు.

తరుణ్‌ను ముద్దుపెట్టుకుంది చందన "వెళ్ళను నాన్నా" అంటూ. గొంతుపూడిపోయింది దుఃఖంతో.

కల్పన, తరుణ్‌ను దగ్గరకు తీస్కుంది.

"మమ్మీ ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకెళ్తోంది నాన్నా..." చెప్పింది కల్పన.

"అక్కడ జాబ్ వద్దు మమ్మీ. నేను హైద్రాబాద్ రాను" అన్నాడు తరుణ్.

"అక్కడ వద్దని చెప్పటానికే వెళ్తోంది"

అంగీకరించినట్టు తలూపాడు తరుణ్.

కల్పన నెమ్మదిగా కొన్ని జాగ్రత్తలు చెప్పింది ట్రెయిన్‌లోంచి దిగిపోతూ.

"అతడు కోర్టులో ఏమైనా వాగుతాడు. నువ్వు అప్‌సెట్ కాకూడదు. నాకు ప్రామిస్ చెయ్యి, వెంటనే వచ్చేస్తానని" చెయ్యి చాపింది కల్పన.

మౌనంగా చేతిలో చెయ్యి వేసింది చందన. వస్తున్న దుఃఖాన్ని దిగమింగి కాసేపటికి అంది "వస్తాను" అని.

ట్రెయిన్ కదులుతుంటే తరుణ్‌ను తీస్కుని ట్రెయిన్ దిగిపోయింది కల్పన.

కల్పన వెనుకే వెళ్ళబోయి ఒక్క క్షణం తనకు దగ్గరగా వచ్చిన అఖిల్ ముఖంలోకి చూసింది చందన అప్రయత్నంగా.

అతడి కళ్ళలో నీలినీడ కనిపిస్తోంది.

"బికేర్‌ఫుల్... చందూ!" అని దిగిపోతున్న అతడివైపే చూస్తూండిపోయింది.

ట్రెయిన్ కనిపించినంత వరకూ చెయ్యి వూపాడు తరుణ్.

అఖిల్ చెయ్యి పట్టుకు నిలబడిన కొడుకును చూస్తూ "తరుణ్ జాగ్రత్త" అంది.

అది తనకు ఉద్దేశించి చెప్పినదే అనిపించింది అఖిల్‌కు. గుండెపై చెయ్యి వుంచుకున్నాడు నెమ్మదిగా. తన మనసెందుకు ఇలా ప్రతి విషయానికి స్పందిస్తోంది!

భారంగా స్టేషన్ బయటకు నడుస్తున్న అఖిల్‌ను చూసి నిట్టూర్చింది కల్పన.




**కో**ర్టులో నల్ల కోట్లూ, తెల్ల కాగితాలు, సంతకాలు అన్నీ వెరసి చందనకు సంకెలల నుంచి శాశ్వతంగా విముక్తి లభించింది. కల్పన వూహించినట్లే మధు నోరు ఎన్ని వంకరలు తిరగాలో అన్ని


వంకరలూ తిరిగింది.

ఆ వివాహ బంధం అనే పంజరం విర గ్గొట్టుకొని ఆమె మనసు వినీలాకాశంలో విహంగంలా విహరించసాగింది.

'తననూ, తన తరుణ్‌నూ ఇంకెవరూ శాసించలేరు!'

కోర్టు మెట్లు దిగుతున్న చందనకు ఎదు రుగా వచ్చి అడ్డంగా నిలబడ్డాడు మధు.

అతడి పక్కనుంచి తప్పించుకొని వెళ్ళి పోతున్న ఆమెను "ఆగు" ఆజ్ఞలాగ అంటున్న అతడి ముఖంలోకి నిర్లక్ష్యంగా చూసింది చందన.

"ఇపుడు నీకా అధికారం లేదు" అంటూ వెళ్ళిపోబోతున్న ఆమె చెయ్యిపట్టి ఆపాడు.

"చూడవే, నీ కంటే అందగత్తెను పెళ్ళాడి ఢిల్లీకే హనీమూన్‌కు తీస్కొస్తా"

"ఛీ" అని చెయ్యి విదుల్చుకు దిగుతున్న ఆమెను వెంబడిస్తూ "చూడు... ఏదో స్వేచ్ఛగా ఫీల్ అయిపోకు. విడాకులిచ్చేస్తే మాత్రం నిన్ను సుఖపడనిస్తాననుకుంటు న్నావా? నిన్నూ, ఆ డాక్టర్ తమ్ముడిగాడినీ బతకనివ్వను..." పళ్ళు కొరుకుతున్న అత డివైపు నివ్వెరపోయి చూసింది.

"అదెవరు? ... ఆ... మానస..." అంటూ జేబులోంచి ఓ చిన్న సీసా తీసి గటగట తాగేశాడు.

గాభరాగా చూసింది. ఎదురుగా వున్న ఆటో ఎక్కి కూర్చుంది "పోనియ్" అని.

"ఆ... మానస పనైపోయింది... అంతా చెప్పేనే... దాని మొగుడుకి..."

"ఎక్కడికెళ్ళాలి? " అడుగుతున్న ఆటో వాడ్ని "ముందు ఇక్కడ్నుంచి కదులు" అని కసిరింది.

వెళ్ళిపోతున్న ఆటో వెనకాల సీసా విసి రికొట్టి ఏదో అరుస్తూనే వున్నాడు మధు.

లాయర్ రాఘవ ఇంట్లోనే దిగింది చందన.

సూట్‌కేస్ సర్దుకుంటున్న చందనను "ఇంకా ట్రెయిన్‌కు టైముంది కదే? " అంటున్న రాఘవ భార్య, రాజీతో, "ఇంకా వూళ్ళో చూస్కోవల్సిన పనులున్నాయి" అని చెప్పి బయటపడింది.

మధు మాటలే చెవులలో మారుమోగు తుంటే మనసు వికలమై చెప్పలేని నీరసం ఆవహించింది. స్టేషన్‌లో బెంచిపై కూర్చుంది కాని స్థిమితం లేదు. ఒక ఫ్రూటీ తెచ్చుకు తాగుతూ కూర్చుంది.

ఎండిపోతున్న గొంతుకు, తేలిపోతున్న కళ్ళకు కాస్త ఉపశమనం లభించి అలా కళ్ళు మూస్కుని వెనక్కు వాలి కూర్చుంది.

ట్రెయిన్‌కు చాలా టైముంది! ఏదో ఆలో చన వచ్చి నెమ్మదిగా లేచి టెలిఫోన్ బూత్ దగ్గరకు నడిచి నెంబర్ డయల్ చేసింది 'బాబాయి ఉన్నాడో, లేడో' అను కొంటూ. ఎవరూ లిఫ్ట్ చేయటం లేదు. అంటే బాబాయి ఇంట్లోనే వుండివుంటాడు.

తటపటాయిస్తూనే ఇంటి నెంబరు తిప్పింది.

"హలో" నీరసంగా వుంది గోపాల్రావు స్వరం.

"బాబాయ్" దుఃఖంవచ్చింది చందనకు.

"ఎవరు... తల్లీ చందూ నువ్వా? " ఆత్రంగా వుంది ఆయన స్వరం.

"అవును... బాబాయ్ నేనే... నిన్న వచ్చాను. వచ్చినపని అయిపోయింది బాబాయ్ వెళ్ళిపోతున్నాను. క్షమించు బాబాయ్... నిన్ను చూడాలని వున్నా రాలేని అశక్తురాలిని..."

"ఏడవకు తల్లీ..." విపరీతమైన దగ్గుతెర అడ్డురావటంతో ఆగాడతడు.

"నీ ఆరోగ్యం బాగాలేదా బాబాయ్? " గద్గద స్వరంతో అడిగింది చందన.

"అవునమ్మా... కొడుకులు సముద్రాలు దాటేరు. రారు... ఈ రాక్షసి ఇలా..." ఆయాసపడుతూ ఆగాడాయన.

"మందులు జాగ్రత్తగా వాడు బాబాయ్"





దిగులుగా అంది చందన.

"అమ్మా... నీ ఆస్తుల తాలూకు దస్తావేజులు, ఇంకా ఫిక్సెడ్ అకౌంట్ పత్రాలు నా దగ్గర దాచాను తల్లీ. దురాశాపరులు నిన్ను మోసగించి ఇలా నిలబెట్టిననాడు నీకు ఉపయోగపడతాయని దాచేశాను. అవి... అవి..."

"ఎవరా ఫోను?" పిన్ని గొంతు వినరావటంతో, "సరే బాబాయ్, వాటిని కల్పన అడ్రస్‌కు పంపించేయవచ్చులెండి... మీ ఆరోగ్యమే..."

అవతలివైపు భూకంపం వచ్చినంత శబ్దంతో ఫోను బాదటం జరిగింది.

నెమ్మదిగా ఫోను పెట్టి నిలబడిన చందన భుజంపై చెయ్యి పడటంతో కెవ్వున అరిచి వెనుతిరిగి "మానస!" అంది సంభ్రమంగా.

అదిరిపడిన మానస ఒక్కసారిగా చందనను చుట్టేసింది. "చందూ!" అంటూ.

ప్లాట్‌ఫారమ్‌కు దూరంగా వున్న రావి చెట్టు కింద అరుగుపై కూర్చున్నారు.

"ఎందుకలా భయపడ్డావ్?" అడిగింది మానస.

జరిగినదంతా చెప్పి "నీకెలా తెలిసింది?" ఆశ్చర్యంగా అడిగింది చందన.

"కల్పన ఇందాకే ఫోన్ చేసింది"

"నీకు కష్టం కలిగించకుండా వెళ్ళిపోదాం అనుకున్నాను."

"రైలు పట్టాలమీదే నడవాలి! మన జీవితాలు శాసనకర్తలు చేసే శాసనాలతోనే నడవాలి!" నిక్షిప్తంగా అంది మానస.

ఆమె ముఖంలో నీలినీడలు చూసి, మధు అన్న మాటలు చెప్పింది చందన.

మానస తను ఢిల్లీ నుంచి వచ్చినప్పట్నుంచీ జరిగిన సంగతులన్నీ చెప్పింది.

చందనకు చాలా బాధ కలిగింది.

"అయితే మధు మాటలు ఆనంద్ నమ్ముతున్నాడా?" అడిగింది మానసను.

నిర్జీవంగా నవ్వింది మానస.

## నవ్వుల కథా కమామీషు

ప్రముఖ హాస్య రచయిత భమిడిపాటి కామేశ్వరరావు, ఇంద్రగంటి ఓసారి ఎదురుపడ్డారు. పలకరింపుగా నవ్వారు ఇంద్రగంటి. దానికి ఫక్కున నవ్వారు భమిడిపాటి. ఎప్పుడూ సీరియస్‌గా ఉండే లెక్కల మాస్టారు అలా నవ్వడంతో ఇంద్రగంటి అవాక్క



య్యారు. భమిడిపాటి నవ్వింది ఎందుకు? ఇంద్రగంటివారేమో బరంపురం కారామసాలా కిళ్లీతో గారపట్టిన పళ్లను నాలుగు రోజుల క్రితమే యంత్ర దంత ధావనం చేయించుకున్నారు. భమిడిపాటి సైతం ఓ వారం కింద అలాంటిదే చేయించుకున్నారు. దీంతో ఆయన ఇంద్రగంటివారు కనబడితే ఆశ్చర్యచకితుణ్ని చేద్దామనుకున్నారట. కానీ ఇంద్రగంటే ముందుగా నవ్వి ఆయననూ నవ్వించారు

"కొన్ని సామెతలు తప్పనిపిస్తాయే చందూ!"

ఏమిటన్నట్లు చూసింది చందన.

"మన బంగారం మంచిదే అయినా బలవంతంగా కరిగించి, కల్తీ చేస్తే మారక చస్తుందా?"

"ఆనంద్‌కు నీపై అనుమానమా?"

"వాడి మాటలమీద నమ్మకమూ కాదు. నాపై అనుమానమూ లేదు"

"మరి?"

"అది, తనకు అతి ప్రీతిపాత్రమైన వస్తువుపై బురద చిందితే కలిగే బాధ!"

మైక్‌లో సదర్న్ ఎక్స్‌ప్రెస్ రాక గురించి అనౌన్సుమెంటు వినవస్తోంది.

అంతవరకూ విశ్రాంతిగా కూర్చున్న



ప్రయాణికుల అలజడితో ప్లాట్‌ఫామ్ హడావుడిగా మారింది.

"ఉత్తరాలు రాస్తావా? " అపురూపమైన వ్యక్తి దూరం అయిపోతుంటే కలిగే భావం మానస ముఖంలో.

తల వూపింది చందన.

నెమ్మదిగా అంది మానస.

"చందూ, ఫ్యూచర్ గురించి వర్రీ అవ్వకు. దేవుడే వుంటాడు, మంచివాళ్ళకు మంచి చేయడానికి!"

"దేవుడా? " చిన్నగా నవ్వింది చందన.

"ఆ దేవుడే రెండుసార్లు గుండెల్లో పొడిచాడు. ఆ గాయాలకు మందు రాస్కుంటూ బతికేస్తాలే. ఇక ఆత్మహత్య మాత్రం చేస్కోను!"

చందన నోరు మూసింది మానస.

ట్రెయిన్ వచ్చింది. సీట్లు వెతుక్కునే వారు ఎదురుగా వచ్చేవారిని, తోసుకుంటూ వెళ్ళిపోతున్నారు.

ట్రైన్ కదులుతుండగా కిటికీలోంచి చెప్పింది మానస. "కల్పనను, తరుణ్‌ను, అఖిల్‌ను అడిగినట్లు చెప్పు. బంగారికి చెప్పు అడిగేనని"

చిరునవ్వుతో చందన, "అలాగే" అంది.

"అయ్యో మర్చిపోయాను, నిన్ను చూసిన సంతోషంలో. ఇదిగో ఈ ప్యాకెట్టు తరుణ్‌కు. ఏం లేదులే, హిమకు చేశాను ఏవో" అంటూ అందించింది.

అందుకుంది చందన.

ట్రెయిన్ వేగం పెరిగింది మరో మజిలీని వెతుక్కుంటూ.

★ ★ ★

ట్రెయిన్ దిగిన చందనకు చిన్న గులాబీల గుత్తితో స్వాగతంపలికాడు తరుణ్. "మమ్మీ!" అంటూ పరుగున వెళ్ళి చెయ్యి అందుకున్నాడు.

తరుణ్ వెనకే నెమ్మదిగా వస్తున్న అఖిల్‌ను గమనించనే లేదు ఆమె.

తరుణ్‌ను దగ్గరకు తీస్కుని, నుదుటిపై చిన్నగా ముద్దు పెట్టుకొంది.

"మేం కూడ వచ్చాం మీ కోసం!"

ఉలిక్కిపడి తలెత్తి చూసింది. చిరునవ్వుతో పలుకరిస్తున్న అతడి కళ్ళనుంచి చటుక్కున చూపు మరల్చుకొంది ఆమె.

"బాగున్నారా? " అంది ఎటో చూస్తూ.

మనసు చివుక్కుమంది అఖిల్‌కు. 'తప్పనిసరి పలకరింపు!' అనుకున్నాడు.

"ఆ" అన్నాడు యాంత్రికంగా.

తరుణ్ చెప్తున్న కబుర్లకు "ఊ" కొడుతూ నడుస్తోంది.

వాళ్ళకు రెండడుగుల దూరంలో నడుస్తున్నాడు అఖిల్.

తను హైదరాబాద్ వెళ్ళిన కారణం అతడికి తెలుసన్న ఆలోచనతో ఆమె మనసు ఒక రకమైన ఇబ్బందికి గురయింది. దానితో ఆమె మౌనంగా ఉండిపోయింది.

అఖిల్ ముఖంలో చిరునవ్వు మాయమై గాంభీర్యం చోటు చేస్కుంది.

కార్లో ఇంటికి చేరేవరకూ ఎవరి ఆలోచనల్లో వారుండిపోయారు.

'ఇన్నాళ్ళూ తన పరిస్థితి వేరు. ఇపుడు వేరు. తను ఎవరికీ అనవసరపు చనువు ఇచ్చి మరో ఊబిలో కూరుకు పోదల్చుకోలేదు. తను, తరుణ్ ఆ అగాధంలో నుంచి ఎలాగో బయటపడ్డారు ఈనాటికి. తమ ఇద్దరి బంధానికి గొడ్డలి పెట్టుగా మారే ఏ అనుబంధం వద్దు. తన ఇష్టానుసారంగా, స్వేచ్ఛగా తరుణ్‌ను పెంచుకోగలిగితే చాలు. అంతకు మించి తనీ ప్రపంచం నుంచి మరేమీ కోరదు!' ఇలా సాగిపోతున్నాయి చందన ఆలోచనలు.

'ఈవిడ తనను అపార్థం చేస్కొని అలా ఫ్రీజ్ అయిపోయినట్టు ప్రవర్తిస్తుంది కాబోలు. తను ఏం చేసినా పరిచితుడే గాని ఆప్తుడు కాదుగా! ఇకముందు తనూ ఆవిడతో కాస్త రిజర్వుడుగా ఉండాలి!'

అతడి ఆలోచనలలా సాగిపోతు న్నాయి..

★ ★ ★

హోమ్‌లో పిల్లలందర్నీ పలకరించిన చందన, గాభరాగా అన్ని గదులూ మళ్ళీ మళ్ళీ తిరిగి చూసింది.

"ఆయమ్మా!" అంటూ పిలిచింది.

చందన దేని గురించి గాభరాపడు తోందో అర్థంకాని ఆయా "ఏంటమ్మా ?" అని అడిగింది.

"నలుగురు పిల్లలు కనిపించటం లేదు. నేనూరు వెళ్ళేప్పుడు బాగానే ఉన్నారుగా"

"బాగానే ఉన్నారమ్మా. ఆళ్ళని తీస్కుపో యేరు"

"ఎవరు? ఎక్కడికి?"

"డాక్టరమ్మా, జయరాం బాబు"

"ఎక్కడికో?"

"ఇటువంటి హోమ్ మరొకటుందా వీళ్ళకు?" తిరిగి అడిగింది.

"తెలవదమ్మా. ఇలా చానా మంది పిల్లల్ని తీస్కెళ్తానే ఉంటారు. కొత్త పిల్లలు వత్తానే ఉంటారు"

తన రూమ్‌లోకెళ్ళి కూర్చుందే కానీ ఆమెకు స్థిమితం లేదు. ఆ పసి పిల్లల ముఖాలు కళ్ళలో కదలాడుతూనే ఉన్నాయి. ముఖ్యంగా ఉయ్యాలలో ఉండి బోసినవ్వులు పంచే పసిపాపలు ఇద్దరూ లేని ఉయ్యాలలు వెక్కిరించినట్లైంది.

కల్పన మాటలు గుర్తొచ్చాయి. 'తనకు తెలియకుండానే ఆ పిల్లలతో ఒక పాశం ఏర్పడింది. లేకపోతే ఇంత బాధెందుకు?'

బాధగా మూలిగిందామె మనసు.

ఒక అరగంట తర్వాత ఫోను మోగింది.

"హలో..." అన్న ఆమెకు నోట మాట రాలేదు.

"ఆ పిల్లల తల్లిలాగా నువ్వు అనవసరపు ఎంక్వైరీలు చేయకు. వాళ్ళు వేరే హోమ్‌లో సేఫ్‌గా ఉన్నారు. నీ పని నువ్వు చూస్కో"

**కొత్తగాలి...**

**వెలుగులు**
**రువ్వేవాడు రవి**
**నిరంతరం**
**రగిలేవాడు కవి!**

*–డాక్టర్ ఎం.విజయగోపాల్,*
*విశాఖపట్నం*

కరకుగా వున్న ఆ కంఠస్వరం జయరాం దిగా గుర్తించింది. ఎవరో స్త్రీ కంఠస్వరం పక్కన కిసుక్కున చిన్నగా నవ్వటం ఫోనులో వినపడింది.

మనసు చివుక్కుమంది చందనకు. ఎంత ఆలోచించినా పసిపిల్లలను జంతువు లను మార్చినట్లు అక్కడకు, ఇక్కడకు మార్చటం నచ్చలేదు ఆమెకు. 'పాపం మళ్ళీ కొత్తచోట, వాళ్ళు అలవాటు పడొద్దూ!'

★ ★ ★

రోజులు యాంత్రికంగా పరుగుతీస్తు న్నాయి. మానస రాసే ఉత్తరాలు చదువు తుంటే బాధ కలుగుతోంది చందనకు. తనవల్లే వారి సంసారంలో కలతలు రేగా యన్న ఆలోచన ముల్లై గుచ్చసాగింది.

ఆ రోజు పోస్ట్‌లో వచ్చిన కవర్ ఓపెన్ చేసిన చందన మనసు ఆనందంతో తల మునకలైంది.

తనూ, ఆనంద్ మళ్ళీ ఎప్పటిలా, ఏ అపార్థాలు లేకుండా ఆనందంగా గడుపుతు న్నామని మానస రాసింది.

ఆ లెటర్ పక్కన పెట్టి రెండో కవరు తీసింది. శుభలేఖ! పేర్లు చూసిన చందన కాసేపు చలనరహితంగా కూర్చుంది.

'మధు మళ్ళీ పెళ్ళి చేస్కుంటున్నాడు.'

అప్రయత్నంగా భారమైన నిట్టూర్పు వెలువడింది.



'ఆ బలి పశువు ఎవరో!' అనిపించింది, ఎంత లెక్కలేదనుకున్నా ఆమె మనసు అప్రసన్నమైంది. స్థిమితం తప్పింది.

కల్పన హాస్పిటల్ నుంచి రావటానికి లేటవుతుందని ఫోన్ చేసింది.

అఖిల్ కార్ రిపేరని వెళ్ళేడు. తరుణ్ కంప్యూటర్ గేమ్ ఆడుతూ అఖిల్ రూమ్‌లోనే ఉన్నాడు.

చందనకు ఒక్కసారిగా తను ఒంటరినన్న ఫీలింగ్ కలిగింది. బాల్కనీలో వున్న ఈజీ ఛైర్‌లో కళ్ళు మూస్కుని వెనక్కువాలింది.

ఏదీ ఆలోచించకుండా ఉండాలి అని విశ్వప్రయత్నం చేస్తోంది.

అపుడే వచ్చిన మేజర్ వర్మ హాల్లో ఏదో హడావుడి చేస్తున్నాడు.

బంగారి అతడికి చిప్స్, ఆమ్లెట్ అవీ తయారుచేస్తోంది.

హాల్లో సోఫాలోనే కూర్చుని బాటిల్ ఓపెన్ చేస్కుని తాగేస్తున్న అతడివైపు బెరుకుగా చూసింది బంగారి.

"అయ్యగారూ, గదిలోకి వెళ్ళి.." బంగారి మాటలు పూర్తి కాకుండానే అరిచేడతడు.

ఆ కేకకు పారిపోయింది బంగారి.

ఒక్క క్షణం అటువైపు చెవి ఉంచిన చందనకు మేజర్ తప్ప తాగుతున్నాడని అర్థమైంది. అతడు తాగుతున్న విస్కీ వాసన తెరలు తెరలుగా ముక్కుపుటాలను తాకుతోంది. ఆ వాసనకు కడుపులో దేవి నట్లవుతోంది ఆమెకు. 'కల్పన జీవితానికి ఇతడు సరిపోయేడు. దేవుడెందుకో విరుద్ధ మనస్తత్వాలు గల మనుషులను ఒక గూటికి చేర్చి వినోదిస్తాడు!'

భుజాలమీద వెనుక నుంచి చేతులు పడేసరికి ఉలిక్కిపడింది చందన.

ఈజీ ఛైర్ వెనుకవైపు నిలబడిన వర్మ ఓ వెకిలినవ్వు నవ్వేడు.

తటాలున లేవబోయిన ఆమె భుజాలపై అతడి చేతులు బలంగా బిగుసుకున్నాయి.

పెనుగులాడుతున్న ఆమెముఖం దగ్గిరగా ముఖం పెట్టి గుసగుసగా అడిగేడు.

"ఏంటలా కూర్చున్నావ్? "

గుప్పున ముఖాన్ని తాకిన విస్కీ వాసనకు ముఖం తిప్పుకుంది విసురుగా.

"నా డాక్టరు పెళ్ళాం లాంటోడేనా నీ మొగుడు కూడా? " నోరు తిరగక అవస్థ పడుతున్నాడు.

"ఛీ!" అంటూ తన చేతులతో భుజాలపై బిగిసిన అతడి చేతుల్ని కదిలించటానికి పెనుగులాడుతున్న చందన ఎదురుగా నిలబడిన వ్యక్తిని చూసి రాయిలా బిగిసిపోయింది.

"బావా!" సింహగర్జన లాంటి అఖిల్ కేకకు ఆమెను వదిలేశాడు వర్మ.

కుర్చీలో నుంచి లేచి బాణంలా గదిలోకి వెళ్ళి తలుపులు మూస్కుంది చందన.

"ఏంటి బామ్మరిదీ... మంచి టైములో దిగబడ్డావ్. ...ఆ పిల్ల... పాపం లోన్లీగా ఉంటే.. కంపెనీ ఇద్దాం... అనీ.... అదీ తప్పేనా..." తూలి పూల కుండీమీద పడబోయినతడిని పట్టుకున్నాడు అఖిల్.

"..షీ ఈజ్ ఎ నై...ష్ గాళ్" అంటూ తూలుతూ వెళ్లిపోయేడు వర్మ.

జరిగిన సంఘటనకు చందన ఎలా స్పందిస్తుందో! కల్పనకు తెలిస్తే ఆమె రియాక్షన్ ఎలా ఉంటుందో?

అనేక రకాల భయాలతో అఖిల్ తీవ్రమైన టెన్షన్‌కు లోనయ్యాడు. ఖాళీ అయిన ఈజీ ఛైర్‌లో నీరసంగా చేర్లబడ్డాడతను.

★ ★ ★

ఎవరితో కలవకుండా ఎవరితో మాట్లాడే అవకాశం కలుగకుండా గదిలోనే ఎక్కువ సమయం గడిపిన చందన మరుసటి రోజు ఉదయమే టిఫిన్ కూడా చెయ్యకుండా హోమ్‌కు వెళ్లిపోయింది.

ఆ సాయంకాలం ఐదుగంటలకే వచ్చే

సిన చందన నెమ్మదిగా తన సామాన్లన్నీ సర్దుకోసాగింది. స్కూల్ నుంచి వచ్చిన తరుణ్ తల్లిని ఎన్నో ప్రశ్నలు వేశాడు.

అన్ని ప్రశ్నలకూ ఒకేమాట చెప్పింది. "నీ బుక్కులవీ సర్దుకో".

అఖిల్‌ను చూసీ చూడనట్లే తనపని తను చేసుకుంటున్న చందనకు లోలోన గాబరాగా ఉంది.

ఇపుడు ఇతడు, కల్పనా తనను అడ్డుకుంటారు వెళ్లొద్దని. తన నిర్ణయం ఎట్టి పరిస్థితిలోనూ మార్చుకోకూడదు!

"మీ నిర్ణయం మారదా!" నెమ్మదిగా అడిగేడు అఖిల్. మౌనంగా ఉండిపోయింది చందన. అవమానంతో, సిగ్గుతో అతడివైపు చూడలేకపోతోంది. జరిగిన సంఘటన అతడు చూడటం చాలా ఇబ్బందిగా ఉందామెకు.

"ప్లీజ్..." అతడి మాటలు పూర్తికాకుండానే నెమ్మదిగా అంది. "దయచేసి నా నిర్ణయం మార్చాలని చూడకండి అఖిల్"

మౌనంగా ఉండిపోయాడు అఖిల్. చందన సర్దటం పూర్తిచేసింది.

మనసంతా ఎవరో ఖాళీ చేస్తున్నట్లనిపించింది అతడికి.

"చందూ..." అతడి పిలుపుకు చటుక్కున తలెత్తి చూసింది ఆమె.

అతడి కళ్లలో దిగులు...

"సారీ... చందన అనబోయి..."

చిన్నగా నవ్వింది చందన. "ఫర్వాలేదులెండి" అంటూ.

"నేనేం ఊరు విడిచి వెళ్లిపోవటం లేదుగా. ఎపుడంటే అపుడు రావచ్చు"

"అఫ్‌కోర్స్. బట్..."

"అఖిల్‌గారూ అర్థం చేస్కోండి. నేను





## కొత్తగాలి...

**దేశం మనుగడకు**
**అణ్వస్త్రాలు**
**ప్రజలు బ్రతకడానికి**
**అన్నవస్త్రాలు**

—అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

వెళ్లకుంటే ఈ ఇంటి ప్రశాంతత చెదిరిపోతుంది" తలవాల్చి చెప్పింది.

"ప్రశాంతతా? " నిట్టూర్చాడతడు. తిరిగి అన్నాడు, "ప్రశాంతత, మనశ్శాంతి! వాటి అన్వేషణలో నా జీవితమే ముగిసిపోయేలా ఉంది" అతడి కళ్లలో కనిపించిన నీటిపొర చూసి నిశ్చేష్టురాలయింది ఆమె. అతడేం చెప్పబోతున్నాడో!

"కొన్ని స్థిరమైన నిర్ణయాలు తీసుకోవటానికి మనసు కఠినమవుతుందేమో!... అది... నా మనసుకూ నేర్పాలి. లేకుంటే పదేపదే పగిలి నన్ను బాధిస్తుంది!"

ఉలిక్కిపడి చూసింది చందన.

కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడిన అతడి దగ్గరకు వెళ్లింది నెమ్మదిగా.

"మీరు బాగుండాలి. జరిగిన విషయం కల్పనకు తెలియనీయకండి దయచేసి. అసలే అంతంత మాత్రంగా ఉన్న వాళ్ల బంధం దెబ్బతింటుంది".

"అలాగే ఇంకేం చెయ్యాలి చెప్పండి" అప్రయత్నంగా అన్నాడతను.

విస్మయంగా చూసింది చందన.

నెమ్మదిగా వెనుతిరిగిన అఖిల్ ఒక్కసారి ఆమె ముఖంలోకి చూసి అక్కడ్నుంచి వెళ్ళిపోయేడు వేగంగా.

ఈరోజు ఇతడికేమైంది?

"ఏయ్ ఏమిటిది? ఎక్కడికీ ప్రయాణం? " ఆశ్చర్యంగా అడిగింది అపుడే వచ్చిన కల్పన.

"హోమ్‌లోనే ఎకామడేషన్ ఇచ్చేరు" ఎటో చూస్తూ చెప్పింది ఇబ్బందిగా.

"అయితే వెళ్ళిపోతావా"?

"వెళ్లాలి కల్పనా. మొక్కుబడిగా వెళ్ళి వస్తున్నట్టుంది నా జాబ్. నేను ఆ పిల్లలకు న్యాయం చెయ్యలేకపోతున్నాను".

"ఓహో! నువ్వు మదర్‌థెరీసాగా సేవలు చేస్తావా? "

"నాలో అంత గొప్పతనం లేదు".

"వాళ్ళలాంటి వాళ్ళో పూర్తిగా తెలియదు. ఒకటి రెండు చేదు అనుభవాలు చవిచూశావ్ కూడా. అయినా అసలు నన్ను వదిలి వెళ్ళటానికి నీకెలా మనసొప్పిందే? "

బాధగా అడుగుతున్న కల్పనను చుట్టేసింది చందన. కళ్ళు సజలాలయ్యాయి.

"నువ్వంటూ లేకుంటే ఎక్కడుండేదాన్నో, ఏమో! వెళ్లి చూస్తాను. ఉండగలిగితేనే ఉంటాను. లేకుంటే మళ్ళీ నువ్వే శరణు!" నవ్వేస్తూ అంది. చందన స్థిర నిర్ణయంతో వున్నట్లు తెలిసి కల్పన మాట్లాడలేదు.

తరుణ్‌కు ఇదేం బాగోలేదు. అతడికి అఖిల్‌కు దూరంగా వెళ్ళటం ఇష్టంలేదు.

అఖిల్, బంగారి సూట్‌కేసులవీ కార్లో ఉంచేరు. బంగారి చేతులు పట్టుకుంది చందన.

"కన్నతల్లిలా చేసేవు సేవలు" అంది.

"పిచ్చి తల్లీ" అంటూ కళ్ళు ఒత్తుకుంది.

కదులుతున్న కార్లోంచి చెయ్యి ఊపింది చందన. తరుణ్ ఎటూ చూడకుండా సీరియస్‌గా కూర్చున్నాడు.

కల్పనకు ఇల్లంతా శూన్యమనిపించింది. ఏం తోచక మానసకు ఫోన్ చేసింది.

"దాన్నెందుకు వెళ్ళనిచ్చేవ్? " అనడిగిన మానస చివరకు "తనకు కూడా ఎక్కడైనా ఉంటే కొంచెం బాగుంటుందేమో. ఆ జాబ్ పసిపిల్లలతో హాయిగా వుంటుంది" అంది.

మానసతో మాట్లాడేక గుండె బరువు కాస్త దించుకున్నట్లైంది ఆమెకు.

చందనను డ్రాప్ చేసివచ్చిన అఖిల్ ఏమీ తోచనట్లు కూర్చున్నాడు.

"అక్కడేం బాగా లేదక్కా. చిన్నరూమ్. నిత్యం పసిపిల్లల ఏడుపులూ, గొడవా! ఎలా వుంటుందో ఏమో!" అన్నాడు.

"కావాలని వెళ్ళిపోయిందిగా! ఉండ నియ్యి" అంటున్న కల్పనవైపు బాధగా చూశాడు అఖిల్.

'ఎందుకు వెళ్ళిపోయిందో తెలిస్తే నువ్వు తట్టుకోలేవు' అనుకున్నాడు లోలోన.

★ ★ ★

తరుణ్‌ను స్కూల్ టైముకు వెళ్ళి తీస్కె ళ్ళటం, తిరిగి తీస్కురావటం చేస్తున్నాడు. సెలవు రోజైతే అఖిల్‌తోనే గడుపుతు న్నాడు తరుణ్. ఎప్పుడైనా చందన వెళ్ళి కాస్సేపు కల్పనతో గడిపివస్తుంది.

కల్పన ఒకసారి వెళ్ళి 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెర్సీ' అంతా తిరిగి చూసింది. పిల్ల లను ముద్దాడింది. చందనకు కొన్ని సల హాలిచ్చింది కూడా!

రోజులు వేగంగా గడిచిపోతున్నాయి. ఒకరోజు ఒక విదేశీ మహిళ వచ్చింది హోమ్‌కు. ఆమె రెండేళ్ళ ఆడపిల్లను పెంచుకోవటానికి తీస్కెళ్తోంది.

చందన ఆ పిల్ల అదృష్టం అనుకుంది.

"మీలాగే పిల్లలు లేని వాళ్ళందరూ తలో పాపనూ దత్తత తీస్కుంటే అనాథలే వుండరు" అంది చందన ఆమెతో.

"రెండు లక్షలు పెట్టి ఎందరు కొనుక్కో గలరు? " చిరునవ్వుతో ఆమె వేసిన ప్రశ్నకు తల తిరిగింది చందనకు.

అంతవరకూ ఎక్కడో పైనుంచి వచ్చే ఫండ్స్‌తో పెంచుతున్నాం అనీ, కోరిన వారికి దత్తత ఇస్తామని చెప్తుంటే నిజం అనుకుంది. ఇపుడు అర్థమైంది ఆమెకు, అక్కడ జరుగుతున్నది వ్యాపారం అని.

హోమ్‌కు వచ్చే పిల్లలు ఎక్కువగా ఆ లేడీ డాక్టరు ద్వారానే వస్తారని అర్థమైంది. ఎక్కడ ఏ తల్లి కన్నబిడ్డలో, ఖండాంతరా లకు సైతం తరలిపోతున్నారు.

గవర్నమెంట్ హాస్పిటల్ నుంచి రోజుల వయసుగల కవలపిల్లలు మాయం అయిన వార్త ఊరును కుదిపేసింది.

కొద్దిరోజులకు హోమ్‌కు నలుగురు పిల్ల లు వస్తే, వారిలో ఇద్దరు కవలలు! చంద నకు వ్యవహారం పూర్తిగా అర్థమైంది.

"అంత పరధ్యానం ఏమిటమ్మా? "

ఉలిక్కిపడి చూసింది.

జయరాం.

"రేపు పెద్దాయన వస్తున్నాడు. ఆ ఏర్పాట్లు చూడాలి. కలలు తర్వాత కనొచ్చు"

అతడివైపు చురుకుగా చూసింది.

హోమ్ అంతా అద్దంలా తయారు చేశారు. రంగురంగుల కాగితాలతో, దీపా లతో అందంగా అలంకరించారు.

పిల్లలందరకూ కొత్త బట్టలు వేశారు.

సభకు ఏర్పాట్లు చేశారు. అంత హడా వుడి ఎందుకో అర్థం కాలేదామెకు.

సాంఘిక సంక్షేమ శాఖా మాత్యురాలు ముఖ్య అతిథిగా వచ్చింది.

ఐదారు కార్లు బిలాబిలా వచ్చి ఆగాయి. పెద్ద పడవలాంటి కార్లోంచి దిగాడు 'పెద్దా యన' అనబడే వ్యక్తి.

అతడు మంత్రిని, మిగతా వారిని స్టేజి పైకి ఆహ్వానించి కూర్చోబెట్టాడు.

ఎవరెవరో అతడి ఔదార్యాన్ని కొనియా డుతూ స్పీచ్‌లిచ్చేరు.

అనాథ పిల్లలకు ఆయనో పెద్ద వరమ ని ఆకాశానికి ఎత్తి పొగిడింది మంత్రిణి.

చివరిగా పెద్దాయన ఉపన్యాసం..

"ఈ సంస్థ మేం స్థాపించి పది సంవత్స రాలు అయింది. ఎందరో అనాథ పిల్లల పాలిట కల్పతరువు మా సంస్థ. విద్యా, వైద్యం, సర్వ సదుపాయాలూ అంది స్తున్నాం. ఎందరో అనాథ పిల్లలను







పెంచుతూ, వారిని కోరిన వారికి దత్తత ఇస్తున్నాం చట్టబద్ధంగా..."

అతడి స్పీచ్ అయ్యేక అతడి సేవలను కొనియాడి అతడికి 'దీనబంధు' అని బిరుదునిచ్చి, శాలువా కప్పారు.

ఆఖరుగా సంస్థలో పిల్లలకు, ఉద్యోగులకు కొత్త బట్టలు పంచుతున్నాడతడు. అతడందించగా మంత్రిణి ఒక్కొక్కరికీ చిరునవ్వుతో అందిస్తోంది.

కెమేరాలు, వీడియోలు కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి!

"తమరు కూడా వెళ్ళండి మేడమ్" జయరాం చెప్పాడు.

"ఆ బట్టలు నాకంటె అవసరం ఉన్న వాళ్ళకి ఇవ్వండి. నాకొద్దు" అంది చందన.

"సరే వద్దు. కానీ మంత్రిగారు కారెక్కే వరకు ఆవిడ కూడానే ఉండాలి నువ్వు. వెళ్ళు తల్లీ తొందరగా"

ఆమెకు జయరాం ప్రవర్తన మాటతీరు కంపరం కలిగిస్తోంది.

నెమ్మదిగా స్టేజ్ దిగి వస్తున్న మంత్రిగారిని సమీపించి ఆమెతో నడుస్తున్న చందన ఒక్కసారిగా షాకు తిన్నట్లు ఆగిపోయింది. మంత్రికారు వెళ్లిపోయింది.

కారుడోర్ ఒకరు తీయగా ఎక్కబోయిన పెద్దాయన "ఆ జయరాం చూడూ, రేపు అమెరికానుంచి..." అంటూ జయరాం కోసం వెనుతిరిగి షాకయ్యాడు.

తనవైపే దిగ్భ్రమతో చూస్తూ నిలబడిన చందన అతడికి కనిపించింది. నమ్మలేనట్లు చూశాడు ఆమెవైపు.

తొట్రుపాటును సర్దుకుంటూ "ఆమె..." అంటూ జవాబుకోసం చూశాడు.

"కొత్తగా చేరిన ఇన్‌ఛార్జ్ సార్"

"పేరు? "

"చందన సార్"

అతడి చేతిలో కారు తాళాలు వున్న గోల్డ్ చెయిన్ జారి క్రింద పడింది. తీసి అందించారు ఎవరో.

ఒక్క క్షణం చందన వైపు చూసి కారెక్కి వేగంగా వెళిపోయాడు.

"మేడమ్ పెద్దాయనకు నచ్చేశారు!"

వెకిలిగా పేలుతూ వెళ్తున్న జయరాంను ఏమీ అనలేదు. ఆమె పెదవులు అప్రయత్నంగా కదిలేయి.

"రమేష్!" ఇన్ని సంవత్సరాల తర్వాత ఇలా కనిపించేడు! నీరసంగా ఒక కుర్చీలో కూలబడింది ఆమె. 'అతడిలా తిరిగి తన జీవితంలో తటస్థపడగలడని అసలు ఊహించలేదు!' గతం సినిమాలా కళ్ల ముందు కదిలింది!

'తనకింకా బాగా గుర్తుంది. ఆరోజు తరుణ్ మొదటి పుట్టిన రోజు! అట్టహాసంగా వద్దంటే వినకుండా భారీగా లంచ్ అరేంజ్ చేసి ఊరందర్నీ పిలిచి ఎంతో ఖర్చు చేశాడు రమేష్. తరుణ్‌తో పాటు తనకు కూడా ఖరీదైన చీర కొన్నాడు వద్దంటే వినకుండా. తన భర్తకు తమ గురించి అంత కన్‌సర్న్ ఉన్నందుకు ఎంతో సంబరపడిపోయింది కూడా.

'రాత్రి ఫ్రెండ్స్‌కు డిన్నర్ అంటూ పార్టీ చేశాడు. ఆ సీసాలు, వాసనలు, వాళ్ల తాగుబోతు మాటలు చాలా ఇబ్బంది అనిపించాయి. అతడికి గట్టిగా వార్నింగ్ ఇవ్వాలి మరోసారిలా పార్టీలవీ ఇంట్లో చేయొద్దని అనుకుంది... కానీ మరి ఆ అవసరమే కలుగలేదు... ఏదో మంచి బిజినెస్ చెయ్యిదాటిపోతుందని, రెండు లక్షల రూపాయలుంటే కోట్లు సంపాదించొచ్చు అని బలవంతంగా తరుణ్ పేర్న ఉన్న ఎఫ్.డి. పేపర్స్ తీస్కుని కార్లో ఆ ఫ్రెండ్స్‌తో కలిసి వెళ్లిపోయాడు. అదే ఆఖరుగా చూడటం! తరుణ్ తన బుల్లి చేతులతో టాటా చెప్పేడతడికి!'

తనను, పసిబిడ్డను వదిలి తన డబ్బుతో పరారీ అయ్యాడని రుజువైంది.

# కొత్తగాలి... 

**వెన్నెలకై**
**చకోరమై**
**నిశీథిలో**
**వేచి ఉన్నా**

– శ్రీజ, రచ్చపల్లి, కరీంనగర్

"రామ్మా. మంచు కురుస్తోంది" పిలిచింది ఆయా. ఉలికిపడి చూసింది ఆమె.

"లేమ్మా, అందరూ వెళ్లిపోయారు."

యాంత్రికంగా గదిలోకి వెళ్లిపోయింది.

అనేక ప్రశ్నలతో ఆమె మెదడు పగిలిపోతోంది. పసిపిల్లవాడి రెండు లక్షల రూపాయలతో పరారీ అయిన మనిషి ఇక్కడ తేలాడు. రాజకీయ నాయకులను మరిపించే వేషభాషలతో, సంఘంలో.. అదీ దేశ రాజధానిలో పెద్ద పేరూ, ప్రతిష్టా! చేస్తున్నది రాక్షస వ్యాపారం, పసికందులను అమ్ముకొంటూ... ఛ!

ఆమె మనసు అతడి పట్ల అసహ్యంతో ఉడికిపోతోంది! ఇపుడు తను, తననూ, తన బిడ్డనూ వదిలి తన డబ్బుతో పరారీ అయి, దొంగ బతుకు బతుకుతున్న రమేష్ ఇచ్చే జీతంతో బతకాలా?

ఊహూ! తనవల్ల కాదు.

"ఇప్పుడేం చెయ్యాలి? "

ఎక్కడ వుండాలి? ?

నెమ్మదిగా పెట్టె తెరిచింది చందన. పెట్టె అడుగున కాగితపు మడతలోని ఫోటోను పైకి తీసిందామె. కంపిస్తున్న చేతులతో పట్టుకు చూసింది.

పూల మాలలతో ఉన్న పెళ్లిఫోటో అది.

మళ్లీ గతంలోకి పరుగు తీసింది ఆమె మనసు. పెళ్లికొడుకును చూసి అందరూ తను అదృష్టవంతురాలన్నారు! పెళ్లయిన రెండేళ్లకే అదృష్టం తేలిపోయింది. ఎన్ని రోజులైనా అతడి జాడ లేక పోయేసరికి బాబాయి ఎన్నో విధాల ప్రయత్నించి చూశాడు. రమేష్ అజ ఏం తెలియలేదు!

ఎన్ని రాత్రులో అతడికేం కీడు జరిగిందోనన్న బాధతో దుఃఖించింది తను.

రోజులు, నెలలుగా, నెలలు సంవత్సరాలుగా మారిపోతున్నా రమేష్ జాడలేదు.

అయినా ఏదో మూల మనసులో అతడు తప్పక తమకోసం వెతుక్కుంటూ వస్తాడన్న ఆశ బతికే ఉంది. తరుణ్‌కు ఏడేళ్లు నిండిపోయాయి. మనోవ్యథతో కుంగిపోతున్న తనను ఒకదరి చేర్చాలన్న తపనతో బాబాయి, ఇటు తన స్నేహితులు కలిసి ఒప్పించి, ఆదర్శాలకు మారు రూపంగా ముసుగు వేస్కున్న మధుతో తన జీవితాన్ని మరో ముడివేశారు!

చిక్కుముడిగా మారిన ఆ బంధం తన మనసును దహించి వదిలిపెట్టింది.

అడ్రస్ దొరకని ఉత్తరంలా తను తిరిగి యథాస్థితికి చేరుకుంది. తన మనసుపైనా, సంఘంలో తన ఉనికిపైనా విధి రెండు సార్లు ముద్ర వేసింది కసిగా!

"మమ్మీ" పరుగున వచ్చేడు తరుణ్.

"ఆంటీ ఈ కవరు నీకిమ్మంది. నేను అన్నం తినేసేను. మర్చిపోయాను. అంకుల్ బయట కార్లో ఉన్నారు" అంటూ మళ్లీ బయటకు పరుగుతీశాడు.

మంచంపై నిర్జీవంగా కూర్చుందామె.

ఏం జీవితం తనది?

ఒక ద్రోహి చేతుల్లో ఘోరంగా మోసపోయింది. అక్కడ్నుంచి ఒక కిరాతకుడి చేతిలో నరకం చవిచూసింది.

చేతిలో ఫొటోను రెండు ముక్కలుగా చించి విసిరికొట్టింది దుఃఖిస్తూ!

తరుణ్ చెప్పినా ఆమె బయటకు రాక పోయేసరికి, ఒకసారి చూసి వెళ్దాం అని వచ్చిన అఖిల్‌పై పడింది ఆ ఫొటోలో ఒక ముక్క. కొంచెం దూరంగా పడిన రెండో ముక్కను తీసి దగ్గరగా చేర్చి చూశాడు

అఖిల్.

"మైగాడ్!" అనుకున్నాడతడు.

చందన పక్కన ఫొటోలో మధుకాదు. అంటే రమేష్ అయి ఉంటాడు. కల్పన ద్వారా ఆమె కథ విని ఉన్న అఖిల్ ఊహించగలిగేడు. ఆ ముక్కలను జేబులో ఉంచుకున్నాడు.

ఆమె తన ఉనికినైనా గమనించకుండా దుఃఖిస్తోందంటే, అందుకు కారణం కేవలం ఆ ఫొటో మాత్రమే అయి ఉండ దని అనిపించింది అతడికి.

నెమ్మదిగా తలుపులు దగ్గరగా వేసి వెళి పోయేడతడు. తరుణ్, అతడికి "బై" చెప్పి లోపలకు వచ్చేడు. తలుపువేసిన శబ్దానికి ఉలిక్కిపడి చూసింది ఆమె.

తరుణ్‌కు కనిపించకుండా ముఖం తిప్పు కొని లేచింది కళ్ళు ఒత్తుకొంటూ.

"చాలా లేటైంది. పడుకోమ్మా!" అంటూ పక్క పరిచింది.

తల్లి ముఖం చూసిన తరుణ్ మారుమా ట్లాడకుండా పడుకున్నాడు.

తరుణ్‌పై చెయ్యి వేసి పడుకుంది చందన. ఆమెకు కన్ను మూతేపడలేదు.

★ ★ ★

ఎవరో తలుపు నెమ్మదిగా తట్టటంతో లేచింది చందన. టైమ్ చూసింది. ఒంటి గంటవుతోంది.

రాత్రి సమయంలో ఏ పిల్లల అనారో గ్యమో, మరేదైనా సమస్యో వస్తే తప్ప ఆయాలు లేపరు తనను!

"ఎవరు?" అంటూ తలుపు తెరిచిన చందన వచ్చిన వ్యక్తిని చూసి నివ్వెరపో యింది. అతడివైపు ఇంతింత కళ్ళతో చూస్తూ తలుపు మూసేయటానికి ప్రయ త్నించింది. అతడు ఆ ప్రయత్నాన్ని విఫలం చేసి తలుపులు మూయకుండా ఆపి వచ్చి లోపల నిలబడ్డాడు.

"రమేష్ మర్యాదగా బయటకు వెళ్ళిపో" తీవ్రంగా ఉంది చందన కంఠస్వరం.

"ప్లీజ్ చాందీ..."

"నోర్ముయ్!" రెండు చేతుల్తో చెవులు మూసుకుంది.

"పది సంవత్సరాల క్రితమే నువ్వూ, నీ పిలుపు చచ్చిపోయారు" ఆయాసంతో రొప్పుతూ అంది చందన.

"నన్ను మాట్లాడనీయ్. అల్లరి చేయకు" బతిమలాడుతున్నట్టుంది అతడి స్వరం.

"వద్దు నీ ముఖం చూడటం కూడ నాకి ష్టంలేదు"

"నీతో మాట్లాడదామని వచ్చేను. మాట్లా డికానీ వెళ్ళను" మొండిగా అన్నాడు.

మింగేసేలా చూసింది ఆమె.

"నాకు ఏం మిగిల్చావని, దేనిని గురించి మాట్లాడటానికి వచ్చేవు?" రెండుచేతుల్లో ముఖం దాచుకుని దుఃఖిస్తున్న చందనను భుజాల చుట్టూ చేతులు వేసి దగ్గరకు తీస్కోబోయేడతను.

"ఛీ ఛీ!" అంటూ గొంగళిపురుగును విది లించుకున్నట్లు విదిలించి దూరంగా వెళ్ళి నిలబడింది.

"ప్రశాంతంగా విను. చిన్న ప్రపోజల్. నాకు నీ పట్ల ఉన్న ప్రేమ అలాగే చెక్కు చెదరకుండా ఉంది" గుండెపై అరిచెయ్యి వుంచుకుంటూ అన్నాడు.

"ప్రేమా! సంపంగి పరిమళంలాంటి ఆ పదాన్ని మురికికూపంలాంటి నీ నోట్లో నాననియ్యకు. వెళ్ళిక్కడ్నుంచి."

"నువ్వు ఎన్నైనా అను. నిజం చెప్తున్నా. తప్పనిసరి పరిస్థితుల్లో పెళ్ళి చేస్కున్నాను. నీకు ఈ కూలిపని చేస్కు బతికే కర్మ ఎందుకు? ఒక ఇల్లు తీస్కుంటాను. కాదు, కొని పడేస్తాను. మనం హాయిగా ఉండొచ్చు"

తలుపు తీయబోయిన ఆమెను వెనక్కు లాగి తలుపుదగ్గర అడ్డంగా నిలబడ్డాడు.

"నా కళ్ళముందు నుంచి వెళ్ళిపో.







లేకుంటే నీ మర్యాద నిలవదు" స్థిరంగా అంది చందన.

మంచంపై నిద్రపోతున్న తరుణ్‌వైపు చూస్తూ "నీ కొడుకా? " అన్నాడు.

"తల్లినీ, బిడ్డనూ వదిలి డబ్బు పట్టుకు పారిపోయిన ఓ విశ్వాసఘాతకుడి కొడుకు..."

"సరే, సరే! వాడెవడి కొడుకైతే నాకేం? నా మాట వింటేనే నువ్వు ఇక్కడుండాలి. అతితెలివికి పోయి నన్ను అల్లరిపెట్టే ప్రయత్నం చేసేవనుకో" ఆగేడతడు.

చటుక్కున చూసింది చందన. "ఏం చేస్తావురా? నీ నీచమైన బుద్ధిలాంటిదే, నువ్వు చేస్తున్న ఈ హీనమైన వ్యాపారం కూడా. నాకన్నీ తెలుసు! తల్లుల పొత్తిళ్లలో పిల్లల్ని తోడేళ్లలా ఎత్తుకొచ్చి అమ్ముకుంటున్నావు" ఆవేశంగా అంది చందన.

"అబ్బో చాలా వివరాలు సేకరించావు అనతికాలంలోనే. మరెక్కడైనా పెదవి విప్పేవో నీ కొడుకు నీకుండడు. అంతే!" అంటూ తలుపు తీస్కువెళ్ళిపోయాడు.

అతడు వెళ్తూ అన్న మాటకు ఆమె వెన్నులో చలి పుట్టింది. మెదడు మొద్దుబారిపోయింది. అలా ఎంతసేపు ఉందో ఆమెకే తెలియదు.

ఇక్కడ ఒక్క క్షణం ఉండకూడదు. వెళ్లిపోవాలి! కానీ వెళ్ళటానికి చోటేది? ఎక్కడకు వెళ్ళాలి. మళ్ళీ కల్పన దగ్గరకు వెళ్ళలేదు తను!"

"చందనమ్మా" అన్న ఆయా పిలుపుతో శరీరంలో, మెదడులో చలనం కలిగింది ఆమెకు. గది బయటకు వెళ్ళాలంటేనే ప్రాణం చచ్చిపోయినట్లుంది ఆమెకు.

రమేష్ రావటం, వెళ్ళటం అందరూ చూసే ఉంటారు. కావాలనే చేశాడిదంతా అనుకుంది.

మళ్ళీ ఆయా పిలవటంతో ఏమిటన్నట్లు చూసింది. "అమ్మా, నీకు ఫోనొచ్చింది" అని చెప్పి వెళ్ళిపోయింది.

యాంత్రికంగా ఫోను దగ్గరకు వెళ్ళింది. రిసీవర్ తీస్కుని "ఎవరు? " అంది.

"చందూ ఎలా ఉన్నావే? "- కల్పన.

"బాగానే ఉన్నాను" నిర్లిప్తంగా చెప్పి ఎందుకీ టైమ్‌లో చేశావ్? " అంది.

"ఏం లేదు.. ఏదో ఎమర్జెన్సీ కేస్‌లు అటెండయి లేటుగా వచ్చేను. నిద్రపట్టక నీతో మాట్లాడాలనిపించింది ఎందుకో".

మౌనంగా ఉండిపోయింది చందన.

"నీకు రెండ్రోజులు లీవ్ దొరుకుతుందేమో చూడు".

"ఎందుకు? ఏమైంది? "

"మనం సరదాగా ఎక్కడికైనా వెళ్ళి గడపొచ్చని.. ఏం లీవు లేదా? " అడిగింది.

పేలవంగా నవ్వుకుంది చందన.

"లీవ్ నేనూ తీస్కోవాలనుకుంటున్నా".

"అంత వీక్‌గా అలా ఉందేంటే నీ వాయిస్? ఒంట్లో బాగుండలేదా? "

"బాగానే ఉంది" కంపించింది చందన స్వరం. కార్డ్‌లెస్‌లో వింటున్న అఖిల్‌కు స్థిమితంగా లేదు.

చందనను అంత హృదయవిదారక స్థితిలో చూసిన అతడి గుండె భారమైంది.

ఆమెను చేరి కన్నీరొత్తి ఊరడించాలని తహతహలాడింది అతడి హృదయం!

"చందూ, నీకా జాబ్ నచ్చకపోతే రిజైన్ చేసి వచ్చేసెయ్. మరేం కొంపమునిగిపోదు" ఆవేశంగా అంది కల్పన.

"అలాగే" అంది హీనస్వరంతో.

అఖిల్ తను చూచిన చందన స్థితి చెప్పేడు. అదేమిటో చందనే చెప్తుందని చూస్తోంది కల్పన. చివరకు ఉండలేక అడిగింది. "నా నుంచి నీకు రహస్యాలున్నాయని ఇపుడే తెలిసింది" అంది కల్పన.

"ఏం చెప్పమంటావ్ చెప్పు? గద్ద నోటి నుంచి బయటపడితే రాబందు మాటువేసిందనా? " కళ్ళలో నీళ్లు ఉబికివస్తుండగా





అంది చందన.

"చందూ... ఏమిటి నువ్వనేది? "

"రమేష్ కనిపించేడు".

"ఆ! ? " నమ్మలేనట్లు అడిగింది కల్పన.

"అవును ఇంతకంటే ఇపుడు ఇంకేం చెప్పలేను" అంటూ ఫోన్ పెట్టేసింది.

తిరిగి వెంటనే ఫోను రింగవుతూంటే, ఒక్కక్షణం అలాగే చూసి ఫోను ఎత్తింది.

అవతలి వైపు కంఠస్వరం వింటూనే ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగం పెరిగింది.

అవతలి నుంచి అతడు 'హలో హలో' అంటున్నా ఆమె నోరు పెగలలేదు.

"చందూ... ప్లీజ్ మాట్లాడు. నువ్వేనని నాకు తెలుసు" అఖిల్ బతిమలాడుతున్నట్లు అన్నాడు.

"హలో" ఎలాగో అంది.

"ఫోను పెట్టేయకు. ప్లీజ్, నా మాట పూర్తిగా విను".

"చెప్పండి"

"నేను కారు తీస్కు వస్తున్నాను. నువ్వు రావాలి. సారీ... మీరు రావాలి"

అఖిల్ మాటలలో తన కోసం పడే ఆరాటం, ఆవేదన చందనను ఒక్కక్షణం అశక్తురాల్ని చేసేయి. తనకూ, తన ఉనికికీ లోపించిన భద్రత, రక్షణ కల్పించగల వ్యక్తి అతడే ననిపించింది. తన తరుణ్‌ను కంటికి పాపలా కాపాడగల రక్షకుడు అతడేనని పదేపదే మనసు చెప్తోంది.

తరుణ్‌ను తీస్కుని ఎగిరి వెళ్లి అతడి సమక్షంలో వాలాలనిపించింది!

విరిగిన రెక్కలను విదిలించలేక మనసు మూగపోయింది.

ఏళ్ల తరబడి రాతి పలకగా మారిన గుండెతలుపును, ఆ తలపు సున్నితంగా తట్టింది. ఆమె ఒక్కసారిగా ఉలికిపడింది.

మనసును కాసేపు మూగగా, చెవిటిగా మార్చుకుంది.

'వీల్లేదు. తను ఎవరి అధీనం కాదలచుకోలేదు' హెచ్చరించింది మనసును.

## వడ్లగింజలలో బియ్యపు గింజ

మునిమాణిక్యం నరసింహారావు, 'తెలుగులో మంచి హాస్యం పూర్వం లేదు. ఉన్నదల్లా అసభ్యమే. మంచి హాస్యం నవ్యసాహిత్యానిదే' అన్నారు. సభాధ్యక్షులు వేదుల సత్యనారాయణ శాస్త్రి చట్టున లేచి హాస్యాన్ని మన పూర్వీకులు బాగా పండించారన్నారు. వెంటనే మునిమాణిక్యం, దీనిపై ఉభయ భాషలూ చదివిన ఇంద్రగంటి స్పందించాలన్నారు. ఇరుకున పడ్డ ఇంద్రగంటి 'పెద్దలిద్దరూ పరీక్ష పెట్టారు. పూర్వం మనవాటిలో హాస్యం ప్రధాన రసంగా లేనిది నిజం. ఆంగ్ల సంపర్కంతో దానికొక ప్రత్యేక పీఠం ఏర్పడింది. పానుగంటి, గురజాడ, మొక్కపాటి హాస్యాన్ని అగ్రపీఠం ఎక్కించారు. పూర్వం సంస్కృతాంధ్రాల్లో హాస్యమే లేదని, ఉన్నా అసభ్యమనడం సరికాదు. తిక్కన ఉత్తర కుమార చిత్రణం, నన్నయ బకాసుర ఘట్టం మనవారి హాస్యప్రీతికి నిదర్శనాలు. సంస్కృత నాటకాల్లో మాళవికాగ్నిమిత్రం విదూషకునిలో గడుసైన హాస్యం ఉంది. మృచ్ఛకటికం మైత్రేయుని మాటల్లో హాస్యం ఉంది. వేదులవారు విదేశీ హాస్య రచనలను, మునిమాణిక్యం తిక్కన ఉత్తరుణ్ణి, వాల్మీకి మధువనాన్నీ చదివితే వడ్లగింజలో బియ్యపుగింజ.. అసలీ చర్చే లేదన్నారు. దీంతో వాతావరణంలో వేడి తగ్గింది.

"హలో... మాట్లాడరేం... చందూ" అతడు పిలుస్తూనే ఉన్నాడు.

నెమ్మదిగా చెప్పింది. "సారీ అఖిల్. మీ అభిమానానికీ, ఆదరణకూ కృతజ్ఞురాలిని. అవి పొందే అర్హత నాకు లేదు. దయచేసి నాకోసం మీ విలువైన సమయాన్ని వృధా చేస్కోకండి"

"ఎందుకింత వైరాగ్యం. చీకటిలో అలమటించే వ్యక్తి చిన్న వెలుగు రేఖ ప్రసరించినా ఆ దిక్కుగా పయనిస్తాడు..."

"లేదు అఖిల్. నేను వెలుగును వెతుక్కోవటంలేదు. నాకు ఇక్కడ... బాగానే ఉంది. ఈ సమయంలో వందమంది పసిపిల్లల బాధ్యత నాపై ఉంది"



"మీ బాధ్యతలు సరే, కాని మీలాంటి సున్నిత మనస్కులు అక్కడ ఒక్క క్షణం ఉండలేరు. ఫర్ యువర్ ఇన్ఫర్మేషన్, ఇందాక తరుణ్‌ను దింపినపుడు నేను మిమ్మల్నీ, మీ స్థితినీ చూసేను. అందుకే... అందుకే మాకీ క్షోభ! మీ విలువైన బాధ్యతలను మీరు తలపై నుంచి దించుకున్న తర్వాతే వస్తాను మీకోసం"

ఫోను పెట్టేశాడు అతడు.

నెమ్మదిగా రిసీవర్ పెట్టింది. తనవైపే చూస్తూ కూర్చున్న ఆయాలను చూసి, వీలైనంత సహజంగా కనిపించటానికి ప్రయత్నిస్తూ.

"ఆ కవలపిల్లలిద్దరికీ జలుబు తగ్గిందా? విక్స్ రాసి, ఆ డ్రాప్స్ వెయ్యి మళ్లీ" అంది.

"ఇందాక పెద్దయ్యగారొచ్చినప్పుడు ఏసేనమ్మా. మంచిగనే ఉంది ఆ పిల్లలకు"

ఆయా మాటలు పొడిచినట్లున్నాయి.

"సరే" అంటూ వెళ్ళిపోయి తలుపులు మూస్కుంది.

తరుణ్ మంచి నిద్రలో ఉన్నాడు.

"అఖిల్ వచ్చిందే తను గమనించలేదు. ఛ, తన జీవితం ఎందుకిలా తయారైంది? ఇంకా కక్ష తీరలేదా ఆ పైవాడికి!"

అలిసిన మనసును, శరీరాన్ని నిద్ర తన ఒడిలోకి తీస్కొని ఊరడించింది.

★ ★ ★

ఫోన్ పెట్టేసిన అఖిల్ మనసు తీవ్ర అశాంతికి లోనైంది. నిద్రపట్టక దొర్లుతున్న అతడు అలికిడికి తిరిగి చూశాడు.

కల్పన నెమ్మదిగా వచ్చి అతడి పక్కన కూర్చుంది.

"నువ్వు పడుకో అక్కా. రేపు ఉదయాన్నే వెళ్లక్కర్లేదా? " అన్నాడు.

"నిద్రరాకే నీ దగ్గరకు వచ్చేను. ఏమంది చందూ.. రానందిగా? " అడిగింది కల్పన.

తను చందనతో మాట్లాడింది కల్పన విన్నట్లు అర్థమైంది అతడికి.

"ఊ" అన్నాడు.

"అఖిల్ ఒకటడుగుతా. నిజం చెప్తావా? " అఖిల్ ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది.

"ఏమడుగుతుందో? " అనుకుంటూ "అడుగు" అన్నాడు.

"చందన హఠాత్తుగా ఇక్కడ్నుంచి ఎందుకు వెళ్లిపోయింది? "

ఊహించని ఆ ప్రశ్నకు అతడి ముఖంలో చోటుచేసుకున్న తత్తరపాటు, కల్పన దృష్టిని దాటిపోలేదు.

"మాట్లాడవేం అఖిల్? " రెట్టించింది.

"ఏమో. ఆమెనే అడగలేకపోయావా? "

"అడుగుతాను తప్పకుండా. కొన్ని నిజాలు తెలియటం వల్ల కొన్ని ప్రయోజనాలుంటాయి అఖిల్"

"అవును"

"నేను చందనను రేపు కలుస్తాను, నువ్వు నిద్రపో" అంటూ వెళ్లిపోయింది.

చందన వెళ్లిపోవటానికి కారణం తను అనుకుంటోందా ఆమె!

నిజం తెలియటం వల్ల ప్రయోజనం కాదు, ప్రమాదం అని ఎలా చెప్పాలి!

★ ★ ★

ఆ రాత్రి వారితోపాటు మరో వ్యక్తికి కూడా నిద్రపట్టలేదు.

తన చీకటి సామ్రాజ్యంలోకి చందన హఠాత్ ప్రవేశం తీవ్ర మనస్తాపానికి గురిచేసింది రమేష్‌ను.

కష్టపడి సంవత్సరాల తరబడి శ్రమించి, ఎన్నో ఒడిదుడుకులను అధిగమించి నిర్మించుకున్న కంచుకోట అతడి వ్యాపారం.

తను కుడి భుజంగా పనిచేసిన డాన్ కూతురు సుజాతను చేస్కోవటంతో అతడి స్థాయి మరో మెట్టు పైకి ఎక్కింది.

ఒకే కూతురు గల మామ మరణంతో అతడి అండర్‌గ్రౌండ్ వరల్డ్‌కి కింగ్ అవ్వటమే కాకుండా అతడి కుమార్తె తన భార్య

అయిన సుజాత పేర్న ఉన్న కోట్ల ఆస్తిపై అజమాయిషీ దొరికింది రమేష్‌కి.

సుజాత అతడేం చేస్తే అదే నమ్మే అమాయకురాలు. పిల్లలు లేరన్న దిగులుతో లక్షలు వెచ్చించి గుళ్ళూగోపురాలు కట్టించింది. తరచూ తీర్థయాత్రలు చేస్తుంది భర్తతో కలిసి. ఇప్పుడు తన కంచుకోటను బీటలు వార్చే ఫిరంగిలా కనిపిస్తోంది చందన ఉనికి.

'అదీ, దాని కొడుకూ ప్రస్తుతం తన గుప్పిట్లోనే ఉన్నారు. క్షణం పట్టదు నలిపి వేయటానికి... కానీ దానికి లోకల్‌గా ఉన్న కనెక్షన్లేంటో తెలుసుకోవాలి!'

ఆలోచన వచ్చిందే తడవుగా జయరాం ఫోన్ మోగింది.

డాక్టర్ సువర్ణతో కలిసి విస్కీ సేవిస్తున్న జయరాం, బాస్ కంఠం విని అదిరి పడ్డాడు. ఒళ్ళో వయ్యారంగా పడుకొన్న సువర్ణను నెట్టేశాడు. ఏమో అనబోతున్న ఆమె నోరు మూశాడు రెండో చేత్తో.

"ఎస్ బాస్, ఎస్ బాస్... ఎస్ బాస్" ఓ పదిసార్లైనా అని ఫోన్ ఆఫ్ చేసిన అతడు ఆలోచనలో పడ్డాడు.

"ఎవరు డార్లింగ్ ఆ యస్ బాష్? " విస్కీ పవరు తలకెక్కి నోరు తిరగటం లేదు సువర్ణకు.

"ఛస్ మాట్లాడకు. నాకసలే బుర్ర వేడెక్కిపోతోంది." అంటూ హడావుడిగా బట్టలు వేస్కుని వెళ్లిపోతున్న జయరాంను "నాకంటే ముఖ్యమైన పనేంటిరా నీకు? " అంటూ నోటికొచ్చినట్టు తిట్టి మత్తులో కూరుకుపోయింది డాక్టర్ సువర్ణ.

★ ★ ★

హోమ్‌లో హడావుడికి మెలకువ వచ్చింది చందనకు. వెంటిలేటర్‌లో నుంచి ఎండ పడుతోంది. టేబిల్ మీది అలారం టైమ్ పీస్‌లో ఎనిమిదైంది.

ఆమె దృష్టి టైమ్ పీస్ పక్కనే ఉన్న బ్రౌన్‌కవరు మీద పడింది.

అది బాబాయ్ దగ్గర్నుంచి! చూడనే లేదు. లేచి దాన్ని ఓపెన్ చేసింది.

తలుపుపై చిన్నగా తడుతున్న శబ్దం.

కవర్ మళ్ళీ టేబిల్‌పై పెట్టింది. చీర సర్దుకుని తలుపు తీసింది.

ఎదురుగా నిలబడిన కల్పనను చూసి ఆశ్చర్యపోయింది.

"ఇదేంటి ఇంత ఉదయాన్నే వచ్చేవ్? హాస్పిటల్‌కు లేటవ్వదూ? " అంటూ లోపలకు రమ్మంది కల్పనను.

ఓసారి గదిని పరిశీలించి, తరుణ్ దగ్గరకు వెళ్ళి చూసి "ఈ రోజు స్కూల్ లేదా? " అని అడిగింది.

"అవును. ఈ రోజు ఏం వారం? " అని ఆలోచిస్తున్న చందన మానసిక స్థితి అర్థమైంది కల్పనకు.

"ఈరోజు ఫ్రైడే, స్కూలుందిగాని, నువ్వు కాస్త ఇలా కూర్చుంటే మాట్లాడుకోవచ్చు" అంది కల్పన.

కుర్చీ లాక్కుని కూర్చుంటూ 'ఈమె ఏం మాట్లాడటానికి వచ్చిందో!' అనుకుంది.

"చందనా, నిన్నేం జరిగిందిక్కడ? ఐ మీన్ అతడెక్కడ కనిపించాడు? "

"ఎవరు? "

"ఇంకెవరు, రమేష్."

క్లుప్తంగా వివరించింది జరిగినదంతా. కానీ ఎందుకో అతడు ఆఖరున బెదిరించిన విషయం చెప్పబుద్ధి కాలేదు చందనకు. అది తను ఈ రోజు ఆలోచించి ఒక నిర్ణయం తీస్కోవలసి ఉంది. "నమ్మలేకపోతున్నాను చందూ! ఏదో ఇక్కడ ప్రశాంతంగా గడుపుతావంటే ఈ మలుపేమిటో! సినిమాలు చూసి అలా డైరెక్టు చేస్తారనుకుంటాం కానీ పెద్దడైరెక్టరు ఆ పైవాడు!" బాధగా అంది కల్పన.

మౌనంగా ఉండిపోయింది చందన.

"మరి ఏం చేద్దాం అనుకుంటున్నావ్? "







"అదే ఆలోచిస్తున్నాను." అంది చందన.

"నువ్వు వెంటనే రిజైన్ చేసి, తరుణ్‌ను తీస్కు వచ్చేయి మనింటికి."

చందన మౌనంలో అయిష్టత!

ఒక్క క్షణం ఆమె ముఖంలోకి చూసి తిరిగి అడిగింది. "అసలు... నువ్వు సడన్‌గా ఎందుకు వచ్చేసేవు ఇక్కడకు?"

మౌనమే సమాధానం.

"నేను లేనపుడు ఏం జరిగింది చందూ? ఎవరేమన్నారు?"

"-----"

"అఖిల్ తప్పుగా ప్రవర్తించాడా?"

చటుక్కున చూసింది కల్పన ముఖంలోకి. "ఛ! అఖిల్ గురించి అలా ఎలా ఊహించేవ్? నాకే స్వతంత్రంగా ఉండాలనిపించి వచ్చేను. అంతే."

"సరే నీకో విషయం చెప్పాలి. నిన్న రాత్రి అఖిల్ ఇక్కడకు వచ్చేడు... అతడు వచ్చేసరికి నీస్థితి చూసి మతి పోయిందతడికి. నువ్వు చించి పారేసిన ఫొటో ఎక్కడ పడిందో తెల్సా?"

కంగారుగా చూసింది చందన.

"ఆ ముక్కలు అఖిల్‌పై పడ్డాయి. చూశాడు. ఆ సమయంలో నిన్ను పలుకరిస్తే మరింత బాధించిన వాడినవుతానని నిశ్శబ్దంగా వచ్చేశాడు."

పాలిపోయిన ముఖంతో చూస్తున్న చందన చేతిని చేతిలోకి తీస్కుంది కల్పన.

"నీ బాధ కళ్ళారా చూసిన అఖిల్, చూడని నేనూ రాత్రంతా ఎంత అశాంతిగా గడిపామో తెల్సా నీకు? తెలియదు. అతడు వచ్చి తీస్కెళ్తానంటే అపార్థం చేస్కున్నావ్. చందనా జీవితంలో తోడేళ్ళనే చూసిన నువ్వు మనుషులను, మానవత్వాన్ని, ప్రేమనూ విస్మరించేవు."

"అది కాదు కల్పనా..." ఏమో చెప్పబోయిన చందనను వారించిందామె.

"నీ పేరుకు తగినట్లే మంచి గంధపు సువాసనలు వెదజల్లే చల్లటి మనసు నీది. గంధపు చెట్టును నరికి దోచుకున్నట్లే, ఇద్దరు కిరాతకులు నీ జీవితాన్ని దోచుకున్నారు. ఆ దిగ్భ్రాంతి నిన్ను శిలను చేసింది. చందనాన్ని దైవానికి అర్పించి ఆరాధించే భక్తులు కూడా ఉంటారు చందనా! ఈ చందనను హృదయంలో పదిల పరుచుకోవాలని ఆరాటపడుతున్న మనసు గురించి ఆలోచించు. నువ్వు తెలివైనదానవు. నే వెళ్తా" అంటూ చెప్పదల్చుకున్నది టకటకా చెప్పేసి వెళ్ళిపోతున్న కల్పనను చూస్తూండిపోయింది చందన. 'కల్పన నిజంగా వచ్చి, తనతో మాట్లాడిందా? కల కాదు కదా' అనుకుంది.

ఆమె మనసు పుస్తకంలో పేజీలు, ఆలోచనల సుడిగాలికి ఎగిరిపోతుంటే సరిచేయటానికి ప్రయత్నిస్తోందామె.

జీవితం చేదు అనుభవాలను మోసిన పుటలపై అవి తిరిగి ఎగిరి తన కంట పడకుండా బరువును ఉంచటానికి ప్రయత్నిస్తోందామె మనసు! అంతకంటే ఆ చేదు పుటలను తొలగిస్తే మిగిలిన కొద్ది పుటలలోనూ ప్రేమ, అనురాగం, మానవత్వం, అనుబంధం అనే తీపి అనుభవాలతో నింపుకోవచ్చు! జీవితానికి నిర్వచనం రాసుకోవచ్చు!

★ ★ ★

"అమ్మా" అని ఆయా పదే పదే పిలవటంతో ఈ లోకంలోకి వచ్చింది చందన.

"డాక్టరమ్మ పిలుస్తోందమ్మా."

త్వరత్వరగా తయారై వెళ్ళింది చందన.

డాక్టర్ సువర్ణ చూపులు కొత్తగా అనిపించేయి. నఖశిఖ పర్యంతం పరీక్షగా చూస్తూ "ఇపుడే లేచారా?" అనడిగింది.

"అవును. ఏం?" అంది చందన ఆమె ముఖంలోకి చూస్తూ.

"రాత్రి పాపం నిద్ర లేదనుకుంటాను" వంకర నవ్వు.



విషయం అర్థం అయింది చందనకు.

"అసలు విషయానికి వస్తే..." కనుబొమలు ముడివేసి ముఖం చికాగ్గా పెట్టి అడిగింది. "కొత్త విషయాలు చెప్తే విందామని పిలిచాను" అందామె.

ఇన్నాళ్లూ తన ఉద్యోగాన్ని కాపాడుకోవాలన్న తాపత్రయంలో కొన్ని కొన్ని పట్టించుకొనేది కాదు.

"నీ పని నువ్వు చూస్కో, నా విషయంలో జోక్యం చేస్కోకు" తన గొంతు తనకే కొత్తగా వినిపించింది చందనకు.

"ఏమిటి నీ పొగరు? రమేష్‌బాబుగారితో నీ రాసలీలలు మాకు తెలియవనుకుంటున్నావా. జాగ్రత్త సుమా, ప్రమాదంలో పడిపోతావ్."

"షట్ యువర్ బ్లడీ మౌత్. ఎవరనుకుంటున్నావే నన్ను? నీలా డబ్బు కోసం గడ్డి కరిచే హీనురాలిననుకుంటున్నావా?" కోపంతో ఊగిపోయింది చందన.

హోమ్‌లో అందరూ చేరారు గొడవకు.

"షటప్ అండ్ గెట్ లాస్ట్" అరిచింది డాక్టర్ సువర్ణ.

టేబిల్‌మీద రెండు చేతులు ఆన్చి సువర్ణ ముఖంలో ముఖం పెట్టి తగ్గు స్వరంతోనే తీవ్రంగా చెప్పింది చందన.

"బి ఇన్ యువర్ లిమిట్స్. నేను నీ సబార్డినేట్‌నూ కాదు, నీలా డబ్బుకు అమ్ముడుపోయినదాన్నీ కాదు."

చకచక వెళ్ళిపోతున్న చందనను తెల్లబోయి చూస్తూ ఉండిపోయింది సువర్ణ. పిల్లిలా ఉండే చందన పులిలా గాండ్రించేసరికి, ఆ షాక్ నుంచి కోలుకోలేదామె.

★ ★ ★

హాస్పిటల్ నుంచి ఆలస్యంగా వచ్చిన కల్పన స్నానం చేసి వచ్చి టేబిల్‌ముందు కూర్చుంది. బంగారి వడ్డిస్తోంది.

"బంగారీ, అఖిల్ తిన్నాడా?"

"ఆ బాబు అదొ‌కలా ఉన్నాడమ్మా. ఏదో కొంచెం కతికేరమ్మా. అంతే."

భోజనం అయ్యేక అఖిల్ రూమ్ దగ్గరకెళ్ళింది కల్పన. తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి. నెమ్మదిగా శబ్దం కాకుండా తలుపు తెరిచి చూసింది. అఖిల్ మంచం మీద లేడు. సోఫా చేతిపై తలపెట్టుకొని పడుకొన్నాడు. కాళ్ళకు చోటుచాలక పక్కనున్న టీపాయ్ పైకి చాపుకున్నాడు.

నెమ్మదిగా లేపబోయిన కల్పన చెయ్యి వెనక్కు తీస్కుంది. అతడి గుండెపై చేతిలో ఉన్న ఫోటో కిందికి జారుతున్నట్టుంది. నెమ్మదిగా తీసి బెడ్ లాంప్ వెలుగులో పరీక్షగా చూసింది. చంద్ర, అఖిల్‌ల ఫోటో అది. పక్కనే ఫోటో ఆల్బమ్ ఉంది. ఫోటో అక్కడే ఉంచి నిట్టూర్చింది కల్పన. నెమ్మదిగా బయటకు వచ్చిన ఆమెకు చటుక్కున ఆరోజు డేట్ గుర్తొచ్చింది. చంద్ర పోయినరోజు! తనెలా మరిచిపోయింది? మథనపడింది ఆమె మనసు. గుర్తుంటే ఎలాగోలా ఎర్లీగా వచ్చేది. ఒంటరిగా ఎలా గడిపేడో అఖిల్!

నెమ్మదిగా వెళ్లి గదిలో లైటు వేసిన కల్పన ఉలికి పడింది. డబుల్‌కాట్‌కు అడ్డంగా పడి నిద్రపోతున్నాడు వర్మ. గదంతా విస్కీ వాసన.. వాంతి వచ్చినంత పనైంది కల్పనకు.

లైటార్పి బయటకు వచ్చేసింది కల్పన.

బంగారి దిగులుగా ఉన్న కల్పన ముఖంలోకి చూసి నెమ్మదిగా చెప్పింది.

"ఏడుగంటల కాడ నుంచి బాబుగారు తాగుతూనే ఉన్నారమ్మా."

"ఉన్నదేగా ఎప్పుడూ, భోజనం అయిందా?" విసుగ్గా అడిగింది.

"లేదమ్మా. దేనికోగాని ఆయన చానా బాధపడిపోతున్నాడమ్మా. ఏడవటం, ఆ ఏడుపులో ఇలా చేస్తావా, అలా చేస్తావా, మోసం చేశావ్ నన్ను... ఇంకా ఎన్నో మాటలూ, కేకలూనమ్మా. అలాగే నిద్దర

పోయారు."

"హూ!" నిట్టూర్చింది కల్పన.

"ఇక అఖిల్ బాబు అసలు గది బయటకే రాలేదు. అక్కడికే కంచంలో పెట్టిస్తే సరిగా తినలేదు" విచారంగా అంది బంగారి.

సోఫాలో వాలబోతున్న కల్పనకు చేయి పట్టి వారించింది ఆమె. "పగలంతా అలిసి అర్ధరాత్రి వచ్చేవ్. కాసేపైనా విశ్రాంతి లేకుండా ఎలా తల్లీ? రా చందనమ్మ గదిలో పడుకుందువు" బంగారి ముఖంలోకి చూసిన కల్పన కళ్ళలో నీళ్ళు మెరిశాయి. తమ కష్టసుఖాలు పట్టించుకునే బంగారి తమకు దేవుడిచ్చిన పెద్ద దిక్కు!

చందన మంచంపై పడుకుంది ఆమె. చందన ఆ ఇంట్లో వున్నది కొంతకాలమే అయినా, అందరి మనసుల్లో ఇల్లు కట్టుకు కూర్చుంది..నిద్రలోకి జారుకుందామె.

★ ★ ★

కాఫీ కొంచెం కొంచెం తాగుతూ పేపర్ చూస్తున్న కల్పన పక్కన కూర్చున్నాడు వర్మ. ముఖం పీక్కుపోయివుంది. 'రాత్రి ఎక్కువైనట్లుంది' అనుకుంది కల్పన.

బంగారి అందించిన కాఫీ కప్పు అందుకొని నెమ్మదిగా తాగసాగాడతడు.

అతడలా భార్య సరసన కూర్చొని ఎన్నాళ్లయిందో! ఆ మౌనానికీ, ఆ సీరియస్‌గా వున్న ముఖానికీ కారణం ఏమైవుంటుందో అనుకుంది.

లేచి స్నానానికి బయల్దేరబోతున్న కల్పనను పిలవబోయి ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు అతడు.

అతడి కదలికలను గమనిస్తున్న కల్పనకు, అతడు తనతో ఏదో చెప్పటానికి సంశయిస్తున్నాడనిపించింది.

టిఫిన్ కోసం కూర్చున్న కల్పన కుర్చీ వెనుక నిలబడ్డాడు మేజర్ వర్మ.

నెమ్మదిగా "కల్పనా" అని పిలిచేడు ఆమె భుజంపై చెయ్యివేసి.

## కొత్తగాలి...

**ఇంద్ర లోకంలో**
**దేవేంద్రుని కొత్త పథకం**
**రూపాయికే స్వర్గవాసులకి**
**కిలో కందిపప్పు!!**

—లలితాప్రభాకర్,
మదీనాగూడ, హైదరాబాద్

సున్నితంగా ఆ చేతిని తొలగిస్తూ 'ఏమిట'న్నట్లు చూసింది.

తప్పు చేసిన పిల్లాడు తల్లికా విషయం ఎలా చెప్పాలా అని మథన పడుతున్నట్టు చూశాడు కల్పన కళ్ళలోకి.

అతడి కళ్ళలో సన్నటి నీటిపొర! ఆశ్చర్యంగా చూసింది కల్పన. అతడి ప్రవర్తనతో ఏళ్ళ తరబడి పరాయి వ్యక్తిగా మిగిలిపోయిన ఆమె మనసు స్పందించలేదు. తలవంచుకుని ఖాళీ ప్లేట్లో వేలితో గీతలు గీస్తూ కూర్చుంది.

"ప్లీజ్ కల్పనా... ప్లీజ్, నాతో మాట్లాడు. ఒక్కసారి మాట్లాడు" అంటూ కుర్చీ వెనుక నుంచి ఆమె మెడ చుట్టూ చేతులు వేసి, ఆమె తలపై తల ఆన్చి చంటిపిల్లాడిలా విలపిస్తున్న వర్మను చూసి నివ్వెరపోయిన బంగారి వంటింట్లోకి తప్పుకొంది. అతడి వైఖరి చూస్తుంటే ఏదో జరగరానిదే జరిగిందనిపించింది ఆమెకు.

అతడి చేతులు విడిపించుకొని లేచింది కల్పన. ఆమె చేయి పట్టుకు విడిచి పెట్టకుండా వెంటపడ్డాడు వర్మ.

తల చేత్తో పట్టుకుని సోఫాలో కూలబడింది ఆమె. "భగవంతుడా!" అనుకొంటూ. ఆమె మనసు అవ్యక్తమైన అవస్థకు లోనైంది. అతడిని ఓదార్చటానికి మనసు సహకరించటంలేదు!

తటాలున ఆమె పాదాల దగ్గర కూలబడి, ఆమె ఒళ్ళో తలపెట్టుకొని, "ప్లీజ్







కల్పనా... నువ్వు మాట్లాడకుంటే.. నా గుండె పగిలిపోతుంది..." అంటూ వెక్కి వెక్కి ఏడుస్తున్న వర్మను చూస్తుంటే గాభ రాగా వుంది కల్పనకు.

కళ్ళలో నిండి వచ్చిన నీళ్ళను కొంగుతో ఒత్తుకుంటూ వుండిపోయింది.

భుజంపై చెయ్యి పడటంతో వెనుతిరిగి చూసింది కల్పన. బంగారి కళ్ళలో నీళ్ళతో! ఆమె కళ్ళే మాట్లాడుతున్నాయి, 'అతడిని క్షమించ'మని.

గట్టిగా కళ్ళు మూస్కుంది కల్పన. ఆమె గాయపడిన మనసు, అట్టడుగు పొరలలో కప్పబడిపోయిన 'క్షమ'ను కష్టపడి తవ్వి పైకి తెచ్చింది. ఆమె గుండె లయ తప్పింది! పైకి ఎత్తిన చేయి వణికింది. నెమ్మదిగా కంపిస్తున్న చేతితో అతడి తల నిమిరింది ఆమె.

ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూసిన వర్మ బావురుమంటూ ఆమెను చుట్టేశాడు.

"నీకు అన్యాయం చేశాను.. నన్ను క్షమించకు. నన్ను శిక్షించు.. నువ్వు దేవ తవి.." అన్న మాటలే మళ్ళీ మళ్ళీ అంటు న్నాడతడు దుఃఖిస్తూ.

అటుగా పేపర్ కోసం వచ్చిన అఖిల్, హాలులో దృశ్యం చూసీ, అంతకంటే వర్మ నోట వచ్చిన మాటలు వినీ 'కలకాదు కదా? ' అనుకున్నాడు.

బావలో కలిగిన మార్పుకు కారణం ఆ సాయంకాలానికి తెలిసింది అఖిల్‌కు.

సదరు టీవీ ఆర్టిస్ట్‌కు వర్మగారిపై మోజు తగ్గిపోయింది. ఒక జూనియర్ క్రికెటర్‌తో దోస్తీ ప్రారంభించింది. తనకేదో ఆమెపై హక్కు వుందనుకొని హడావుడి చేయబో యిన వర్మకు సరైన గుణపాఠం నేర్పించిం దామె. దానితో పోయిన పూర్వస్మృతి తిరి గొచ్చి భార్యా, ఇల్లూ గుర్తు వచ్చాయి మేజ ర్‌గార్కి!

బంగారి, అఖిల్, చందన, మానస- అందరి హితవు... సారాంశం... ఒకటే కావటంతో, కల్పన అంతరాత్మ మూగబో యింది!

భారతదేశంలో మరో మహిళ రాజీపడి జీవించటానికి నిర్ణయించుకొంది! వర్మకు క్షమాభిక్ష దొరికి, ఆమె గుండెలో ఒదిగి పోయే అవకాశం ఏర్పడింది!!




ఆ రోజు తరుణ్ కోసం అఖిల్ రాలేదు. వీధి చివరికి వచ్చే స్కూల్ బస్ ఎక్కించింది చందన. తరుణ్‌ను "సాయం కాలం కూడా కాస్త బస్‌లో తీస్కురా బాబూ" అని డ్రైవర్‌కు చెప్పింది ఆమె.

"కారు రిపేరమ్మా? " అనడిగాడతడు.

"ఊఁ..." అంది.

ఆమెను ఒకటే ఆలోచన తినేస్తోంది. హోమ్ నుంచి వెళ్ళిపోవాలి. కల్పన ఇంటికి వెళ్ళటానికి మాత్రం మనస్కరిం చటం లేదు.

హైద్రాబాద్ పుట్టి పెరిగిన వూరే అయినా జీవితంలో తిరిగి అక్కడకు వెళ్ళే ప్రసక్తే లేదు.

ఈ ప్రపంచం ఎంతో విశాలమైంది అను కుంటాం. ఒక్కోసారి అందులో మనిషికి అనువైన అరడుగు చోటు కూడా దొరకదు!

తను త్వరగా ఒక నిర్ణయానికి రావాలి. ఆ నిర్ణయం తరుణ్ భవిష్యత్‌కు విఘాతం కాకూడదు.

తిరిగి మరోసారి రమేష్ ముఖం

చూడటం ఇష్టంలేదు ఆమెకు.

తరుణ్‌కేం అపకారం తలపెడతాడో! ఆ తలపే వెన్నును వణికిస్తోంది!

రాత్రి కారు తీసుకు వస్తానంటే, తను రావటం కుదరదని కచ్చితంగా చెప్పినందుకు అఖిల్‌కు కోపం వచ్చి వుంటుందనుకుంది చందన. అందుకే తరుణ్‌ను స్కూలుకు తీస్కువెళ్ళటానికి రాలేదు.

కల్పన మాటలే చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. అఖిల్‌కు తనపట్ల, తరుణ్ పట్ల వున్నది కేవలం సానుభూతి, జాలీ.

దానికి వేరే నిర్వచనం చెప్పుకొని మరోసారి ఘోరంగా దెబ్బతిని బతక గలిగేశక్తి ఇక తనకు లేదు!

ఈ ఆలోచనలతో మనశ్శాంతి కరవై హోమ్‌లో పనులకు యాంత్రికంగా అటెండవుతోంది.

ఇంకెంత? ఈ హోమ్‌తో, పిల్లలతో కూడా రుణం తీరిపోతుంది కదా అనిపించింది ఆమెకు.

తరుణ్ స్కూల్ బస్ వచ్చే సమయం అయిందని వెళ్ళబోతున్న ఆమెకు, అఖిల్, తరుణ్‌ను డ్రాప్‌చేసి వెళ్లటం కనిపించింది.

తరుణ్‌కు ఈ వాతావరణం నచ్చటం లేదు. మమ్మీమీద అధికారం చేసే జయరాం అంటే అసలు ఇష్టం వుండదు అతడికి. అక్కడ్నుంచి వెళ్లిపోతే బాగుండు ననిపిస్తూ వుంటుంది మనసులో.

తలవంచుకు లోపలకు వచ్చేస్తున్న తరుణ్‌ను పిలిచాడు జయరాం.

"ఏయ్. ఇలారా" అంటూ.

"తరుణ్" తలెత్తి అన్నాడు, పేరుతో పిలవమన్నట్టు.

"ఒరేయ్ తరుణ్.. ఇలారా"

ఆ పిలుపు అసహ్యంగా తోచింది. అంకుల్‌గాని, మమ్మీగాని ఎవరూ అలా అనరు ఎప్పుడూ.

"ఇలా రా" ఆజ్ఞాపిస్తున్నట్లు అన్నాడు జయరాం. వెళ్ళి 'ఏంట'న్నట్లు చూసేడు.

## కవిత్వం అంటే..?

1983లో 'తొలకరి మెరుపులు' అన్న మినీ కవితా సంపుటి ముందుమాటలో ఇంద్రగంటి వారు 'భావకవితా యుగంలో గీత పద్య విస్తరం, అభ్యుదయపు తరంలో వచన గీతా ఉద్ధృతి, అ.ర.స. వి.ర.సాది విజృంభణంలో స్వచ్ఛంద రచనా సమృద్ధి- ఏవీ అసహజాలని పించలేదు నాకు. తత్కాలీనమైన భావోల్బణం, తనకు కావలసిన అంగీని తానే తొడుక్కుని బయటికి వస్తుంది. పేరు మారినా తల్లి వేరు మారదు. రెండు పంక్తులు రాసినా, ఇరవై పంక్తులు రాసినా గుండెకు తగిలితే చాలు- అది కవిత్వమే. లేకపోతే ఒట్టి మాటల పోగు" అన్నారు.



"ఆ కార్లో వచ్చే అంకుల్ ఎవరు? నీకేమౌతాడు? " అడిగేడు జయరాం.

అతడిపై ఏ కోశానా సదభిప్రాయం లేని తరుణ్ "ఏం? " అన్నాడు నిర్లక్ష్యంగా.

"వాడెవర్రా? "

"ఎవరూ? "

"నిన్ను కార్లో తీస్కొచ్చాడే, ఆడు"

అఖిల్‌ను అమర్యాదగా మాట్లాడటంతో ఉక్రోషం పొంగి వచ్చింది తరుణ్‌కు.

"నీకెందుకురా? " అని వెళ్ళిపోతున్న తరుణ్ చెయ్యి పట్టి ఆపాడు జయరాం.

"నీకెంత పొగరురా? మీ అమ్మకున్నంతా వుందిరా గీర" అంటూ కాలర్ పట్టి గుంజి ఆ చెంపా ఈ చెంపా వాయించేడు చేత్తో జయరాం.

బాధకు రెండు చేతులు చెంపల కానించుకొని "అమ్మా!" అని అరిచేడు.

"జాగ్రత్త.. దిక్కుమాలిన వెధవా. మరో



సారి ఎదిరించేవంటే చంపేస్తాను" అంటూ వెనుతిరిగి అపరకాళిలా ఎరుపెక్కిన కళ్ళతో ఉగ్రరూపంతో నిలబడిన చంద నను చూసి ఒక్కడుగు వెనక్కు వేశాడు చటుక్కున జయరాం.

"నా కొడుకును ఎందుకు కొట్టావు? "

ఉరిమిచూస్తున్న చందనను తప్పించుకు నిర్లక్ష్యంగా వెళ్ళిపోబోయాడు అతడు.

అతడి కాలర్ దొరక బుచ్చుకుంది గట్టిగా. "ఏమన్నావురా? దిక్కుమాలిన వెధవా? " అంటూ అతడి చెంపలు పదే పదే వాయించింది.

ఈ హఠాత్సంఘటనకు నోట మాట రాక నిలబడిపోయాడు జయరాం, తేరు కుని ఆమె చేతిలో చిక్కిన షర్ట్ వదిలించు కున్నాడు.

అందరూ చుట్టూ జేరి చూస్తున్నారన్న అవమానంతో "నన్నే కొడతావా? ఎంత ధైర్యమే నీకు? " రొప్పుతూ అన్నాడు.

"జాగ్రత్త! నా కొడుకు వైపు మళ్ళీ కన్నెత్తి చూస్తే చంపేస్తాను. వెళ్ళు, దిక్కున్నచోట చెప్పుకోరా" అంటూ ఏడు స్తున్న తరుణ్‌ను చెయ్యి పట్టుకు తీసుకుపో యింది చందన.

పాములా బుసలు కొట్టాడు జయరాం. ఆ వెనుకే రకరకాల గుసగుసలు.

★ ★ ★

కందిపోయిన తరుణ్ బుగ్గలకు ఆయిం ట్‌మెంట్ రాసింది చందన. ఆ రాత్రి అన్నం తినకుండా, నిద్రపోకుండా పేచీ మొదలుపెట్టాడు తరుణ్.

"నేనిక్కడ వుండను. అంకుల్ ఇంటికెళ్ళి పోదాం" అని ఏడుస్తున్న తరుణ్‌ను వూర డించి ఎలాగో నిద్రపుచ్చింది.

లేతబుగ్గలపై నల్లగా తేలినట్లున్న తట్లు చూస్తే దుఃఖం ఆగలేదు చందనకు. ఎప్ప టికో తెప్పరిల్లింది ఆమె మనసు.

ఎంత ఆలోచించినా భవిష్యత్తు ఒక పెద్ద ప్రశ్నార్థకంగానే నిలిచిపోతోంది.

టేబుల్‌పై వుంచిన కవర్ గుర్తొచ్చింది. నెమ్మదిగా లేచి కవర్‌లో పేపర్లు బయ టకు తీసింది. ఏవో స్టాంప్ పేపర్స్‌పై రాసిన డాక్యుమెంట్లు, ఉత్తరం వున్నాయి.

అన్నీ పక్కనపెట్టి, ఉత్తరం చేతిలోకి తీసుకుంది. అది అంకుల్ తనను ఉద్దేశించి రాసిందేకానీ, ఆ దస్తూరీ ఆయనది కాదు. ఎవరితోనో రాయించినట్టుంది. ఆత్రంగా చదవసాగింది చందన. చిరంజీవి సౌభా గ్యవతి చందనను దీవించి రాయునది-

"నీ క్షేమ సమాచారాలు నీ స్నేహితు రాలి ద్వారా తెలుస్తూనే వున్నాయి. ఆడపి ల్లవి, పడరాని అగచాట్లు పడుతున్నా, నిస్స హాయంగా చూడవలసిన దౌర్భాగ్యుడిని నేను. నన్ను క్షమించు తల్లీ.

నా ఆరోగ్యం ఈ ఉత్తరం రాయటానికీ సహకరించటంలేదు. ఎన్నాళ్ళు బతుకు తానో తెలియదు తల్లీ. ఒకసారి నిన్నూ, బాబునూ చూడాలని వుంది. అది తీరే కోరిక కాదని తెలుసు. కొడిగట్టబోతున్న ఈ దీపం గురించి బాధపడకు. నా చుట్టూ వున్నవాళ్ళు..."

ఉత్తరం చదవటం ఆపి "బాబాయి!" అంటూ బావురుమంది చందన. తన కంటూ మిగిలివున్న, తనను ప్రాణంగా ప్రేమించిన వ్యక్తిని కోల్పోబోతున్నందుకు పసిపిల్లలా వెక్కివెక్కి ఏడిచింది ఆమె.

కళ్ళు తుడుచుకుని, మళ్ళీ చదవటం ప్రారంభించింది ఉత్తరాన్ని.

"నా చుట్టూ వున్నవాళ్లంతా, నా భార్య తోసహా నా ఆస్తినే ప్రేమించారు. నువ్వు మాత్రం నన్నే ప్రేమించావు.

ఆఖరిరోజుల్లో వున్న నేను, నీకు కొన్ని విషయాలు చెప్పాలి. మీ తండ్రి, మా అన్నయ్య అయిన వెంకటాచలపతి ఉత్త ముడు. ఆయన ఔదార్యంవల్లే నేను డాక్ట రునయ్యేను.

అతడి రుణం కొంతైనా తీర్చుకోవాలనీ, నిన్ను నా కళ్లముందుంచుకు చూస్కోవాలనీ ఆశపడ్డాను. మీ పిన్ని రాక్షస ప్రవృత్తివల్ల నాతోపాటు నువ్వూ ఎన్నో బాధలు పడవలసి వచ్చింది.

గతం గుర్తు చేస్తున్నందుకు మరొకలా భావించకు తల్లీ. నువ్వు ప్రేమించిన, నిన్ను ప్రేమించిన రమేష్ నిన్ను సుఖపెడతాడని ఆశించేను. అతడి బుద్ధి వక్రమార్గం పట్టిపోయింది. ఒంటరి జీవితం గడుపుతున్న నీకూ, నీ బిడ్డకు ఒక ఆదర్శమూర్తి, ఉత్తముడూ అయిన మధు రక్షణ దొరుకుతుందని ఆశించి నిన్ను మళ్ళీ గోతిలో తోశాను. ఆ బాధే నన్ను ఈక్షణం వరకూ కుంగదీస్తోంది.

మధుతో నీ వివాహం జరిగిన కొంతకాలానికి పనిమీద బొంబాయి వెళ్ళిన నాకు రమేష్ కనిపించాడు. నా తల్లిని ఎందుకు దగా చేశావని నిలదీశాను. అనుకోని పరిస్థితుల్లో వేరేదారి తొక్కి, వేరే వివాహం కూడా చేస్కున్నానని చెప్పేడు. తను చాలా ఉచ్ఛదశలో పయనిస్తున్నానని, ఆ దారి వదిలి పాత భార్యను, కొడుకును వెతుక్కుంటూ వచ్చే ఉద్దేశం లేదనీ కచ్చితంగా చెప్పేడు. కావలిస్తే మీ ఇద్దరికీ బతకటానికి నెలకి ఇంతని పంపుతాను, అడ్రస్ ఇమ్మన్నాడు...

'దౌర్భాగ్యుడా, నా తల్లి నీ కోసం చూసింది కానీ, నీ భిక్షకోసం చూడలేదురా' అని చెప్పేను. వాడు నీ గురించి కాని, బాబు గురించి కాని అడగనే లేదు.

రమేష్ ఏమైపోయాడోనని చాలారోజులు బాధపడ్డావు. నీ మనసులో ఆ ఘాతకుడి పట్ల ఆ మాత్రం సానుభూతి కూడా మిగిలివుండకూడదని నీకు తెలియజేశాను అతడి నిజస్వరూపం."

చదవటం ఆపి కళ్ళు తుడుచుకుంది. ఇంతకాలం ఇంత బాధ మనసులో దాచుకున్నావా బాబాయ్ నా కోసం!

"మధుకు వివాహ సమయంలో లక్ష రూపాయలిచ్చేను. బ్యాంకులో వున్న ఐదు లక్షల కోసం నీతో సంతకం పెట్టించమని ఆఖరుకు నన్ను గాయపరిచాడు కూడా. మృగంలాంటి వాడివల్ల నీకూ, నీ బిడ్డకూ ఏ ప్రమాదం కలుగుతుందోనని భయపడే ఆ ఐదు లక్షలూ వాడి ముఖాన కొట్టావనీ తెలిసింది. నీకు చట్టరీత్యా వాడి బాధ వదిలిపోయినందుకు ఓ కంట సంతోషం, మరోకంట పచ్చగా సాగవలసిన సంసారం ఇలా అయిందని బాధ తొలిచేస్తున్నాయి.

మన చుట్టూ ప్రపంచం విషజంతువుల్లాంటి మనుషులతో నిండి వుంది. ఎవర్నీ నమ్మకు తల్లీ. అయినవాళ్ళూ ఆదుకోకున్నా, దేవతల్లాంటి స్నేహితులున్నారు. వాళ్ళే నీకు తోబుట్టువులు, హితులు!

ఇందులో కొన్ని ఆస్తుల తాలూకు దస్తావేజులు పంపిస్తున్నాను. అవి నీకు నీ తండ్రి నుంచి చెందవలసినవి. నీ పేర్న ఇంత ఆస్తి వుందంటే ఏ దుర్మార్గుడో భర్తగా వస్తాడని భయపడి, రహస్యంగా దాచి వుంచాను. ఆ ఆస్తులపై వచ్చిన ఆదాయం బ్యాంకుల్లో తరుణ్ పేర, నీ పేర జమచేశాను.

ఆ పత్రాలు కూడా పంపిస్తున్నాను. వీటితో నీకు, నీ బిడ్డకు ఏ లోటూ లేకుండా నడవాలని...." ఉత్తరం అక్కడితో అసంపూర్తిగా ఆగిపోయింది. కింద మాత్రం బాబాయి పేరు రాసి వుంది.

చివర్న ఇలా ఉంది. "ఈ ఉత్తరం పూర్తి కాకుండానే గోపాల్రావ్ స్వర్గస్తులయ్యేరు అందుకే అసంపూర్తిగా ఆగిపోయింది!

గోపాల్రావ్‌గారు ఇచ్చిన డాక్యుమెంట్స్, ఆయన నాతో రాయించిన వుత్తరం మీకు పంపిస్తున్నాను. నేను డాక్టరుగారి దగ్గరి కాంపౌండరు గోవిందునమ్మా"

చదవటం పూర్తిచేసిన చందన



"బాబాయ్!" అంటూ పెద్దగా రోదిస్తూ, ఆయనతో తన అనుబంధాన్నీ, గడచిన అనుభవాలను తలుచుకు తలుచుకు ఏడుస్తూనే వుంది. ఎప్పటికో తెల్లవారేముందు సోలిపోయి నిద్రపోయింది చందన.

★ ★ ★

టైమ్ తొమ్మిది గంటలు అవుతుండగా అఖిల్ కారు వచ్చి హోమ్ గేటు ఎదుట ఆగింది. తరుణ్ జాడ లేకపోయేసరికి హార్న్ కొట్టేడు. అప్పటికీ తరుణ్ రాకపోయేసరికి కారు స్టార్ట్ చేశాడు అతడు.

నిన్నటిలాగే ఇవేళ కూడ తను రాడేమోనని బస్‌మీద వెళ్ళిపోయి వుంటాడనుకొన్నాడు అఖిల్. అతడి కారు ముందుకు సాగిపోయింది! కారును అటు వెళ్ళిపోనిచ్చి, దూరంగా చెట్టు కింద ఆపిన ఆటోలో నుంచి ఒక వ్యక్తి దిగి బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు!

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ మార్జాలంలా హోమ్‌ను సమీపించాడు.

స్కూటర్ స్టాండువేసి వస్తున్న జయరాం అతడిని 'ఎవర'ని అడిగేడు.

ఉలిక్కిపడి వెనుతిరిగిన వ్యక్తి "మీరెవరు? " అనడిగేడు. "బయట నుంచి వచ్చిన వాడివి నువ్వు. నన్ను ప్రశ్నిస్తావేంటి? " చికాకుగా అన్నాడు జయరాం.

"నువ్వు బయటనుంచే వస్తున్నావుగా"

"తిక్కమనిషిలా వున్నావేంటి? అక్కడే వుండైతే" అంటూ గేటు తెరుచుకు లోపలకు వెళ్ళి గేటు మూసేశాడు. లోపలికి వెళ్ళిపోతున్న అతడిని "సార్, సార్" అని పిలిచేడతను కంగారుగా.

"ఏమిటీ? " విసుగ్గా అడిగేడు జయరాం.

"ఇక్కడ... ఇక్కడ చందన అని ఎవరైనా వున్నారా? " అడిగేడతడు. జయరాం అనుమానంగా చూసేడతడివైపు.

"ఎవరు నువ్వు? "

"నా ప్రశ్నకు, ప్రశ్న సమాధానమా? "

"వుంటే ఏంటి? "

"అది నా భార్య"

వెంటనే జయరాం గబగబ గేటు తీస్కు బయటకు వెళ్ళేడు.

"మరి మీరెక్కడుంటారు? "

తడబడ్డాడు మధు. "నా కంట్లో కారం కొట్టి ఇక్కడకు లేచొచ్చేసింది అది. హైద్రాబాద్ నుంచీ వెతుక్కుంటూ వచ్చేను"

"రండి. మాట్లాడుకుందాం" అంటూ స్కూటర్ స్టార్ట్ చేసేడు జయరాం.

ఆటోకి డబ్బులిచ్చి పంపేసి, స్కూటర్ ఎక్కేడు మధు. స్కూటర్ ఉడిపి రెస్టారెంట్ ముందు ఆగింది.

ఇద్దరూ మెట్లెక్కి పైకెళ్ళి ఒక మూల నున్న టేబుల్ దగ్గర కూర్చున్నారు.

"చపాతీ, పన్నీర్, మటన్ కర్రీ" ఇద్దరికీ ఆర్డరిచ్చాడు జయరాం.

అపుడు తాపీగా ఎదుటి వ్యక్తి వైపు చూసేడతడు.

"ఆవిడ ఇక్కడకొచ్చేసి ఎన్నాళ్ళైంది? "

సమాధానానికి తడుముకున్నాడు మధు.

"దగ్గర దగ్గర పది నెలలవుతోంది"

"మరి ఇంత ఆలస్యంగా వచ్చేవేం? "

"తెలిసిందిపుడే. వెంటనే వచ్చేను"

"అలాగా..."

"ఆడు నీ కొడుకేగా. తీస్కుపోతావా? "

ఎవరి గురించి అడుగుతున్నాడో అర్థమైందతడికి.

టిఫిన్ ప్లేట్లు వచ్చేయి.

ప్లేటు దగ్గరకు లాక్కుంటూ "వాడు నా కొడుకు కాదు. దాని కొడుకే"

"అంటే? " అర్థంకానట్టు ఆనందంగా అడిగేడు జయరాం.

చందన గురించి చాలా విషయాలు తెలుస్తున్నాయన్న సంబరం అతడికి.

"అంటే ముందువాడి కొడుకు"

"అంటే నువ్వు..." అర్ధోక్తిగా ఆపేశాడు జయరాం.

"మొగుడు కనపడకుండా పోయాడు. దిక్కులేదని దాని చిన్నాన్న బతిమాలితే తాళి కట్టేను. రెండోవాడిని."

నిర్లజ్జగా మాట్లాడుతున్న మధును పరిశీలనగా చూస్తున్నాడు జయరాం. కాసేపు తిండిమీద కాన్‌సెంట్రేట్ చేశారు ఇద్దరూ.

కాఫీ తాగుతుంటే జయరాం మెదడు చురుకుగా పనిచేసింది.

'వీడిని కరెక్ట్‌గా వాడుకుంటే దాని భరతం పట్టొచ్చు. చందనా, నన్ను కొడతావా, నీ చాప్టర్ క్లోజ్ చేస్తానే' కసిగా అనుకున్నాడు.

"అవునూ, మరి సుమో కార్లో వస్తాడు. దానితో కలిసి తిరుగుతాడు. వాడెవరు?" అడిగేడు జయరాం.

వెకిలిగా నవ్వేడు మధు, "వద్దు అడగబోకు, దానికి సరైన భాషలో చెప్పానంటే నువ్వు పడిపోతావ్. అవునుగాని ఆడు రోజూ తీస్కొస్తాడా దాన్ని?"

"లేదు. ప్రస్తుతం ఇక్కడే వుంటోంది. అంతకుముందు తీస్కొచ్చేవాడు. ఆ కుర్రెదవని స్కూలుకి ఇంటికీ మోస్తాడు. ఇక ఇద్దరూ సినిమాలు, షికార్లూ!"

"ఆడిని చూసే నన్ను అన్యాయం చేసి వచ్చేసింది" దిగులుగా చెప్పేడు.

"అబ్బో. అదో పెద్ద చింతామణిలా వుంది. సిగ్గూ ఎగ్గూ ఏం లేవు. అపుడే మా పెద్దాయనతో గ్రంథం నడిపిస్తోంది. ఆయన అర్ధరాత్రిళ్లు రహస్యంగా ఈవిడ గదికి రాకపోకలు సాగిస్తున్నాడు."

"ఇంక నాకెక్కడ దక్కుద్ది నా పెళ్లాం!"

"పెళ్లాం, పెళ్లాం అంటే నవ్వుతారు. ఎక్కడా చెప్పకు."

"నిజమే!"

"నడత మార్చుకో, మా హోమ్‌లో స్టాఫ్, పిల్లలూ పాడైపోతారు అని చెప్పేనని నన్ను ఎడాపెడా వాయించింది. పొగరు!"

"ఆ పొగరు సంగతి నాకు తెలుసు. నీకేం తెలుసు? ఎన్ని అవమానాలో

## కథానికల్ని రాసే విధం..?

ఒకనాటి సాయంకాలం కావలిలో ఇంద్రగంటివారి ఆంతరంగిక శిష్యులు కీ.శే. డా. ధూర్జటి వెంకట బాలాజీగారు - 'అసలు కథానికల్ని రాయడానికి ఒక విధానం అంటూ ఏమైనా ఉందా?' అని ఆయన్ను ప్రశ్నించారు. అప్పుడు ఇంద్రగంటి వారు ఉత్సాహంతో 'క్రికెట్టు ఆటగాడు వచ్చే ఒడుపును బట్టి బంతిని కొడతాడు. ఇలాగే కొట్టాలని రూలేమీ లేదు. అలాగే కథానికల్ని ఇలాగే రాయాలి అనే ఒక నిర్దిష్టమైన విధానం అంటూ ఏమీ లేదు. తీసుకున్న ఇతివృత్తాన్ని బట్టి తదనుకూలంగా రచనా శిల్పం ఉంటుంది. అలా ఉండేలా రచయితలు కథానికా రచనల్ని చేయాలి' అన్నారు.



పడ్డాను దాని చేతిలో"

"ఆ కుర్రెదవకెంత పొగరు? అరేయ్, ఒరేయ్ అన్నాడు" పళ్లు కొరికేడు జయరాం.

"నన్ను చంపేస్తానన్నాడు."

"ఆ పనేదో మనమే చేస్తే పోలా"

"వద్దులే" చటుక్కున అన్నాడు మధు.

"కొడుకు కాదంటావ్. ఆడిమీద ప్రేమా నీకు?" హేళనగా అన్నాడు జయరాం.

"విడాకులకి కోర్టుకెక్కినపుడు చెప్పింది. తన కొడుకంటే నాకు కక్షనీ, ఆదనీ ఇదనీను. ఇపుడు అలాంటిదేదైనా చేస్తే లోపలకు పోతాను, ఏదో కొత్తపెళ్లాంతో వచ్చేను. దాన్ని కాస్త ఏడిపించాలని అంతే. మర్డర్లు వద్దు మనకు, బతికుండే రోజూ మర్డరయిపోతూ వుండాలి అది. అంతే కావాలి" వెకిలిగా నవ్వుతున్న



మధును అంచనా వెయ్యటానికి ప్రయత్ని స్తున్నాడు జయరాం.

బిల్లు చెల్లించి బయటపడ్డారు.

"అవునూ ఇందాక చందన నా పెళ్లాం అన్నావేంటి? విడాకులిచ్చేవు. మళ్లీ పెళ్లా డేవు. ఇంకేం పెళ్లాం? నీకు దాని అవ సరం లేదు. మటాష్ చేసేద్దాం" మధు కళ్ల లోకి చూస్తూ అన్నాడు జయరాం.

అతడి ముఖంలోకి చూసి తలొంచుకు న్నాడు మధు. "నాది మర్డర్ల లెవెల్ కాదు. అనవసరంగా ఇరుక్కుంటాం. దాన్ని సాధించాలి అంతే..." మధు కళ్లలో ఎర్రజీర తొంగి చూసింది.

"సరే పద" అంటే "పద" అనుకుంటూ దుష్టశక్తులు రెండూ చెయ్యి కలిపేయి.

★ ★ ★

ఆలస్యంగా లేచిన చందనకు పక్కనే వున్న దస్తావేజు పేపర్లు కనిపించేయి. అప్రయత్నంగా వాటిని తీసి పరిశీలనగా చూసింది. ఒకటొకటీ చదివింది శ్రద్ధగా. ఊరు దగ్గర వున్న ఇల్లూ, ఐదు ఎకరాల కొబ్బరితోటకు సంబంధించిన పత్రాలు.

బ్యాంకులో ఎఫ్.డి. అయిదు లక్షలుగా పెరిగింది. దానికి సంబంధించిన పత్రాలు.

కొబ్బరితోట మీద వచ్చిన ఆదాయం ఇన్నేళ్ళనుంచి మూడు నాలుగు లక్షల పైనే వుంది.

కృతజ్ఞతతో చందన కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగాయి. నెమ్మదిగా లేచి ఆ పేపర్లూ, ఉత్తరం పెట్టెలో భద్రపరిచింది.

'ఇక తనకూ, తరుణ్‌కూ డబ్బులకు తడు ముకోవలసిన అవసరం లేదుకదా. ఇక తను ఈ హీనుల దగ్గర ఉద్యోగం చేయన వసరం లేదు. తరుణ్‌ను చదివించుకో వచ్చు' ఆమె మనసు దూదిపింజలా ఎగి రిపోతుంది.

ఇక దేనికీ అఖిల్‌పై ఆధారపడనక్క ర్లేదు. స్వతంత్రంగా బతకగలదు. ఎవరో ఏదో చేస్తారని ఎదురు చూడక్కర్లేదు.

ఇక తర్వాత స్టెప్ ఏమిటన్నది ఆలోచిం చుకోవాలి. అఖిల్ ప్రమేయం లేకుండా తనే ఏదైనా ఇల్లు చూస్కొని, ముందిక్కడ నుంచి వెళ్లిపోవాలి.

సాగిపోతున్న ఆలోచనలకు అడ్డుకట్టలా మనసులో ఒక చిన్న ప్రశ్న తలెత్తింది.

'ఇన్నాళ్ళనుంచి అఖిల్ పరిచయం, కేవలం తనకు ఆర్థిక స్వతంత్రం లేక ఉప యోగించుకుంటుందా? '

'ఛీ.. కాదు. అతడ్నికై అతడందించిన చేయూతను తిరస్కరించలేదంతే. అది తన పరిస్థితికి తప్పనిసరైంది అంతే. మరే సంకుచిత భావం లేదు తనకు.'

మనసును సమాధానపరచింది.

కల్పన చెప్పిన సంగతులు గుర్తొచ్చాయి. 'అతడు తరుణ్‌తో అనుబంధం పెంచుకుం టున్నాడు కనుక ఇపుడు కావాలి అనుకుం టున్నాడు. రేపు ఇతడు మరో మధు కాడని గ్యారంటీ ఏమిటి? '

అయినా తనకెవరూ వద్దు. తరుణ్ మంచి చదువులు చదివితే చాలు!

"మమ్మీ!" అంటూ కదిలాడు తరుణ్. చందన చేతిని రెండు చేతుల్లో తీస్కుని ముడుచుకుపడుకున్నాడు.

"మమ్మీ!"

"ఏమిటమ్మా" తరుణ్ బుగ్గపై చారలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. చెంపపై నెమ్మ దిగా నిమురుతూ అడిగింది.

"ఈరోజు నేను స్కూలుకు వెళ్ళలేను"

"అలాగే. పడుకో కాసేపు" అని దినచ ర్యకు ఉపక్రమించబోయిన ఆమెకు జయరాం గుర్తుకువచ్చేడు. అతడేం గొడవ పెడ్తాడోనని బెరుకుగా వుంది ఓ పక్కన.

ఇక ఇక్కడ్నుంచి కదిలిపోవాలన్న ఆలో చనతోపాటు, ఎక్కడ వుండాలన్న ఆందో ళన మరోపక్క.

అంకుల్ చేసిన ఏర్పాట్లవల్ల తరుణ్‌కు

ఏ లోటు లేకుండా వుండొచ్చు కాని తమకు ఓ స్థిరమైన నివాసం, భద్రత ఇవన్నీ ఏర్పరుచుకోవాలి నెమ్మదిగా. చక చక పని ముగించి తరుణ్‌ను లేపింది.

"బాబూ తొందరగా తయారవ్వు. బయటకు వెళ్దాం"

"ఎక్కడకు మమ్మీ? అంకులింటికా? " ఆశగా అడిగేడు తరుణ్.

చికాకు కలిగింది చందనకు.

"ఇంక వేరే ఎక్కడకీ వెళ్లమా!"

అమ్మకంత కోపం ఎందుకు వచ్చిందో అర్థం కాలేదు తరుణ్‌కు. మాట్లాడకుండా తయారయ్యాడు.

హ్యాండ్ బాగ్ తీస్కొని "పద" అంది.

ఇద్దరూ బయటకు వచ్చేరు, రూమ్ లాక్ చేసి కీ బ్యాగ్‌లో వేస్కుంది. ఆయాను పిలిచి "పనిమీద బయటకు వెళ్తున్నాను. రావటానికి ఆలస్యం అవుతుంది. పిల్లలు జాగ్రత్త" అని చెప్పింది. మౌనంగా తల్లిని అనుసరించేడు తరుణ్. కొంచెం దూరం నడిచాక ఆటో దొరికింది. ఎక్కారు. "రామకృష్ణాపురం ఛలో" అని చెప్పింది.

తరుణ్‌కు గుర్తొచ్చింది. మొదటిసారిగా తనూ, మమ్మీ ఢిల్లీ వచ్చినపుడు, అఖిల్ అంకుల్ స్టేషన్ నుంచి వచ్చేటపుడు చూపించి చెప్పేడు. 'ఐతే రామకృష్ణా పురం. ఇక్కడంతా చాలావరకు మన తెలుగువాళ్లే ఉంటారు. డీసెంట్ ఏరియా!'

"మమ్మీ, అక్కడ నీ ఫ్రెండ్ ఎవరైనా ఉన్నారా? " అడిగేడు.

అతడివైపు ఒకసారి చూసి తల తిప్పుకుంది. దానితో ఇక మాట్లాడకుండా కూర్చున్నాడు తరుణ్. ఆటో దిగి డబ్బులిచ్చి పంపించేసింది చందన. చుట్టూ పరిసరాలను పరిశీలనగా చూసేడు తరుణ్.

'అంతా గ్రీన్ గ్రీన్' అనుకున్నాడు. ఎటు చూసినా పచ్చని చెట్లతో, పార్కులతో కళ్ళకు హాయిగా ఉంది. సమీపంగా ఉన్న ఇంటి దగ్గరకు నడిచింది ఆమె. ఆరుబయట పూల మొక్కల మధ్య కుర్చీలు వేస్కుని కూర్చున్నారు ఒక ముసలి ఆవిడా, ఒక పాతిక ముప్పై ఏళ్ళ స్త్రీ.

చందనను చూస్తూనే ఆమె గేటు దగ్గరకు వచ్చింది.

"ఇల్లు అద్దెకు దొరుకుతుందా? " హిందీలో అడిగింది.

లేదంది ఆమె.

"మమ్మీ, ఇల్లు మనకేనా? "

"అవును"

"అయితే ఎవరూ లేకుండా మనిద్దరమేనా ఉండాలి? "

చురుకుగా చూసింది "ఏం? " అంటూ.

"మరి ఇది మా స్కూలుకు బోలెడంత దూరం కదా, ఎలా వెళ్ళాలి? "

"బస్!" అంది ముక్తసరిగా. అలా ఓపికగా తిరిగిందామె ఇల్లు వెదుకుతూ.

ఆటోడ్రైవర్ చెప్పేడు. ఇంకాస్త ముందుకుపోతే 'మునీర్ కా గావ్' అని ఒక లొకాలిటీ ఉందనీ, అక్కడ చిన్న, పెద్ద పోర్షన్స్ కాస్త చౌకగా దొరకవచ్చనీ.

అది మెయిన్‌రోడ్‌ను ఆనుకొని ఉన్న సన్నటి సందులతో ఉన్న కాలనీ. కొన్నిచోట్లకు ఆటోయే వెళ్ళదు. బిల్డింగులు మాత్రం బ్రహ్మాండంగా కట్టేసేరు.

అక్కడ కూడా కొందరు తెలుగువాళ్ళు తగిలేరు. ఇక్కడా, అక్కడా అంటే ఓపికగా తిరిగింది చందన.

ఆఖరుకు ఒక పెద్ద దివాణంలాంటి ఇల్లది. మధ్య పోర్షన్ ఖాళీగా ఉంది. అదో పెద్ద బిల్డింగ్‌లో కింది భాగం. ఓనర్ పైన ఉంటాడు. కింది మూడు పోర్షన్‌లలో మధ్యన ఉంది. సెక్యూరిటీ ఉంటుందనిపించింది. ముందు అక్కడ్నుంచి వచ్చేస్తే తర్వాత విషయాలు తర్వాత అనుకుంది ఆమె.

హ్యాండ్‌బ్యాగ్ తీసి అడ్వాన్స్ ఇవ్వబో







తున్న చందన చెయ్యిపట్టి ఆపేడు తరుణ్.

"మమ్మీ ఇక్కడ మంచిగా లేదు నాకు. ఈ ఇల్లు వద్దు" అన్నాడు స్థిరంగా.

"ఆ హోమ్‌లో కంటే బాగా లేదూ?"

"అంకుల్ ఇల్లైతేనే బాగుంటుంది"

"తరుణ్ నన్ను బాధించకమ్మా. ముందు ఆ హోమ్‌లోనుంచి బయటపడాలి. తర్వాత మంచి ఇల్లు తీస్కుందాం. ఏమ్మా?" అంటూ తరుణ్‌ను ఒప్పించింది.

"సరే!" అన్నాడు కానీ అతడికి సుతరామూ ఇష్టం లేదు.

అడ్వాన్స్ ఇచ్చేసి, సాయంకాలమే వచ్చేస్తాం అని చెప్పింది చందన.

ఏదో ఓ చోటు ఆ మహానగరంలో ఉండటానికి దొరికినందుకు ఆనందంగా ఉంది చందనకు. తిరుగుముఖం పట్టేరు ఇద్దరూ.

★ ★ ★

"ఏమిటక్కా?" అన్నాడు అఖిల్.

"తరుణ్‌ను స్కూలుకు తీస్కెళ్ళేవా?"

"లేదు, నాకు తరుణ్ కనిపించలేదు"

"చందన కలిసిందా? ఎలా ఉంది?"

"అసలు హార్న్ విని తరుణే రాలేదు. బస్‌పై వెళ్లేడేమోనని వెళ్లిపోయా"

"అంటే కనీసం కారు దిగి లోపలకే వెళ్లలేదన్నమాట" "నిష్ఠూరంగా అంది కల్పన.

"నీకెలా చెప్పను నేను. నేను పదే పదే కలుసుకోవటం ఆమెకు ఇష్టం లేదు. అటువంటప్పుడు ఎలా అక్కా నన్ను పాకులాడమంటావ్?" బాధగా అన్నాడు అఖిల్.

"నీ వైపు నుంచి ఆలోచిస్తే అదీ కరెక్టే... కాని అఖిల్ ఒక్కసారి తరుణ్‌ను డ్రాప్ చేసినపుడు చందనను చూసిరా. జస్ట్ సే హలో. నా కోసం."

"అలాగే" అన్నాడు అయిష్టంగా.

"డాక్టర్ ఆ సిజేరియన్ కేస్ ఆవిడకు కడుపులో సివియర్ పెయిన్ వస్తుందిట" అంటూ సిస్టర్ వచ్చింది.

"బై అఖిల్" ఫోన్ పెట్టేసింది కల్పన.

★ ★ ★

చందన హోమ్‌కు చేరుకొనేసరికి మూడున్నర అయింది. ఆటో దిగుతున్న తమను అందరూ వింతగా చూడటం గమనించింది చందన.

ఆటోను పంపించేసి నెమ్మదిగా లోపలకు వెళ్లిపోతున్న చందనకు వాతావరణంలో ఏదో తేడా అనిపించింది.

గేటు బయటనుంచి "మమ్మీ!" అంటూ వగుర్చుకుంటూ పరుగున వచ్చేడు తరుణ్.

పైనున్న సూట్‌కేసులు దించుతున్న చందన తరుణ్ ముఖంలో గాభరాకు, కారణం ఊహించలేకపోయింది.

"ఏమిటమ్మా?" ఆత్రంగా అడిగింది.

"మరే.. ఆ అంకుల్ కనిపించేడు"

అయోమయంగా చూసింది చందన.

"ఏ అంకుల్ నాన్నా?"

"హైదరాబాద్ అంకుల్" భయాన్ని వ్యక్తం చేస్తూ తరుణ్ చెప్తుంటే చందన మతిపోయినట్టు చూసింది.

"సరిగ్గా చూసేవా? ఎవర్ని చూసేవో?"

"లేదు మమ్మీ, నేను బాగా చూసేను. నన్ను చూసి చెట్టుచాటున దాక్కున్నాడు"

సర్దుదాం అనుకుంటున్న సూట్‌కేసులను నీరసంగా కింద పెట్టేసింది.

గేటువైపు వెళ్లపోయిన చందనకు ఆయా అడ్డం వచ్చింది.

"అమ్మా" అంటూ.

ఆమె ముఖం దైన్యంగా ఉండటం గమనించిన చందన "ఏమైంది?" అంది.

తలవాల్చింది ముసలి ఆయా.

"ఏమైందమ్మా?" విసుగ్గా అడిగింది.

ఆయా కంగారుగా చుట్టూ చూసి, ఎవరూలేరని నిర్ధారించుకొని హోమ్ వెనుక ఉన్న పూలతోట వైపుకు చెయ్యిపట్టుకు తీస్కుపోయింది చందనను.

"ఘోరం జరిగిపోయిందమ్మా" ఆమె కళ్ల



నిండా నీళ్లు.

"ఏమిటి ఏం జరిగింది? " కీడును శంకి స్తోంది ఆమె మనసు.

"నువ్వెళ్ళేక పిల్లలకు పాలు పట్టేం!"

"పడితే? "

"ఆ కవల పిల్లలూ, మరో పిల్లోడు గిల గిలా కొట్టుకు చనిపోయేరమ్మా"

"ఆc" చందన నోరు మూత పడలేదు.

"నో!" అని అరిచింది దుఃఖిస్తూ.

అటువైపు పరుగు తీయబోయిన చంద నను పట్టి ఆపింది ఆమె.

"ఆ జయరాముడు ఈ పని నువ్వే చేసే వనీ, పాలలో విషం కలిపేవంటున్నాడు"

మతిపోయినట్టు చూసింది చందన.

ఏం జరుగుతుందో ఆమెకు ఏం అర్థం అయ్యేస్థితిలో లేదు ఆమె మెదడు.

రూమ్‌లోకెళ్లి కుర్చీలో కూలబడింది.

'ఇదీ.. కేవలం తన మీద కక్ష తీర్చుకో వడం కోసం చేసిన పని.'

"అందుకోసం పసిపాపల ప్రాణాలు తీస్తారా? వీళ్లు మనుషులా? రాక్షసులా? అయ్యయ్యో..." అంటూ దుఃఖిస్తున్న తల్లిని బిత్తరపోయి చూశాడు తరుణ్.

"బాబూ... బాబూ..." కంగారుగా తరు ణ్‌ను దగ్గరకు తీస్కుంది చందన.

"ఇక్కడ ఎవరేం ఇచ్చినా తినకు... తాగకు" అంటూ రోదిస్తున్న చందనకు కర్తవ్యం ఏమిటన్న ఆలోచన వచ్చింది.

"బాబూ. ఎటూ వెళ్లకు" అని చెప్పి పిల్లల ఉయ్యాలలున్న గదిలోకి వెళ్లింది.

అక్కడి దృశ్యం చూసి విలపిస్తున్న చందనను చూసి కొందరు బాధపడ్డారు. మరికొందరు చెవులు కొరుక్కున్నారు.

పసివాళ్ల శరీరాలు నీలంగా మారి ఉన్నాయి. నిన్నటివరకూ "ఆ", "ఊ" అంటూన్న పిల్లలు నిర్జీవంగా పడున్నారు.

"నాపై కక్షకు పసికందుల్ని బలి చేశారే... అనుకుంటూ విలపిస్తున్న చందన ఉలిక్కిపడి చూసింది.

"చాల్లే నటన. చేసిందంతా చేసి ఏడుస్తు న్నావా? " డాక్టర్ సువర్ణ ద్వేషం అంతా కళ్లలో కనబరుస్తూ అంది.

"సువర్ణా, ఒళ్ళు తెలుసుకు మాట్లాడు."

"ఏంటే నీ ప్లాన్ మాకు తెలియదనా? పాలలో చల్లగా విషం కలిపేసి, ఏమీ ఎర గనట్టు ఎక్కడికో వెళ్లిపోయి వచ్చేవ్."

మతిపోయినట్లు చూసింది. అక్కడి అందరి ముఖాలలోకి చూస్తున్న చందనకు కొందరి ముఖాల్లో తనపట్ల సానుభూతి ప్రకటితమవుతోందని గ్రహించింది.

"ఇవేళ పాలు ఎవరు కలిపారు? " అంద రివైపు చూస్తూ అడిగింది.

"ఆదెమ్మ కలిపిందమ్మా" ఒక ఆయా చెప్పింది.

ఆదెమ్మ ద్వారానే విషయం తెలిసింది చందనకు.

"అపుడు ఇంకెవరున్నారు ఇక్కడ? "

ఏమో చెప్పబోతున్న ఆదెమ్మనే భుజం పట్టి వెనక్కు లాగేడు జయరాం.

"ఏంటే నువ్వు చెప్పేదీ, అది అడిగే దీను. పోలీసులు వస్తున్నారు. అపుడు చెప్పు ఈ కథలు"

వెటకారంగా అంటున్న జయరాం వెనుక కిసుక్కున నవ్వింది సువర్ణ.

"మీకు నాపై కోపం వుంటే వేరేగా తీర్చు కోలేకపోయారా? దుర్మార్గులారా, పసివా ళ్ళని బలి చేస్తారా? మీరు మనుషులా, రాక్షసులా? " ఉక్రోషంగా అరుస్తున్న చంద నను గేలిచేస్తూ నవ్వుతోంది సువర్ణ.

"నువ్వసలు ఆడదానివేనా? ఛీ!" అంటూ వెనుతిరిగి బయటకు వెళ్ళబోయిన చందనకు అడ్డంగా నిలబడ్డాడు జయరాం.

"పోలీసులు వచ్చేలోగా పారిపోదాం అనుకుంటున్నావా? కుదరదు."

"ఏయ్, అడ్డులే నీచుడా..." అతడిని ఒక్కతోపు తోసి హాలులో వున్న ఫోను

దగ్గరకు వెళ్ళింది చందన.

డయల్ చేస్తుండగా ఆమె చేతిలో రిసీవర్ లాక్కుని పెట్టేశాడు జయరాం.

"ఇది నీ బాబుగారి ఫోననుకున్నావా? "

నిస్సహాయంగా చూసి నెమ్మదిగా తన గదిలోకి వెళ్ళిపోయింది చందన.

"ఏయ్ వాచ్‌మెన్, ఈ మేడమ్‌ను బయటకు వెళ్లనీయకు, జాగ్రత్త!"

వెనుక నుంచి వాచ్‌మెన్‌కి చేసిన హెచ్చరిక వినిపించింది ఆమెకు.

మంచంమీద వాలిపోయిందామె. లోకం గిర్రున తిరుగుతున్నట్లుంది. కాళ్ళు తేలిపోతున్నాయి. ఎంతలో ఎంత కుట్ర.

ఇపుడేం చెయ్యాలి? ఏం చెయ్యాలి? ఏం తోచక చేత్తో మంచంపై కొడుతున్న తల్లిని వింతగా చూశాడు తరుణ్.

"మమ్మీ" అంటూ వచ్చిన తరుణ్‌కు మంచి నీళ్ళిమ్మని సైగ చేసింది చందన.

గ్లాసుతో నీళ్ళిచ్చి బిక్కముఖంతో-

"హైద్రాబాద్ అంకుల్‌కి మనం ఇక్కడున్నట్లు తెలుసా? " అడిగాడు తరుణ్.

నీరసంగా లేచి కూర్చుంది చందన.

"బాబూ..." అని పిలిచి, "ఏం లేదు" అంది మళ్ళీ.

ఈ విషమ పరిస్థితి తను ఎలా ఎదుర్కోగలదు? మధు కూడా కుట్రలో పాత్రధారేనా? మరి ఇక్కడెందుకున్నాడు?

రకరకాల ప్రశ్నలతో ఆమె మానసిక స్థితి ఆమెకే అర్థం కావటంలేదు.

వాళ్ళ కుట్రకు తను బలైపోయి పోలీసులచేత చిక్కితే, తరుణ్‌కు దిక్కెవరు? ఏమైపోతాడు? బయట ఈ రాబందులకు సాయంగా తోడేలు వుందన్నాడు తరుణ్.

మళ్ళీ పెళ్ళి చేస్కున్నవాడు మా వెంట పడి ఏం సాధిస్తాడు?

తనిక్కడ వుండటం ఇష్టంలేక రమేష్ తన చీకటి వ్యాపారాల రహస్యాలు ఎక్కడ బయట పెడతానోనని ఈ కుట్ర చేశాడా? లేక జయరాం పగకు ప్రతిఫలమా?

ఈ లోకంలో క్రూరమృగ ప్రవృత్తిగల వ్యక్తులే తారసపడటం తన దురదృష్టం.

ఈ పరిస్థితుల్లో తననూ, తన బిడ్డనూ కాపాడగల అమృత హస్తం కావాలి!

ఈ రాబందుల బారినుంచి కాపాడి, అక్కున చేర్చుకొనే ప్రేమమూర్తి కావాలి! రాక్షసత్వాన్ని ఎదిరించగల ధీరుడు కావాలి! 'అతడెవరో కాదు. అఖిలే'. కాని మనసు అంగీకరించలేకపోతోంది కదా!

'ఈ సమయం దాటితే నీకా అవకాశం కూడా లేదిక. నీ బిడ్డకు దూరమై హీనంగా చేయని నేరానికి శిక్ష ననుభవిస్తావా చెప్పు!'

అంతరాత్మ ఘోషకు తలొగ్గింది చందన! 'తనకు తన బిడ్డ క్షేమం కావాలి మొదట!'

"అవును. అతడే రావాలి! తమను ఈ విషవలయం నుంచి దాటించి, క్షణంలో ఇంద్రజాలంలా తనతో తీస్కుపోయి గుండెలో దాచుకోగల సమర్థుడు అఖిలే!".

తల్లి తనలో తాను మాట్లాడుకోవటం చూసి బొమ్మలా వుండిపోయాడు తరుణ్.

"బాబూ, ఒక పని చెయ్యాలి"

"ఏంటమ్మా? " బిక్కముఖంతో అడిగేడు తరుణ్.

"నువ్వు బయటకువెళ్ళి అంకుల్‌ను ఒక్కసారి రమ్మన్నానని ఫోన్‌చేసి రావాలి".

చిగురుటాకులా వణికిపోతున్న తరుణ్ స్థితిని కూడా విస్మరించి అతడిని వెళ్ళి ఫోను చెయ్యమని ఒత్తిడి చేస్తున్నందుకు బాధపడింది ఆమె.

"మమ్మీ, నే వెళ్ళను. ప్లీజ్, అక్కడ ఆ అంకుల్ వున్నాడు, వెళ్ళనమ్మా" బతిమలాడుతున్న తరుణ్‌వైపు నిస్సహాయంగా చూసింది. తను ఇలాంటి పరిస్థితిలో పడిపోతుందని ఏనాడు అనుకోలేదు.

ఊహించని పరిణామం, కాదు కుట్ర. కావాలని తనను అందులో ఇరికించటానికి



పన్నిన కుట్ర ఇది!

'చందూ! కారు తెస్తున్నాను. వచ్చేయాలి నువ్వు! నీ లాంటి సున్నిత మనస్కులు వుండలేరక్కడ' అఖిల్ మాటలే వినిపిస్తు న్నాయి చెవులలో.




పెద్దకారు వచ్చి ఆగింది హోమ్ ఎదుట, రమేష్ దర్జాగా దిగివచ్చి ఆఫీస్ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

ఎదురొచ్చిన డాక్టరు సువర్ణ, జయరాం, ఇతర సిబ్బంది అతడి చుట్టూ చేరారు.

చనిపోయిన పిల్లలను తీస్కెళ్ళి ఖననం చేయమన్నాడు రమేష్.

నోరు వెళ్ళబెట్టాడు జయరాం.

"అది కాదు సార్. మీరు వచ్చేక పోలీస్ కంప్లైంట్, ఇద్దాం అని ఆగాను, ఇప్పుడి వ్వనా సార్? " ఆత్రంగా అడిగేడు.

"నో" అరిచేడు రమేష్. "డూ యాజ్ అయ్ సే". ఆజ్ఞలా వున్న అతడి మాట లకు చెవులు కొరుక్కున్నారు.

నెమ్మదిగా డాక్టర్ సువర్ణ రమేష్ రూమ్‌లోకి వెళ్ళింది "సార్" అంటూ.

తలెత్తిన రమేష్ 'ఏమిటి?' అన్నట్లు చూసేడు.

"చందనను పోలీస్‌కు హాండ్ ఓవర్ చేయాలి.. తప్పుచేసింది, శిక్ష అనుభవిం చాలి కదా సార్? "

"పోలీసులు వస్తారు పిలిస్తే. వాళ్ళు ముందు నిన్నే అనుమానించి మూసే స్తారు. నువ్వు ఎందరు పిల్లల్ని మాయంచేసి వుంటావ్ ఇప్పటివరకూ? "

"సార్" గాభరాగా అంది.

"సామెతలొచ్చా నీకు? తీగలాగితే డొంకంతా ఏదో అయిందంటారు".

నీళ్ళు నములుతూ నుంచున్న సువర్ణను గదమాయించేడు.

"ఇంకేటి నీ గోల? "

"నిన్న జయరాంను ఆవిడ కొట్టింది సార్"

"ఎందుకు? "

"మీకు తెలియకుండా ఏదో ఫైలు తీ స్తోంది సార్. అలా చూడకూడదని చెప్పి నందుకు కొట్టేసింది.. దాని కొడుకు ఒకటే అల్లరి. వాడికి ఎంతో పొగరు"

"పిల్లలు అంతేగా! అలాగే వుంటారు".

"వాడిని ఎవరేమన్నా, వాడివైపు కన్నెత్తి చూసినా చంపేస్తానంది"

"ఆ తరుణ్ ఏనా? "

"అవునవును"

"పిల్లలను కోడిపిల్లల్లా పెంచి అమ్ముకొనే నీకూ నాకూ ప్రేమ గురించి ఏం తెలుసు? తల్లి ప్రేమకు ఆ పవరు వుంటది. నీకూ పిల్లాపీచూ లేరు కదూ!" కాజువల్‌గా అనేస్తున్న అతడివైపు ఉక్రో షంతో చూసింది.

అక్కడికి వీడికేదో వున్నట్లు! లోలోన అనుకుందామె.

'రమేష్ హాట్ టూట్ అంటాడు. పోలీ సులు తీస్కుపోతారు చందనను' అని ఆశ పడిన వాళ్ళందరికీ నిరాశే కలిగింది.

రుసరుసలాడుతూ బయటకు వచ్చిన డాక్టరు సువర్ణ "చాలా రుచిగా వుంది అదంటే. కొట్టిందంటే 'తల్లిప్రేమ' అట. అది ఈయనని పడగొట్టేసింది. ఏం అను మానం లేదు" అంది.

"వీడెక్కడికి వెళతాడు, అదెక్కడికి పోతుంది? నేను ఎత్తువేశానంటే ఛక్కే!"

చేతిలో తాళాల గుత్తి ఎగరేసి పట్టుకున్నాడు జయరాం.

నెమ్మదిగా జయరాం వెళ్ళేడు అతడి గదిలోకి "సార్" అంటూ.

విసుగ్గా చూసేడు రమేష్.

"అసలు ఆ పిల్లలు ఎలా చనిపోయారో, ఆ పాలలో విషం ఎందుకు కలిపిందో అడగరా ఆ చందనను? "

"నీ ఎదుటే నిలబెట్టి అడగాలా నేను? అయినా ఆ పాలలో విషం కలపటానికి ఆమెకెంత అవకాశం వుందో, నీకూ అంతే వుందేమో!" జయరాం కళ్ళలో తొట్రుపాటు గమనించిన రమేష్ చిన్నగా నవ్వేడు.

"ఎందుకు అంత కంగారు జయరాం? ఆ విషయం నేను చూస్తాను. ఎవ్వరూ వేలు పెట్టొద్దు ఈ మేటర్‌లో".

రమేష్ స్వరంలో కరుకుతనానికి, తీవ్రతకు వెనక్కు తగ్గాడు జయరాం.

"వెళ్ళి ఆ బాడీల సంగతి చూడు. రెండో కంటికి తెలియకూడదు. స్టాఫ్ అందరికీ చెప్పండి అలా అని"

తను వేసిన ప్లాన్ పారకపోయేసరికి జయరాంలో కక్ష పొగలు కక్కుతోంది.

చందన జైలుకు పోతుందని ఆశించిన జయరాం నిరాశను తట్టుకోలేకపోతున్నాడు. ఎలా అయినా తనను అవమానించిన చందనకు గుణపాఠం చెప్పాలన్న పట్టుదల రెండింతలైంది.

అంతలో-

"చందనను పిలువు ఆయా" అన్న రమేష్ ఏం చేస్తాడో చూద్దామన్న కుతూహలం కనిపిస్తోంది అందరి ముఖాలలో.

నెమ్మదిగా వచ్చిన చందన "కమిన్" అన్న రమేష్ పిలుపుతో డోర్ తీస్కు లోపలకు వెళ్ళింది.

కుర్చీ చూపిస్తూ "కూర్చో" అన్నాడు అలాగే నిలబడివుందామె.

"నా మీద ఇంకా ఏమైనా తీర్చుకోవలసిన కక్షలుంటే తీర్చుకో లేకపోయావా? ఏ పాపం ఎరుగని పసిపాపలనెందుకు చంపేశావు? " అడిగింది.

"పొరపాటు. ఆ నీచమైన పని నేచెయ్యలేదు. ఎవరేం ఆశించి చేశారో? "

"బుకాయించకు. నన్ను నేరస్థురాలిని చేద్దాం అని చేయించావ్. నేనిక్కడ వుంటే నీకు అన్ని విధాలా అడ్డం అని, నన్ను నీ తోవకు అడ్డు తొలగించుకోవాలి అని చేసిన పని ఇది" గట్టిగా అందామె.

"కూల్ డౌన్ అయ్ సే. ఎందుకు ఆవేశపడుతావు అనవసరంగా" అంటూ లేచి వచ్చి చందనను చెయ్యి పట్టుకు కూర్చోబెట్టటానికి ప్రయత్నించాడు రమేష్.

"ఛీ, నన్ను తాకకు" జరిగింది.

"సారీ... చాందీ, ఆ బాబు తరుణ్ అని

## ఖద్దరు తెచ్చిన తంటా?

అది ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గ్రంథావిష్కరణ సభ. అధ్యక్షులు భమిడిపాటి కామేశ్వరరావు. సభా ప్రారంభకులు శ్రీపాదవారు. ఉపన్యాసాలయ్యాక సత్కారం. ఖద్దరు ధోవతులు, శాలువాలు, ఫలపుష్పాదులూ సిద్ధం. పురప్రముఖుడు సీతారామస్వామి చేత సత్కారం. అధ్యక్షులకు సన్మానం తర్వాత, శ్రీపాదవారి వంతు వచ్చింది. ఆయన ఖద్దరు ముట్టరు. రాజీలేదు. సీతారామస్వామి ఖద్దరు కానిది తాకరు. అందరూ ఆ విషయం మరచిపోయారు. ఖద్దరు శాలువా తీసి సమీపించగానే శ్రీపాద 'ఉంచండి' అన్నారు గంభీరంగా. 'ఎందుచేత? ' అన్నట్టుగా చూశారు సీతారామస్వామి. సభ స్తబ్దమయింది. ఇంద్రగంటి లేచి 'శ్రీపాదవారు సరసులు. వారు నాకిక్కడ సత్కారం వద్దని నాతో చెప్పారు. ఆమాట మీతో చెప్పడం మరచిపోయాను. వేరొక సందర్భంలో స్వీకరిస్తారు' అన్నారు. గండం గడిచింది. సభ కులాసాగా ముగిసింది. శ్రీపాదవారిని ప్రసన్నులను చేసుకుని చేనేత వస్త్రాలతో మరో సందర్భంలో సన్మానించారు ఇంద్రగంటి.



తెలియక అలా మాట్లాడేను"

"ఎందరు తల్లుల్నీ, పిల్లల్నీ విడదీసి ఎంత పాపం మూటకట్టుకున్నావో, కన్నకొడుకును కళ్ళారా చూస్కొనే అదృష్టం లేదు నీకు"

రమేష్ ముఖం వివర్ణమైంది.

తనకు, సుజాతకు పిల్లలు లేకపోవటాన్ని ఒక శాపంగానే భావిస్తున్నాడతడు. ఎలా అయినా చందనను గుప్పిట్లో వుంచుకుంటే తనకు, తన వ్యాపారానికి క్షేమం. నయాన వినకుంటే భయాన అయినా ఆమెను సాధించాలి అని నిర్ణయించుకున్నాడతడు.

చందన ముఖంలోకి స్థిరంగా చూసేడతడు ఒక్కక్షణం.

"నన్ను ఎన్నైనా శపించు, కసితీరా తిట్టు. కానీ నా కోరిక కాదనకు. మీరిద్దరూ కావాలి. అలాగే సుజాత కావాలి! నీకు ఏ లోటు లేకుండా చూస్కుంటా. చూసేవుగా నా హోదా, డబ్బూ, దర్పం! ప్రపంచం నా చేతిలో ఉంది. నువ్వేం కోరితే అది నీ కాళ్ళ దగ్గరకు తేగల పవరుంది నాకు..."

"ఆపు నీ దండకం. తల్లుల కడుపుకోతతో కడుపు నింపుకొనే నీలాంటి పాపిష్టివాడి నీడ కూడా నా మీద, నా బిడ్డ మీద పడనివ్వను".

"నీమీద ప్రతీకారం తీర్చుకోవటానికి, ఆ పసిపిల్లల్ని టార్గెట్ చేసేరు సువర్ణ, జయరాం. నిన్ను దానికేం అనలేదుగా. ప్లీజ్, మనం కలిసి వుందాం. మన మధ్య వివాహబంధం వుంది చందనా"

అడుగు ముందుకేసిన అతడు, చందన ముఖంలో తీవ్రత చూసి ఆగిపోయాడు.

"నిద్రపోతున్న తల్లుల పక్కలో పిల్లల్ని ఎత్తుకువచ్చి వ్యాపారమా? ఆ పాపం అంతా నీది కాదా? "

కోపంతో అతడి ముఖం జేవురించింది.

"నన్ను కాదని నువ్వు, నీ కొడుకూ ఈ భూమి మీద బతకలేరు".

"ఏం బెదిరిస్తున్నావా? ఇన్నాళ్ళూ నువ్వు బతికివున్నావో లేదో తెలియకుండా బతికేం. ఇపుడు నువ్వు చనిపోయేవనుకుని బతుకుతాం".

వెళ్ళిపోతున్న ఆమె చేతిని గట్టిగా పట్టి ఆపేడు రమేష్.

"నేను నీ మొగుడినే.." ఏమో అనేలోగా రెండోచేత్తో చెంపమీద కొట్టింది.

అతడి చేతిలో చిక్కిన చేతిని వదిలించుకోవటానికి విశ్వ ప్రయత్నం చేస్తోందామె పెనుగులాడుతూ.

"బతికితే నాతో బతకాలి. లేకుంటే ఈ భూమి మీదే వుంచను వాడినీ, నిన్నూ".

"ఛీ! కుక్కకంటే హీనమైన చావు వస్తుంది నీ పాపాలకు".

ఒక్క ఉదుటున ఆమెను ఒడిసిపట్టి, కళ్ళలోకి చూస్తూ అన్నాడు.

"నీ చరిత్ర నాకు తెలియదనుకుంటున్నావా? నా వెనుకే మరొకడిని పెళ్ళి చేస్కోలేదా? నువ్వేమైన మహాపతివ్రతవా? నీకు ఇద్దరు మొగుళ్ళు వుండగా లేనిది, నాకు ఇద్దరు పెళ్ళాలుంటే, కావాలనుకుంటే తప్పా? "

ఆమెను వదిలి దూరంగా నిలబడి అన్నాడు. "జాగ్రత్త, నేనెవర్నో తెలియక తలపడుతున్నావ్ నాతో. బూడిదైపోతావ్" అరచేతిలో ఉఫ్‌మని వూదుతూ అన్నాడు.

"ఛీ" అంటూ వెళ్ళిపోబోయిన ఆమె చెయ్యి బలంగా పట్టి ఆపాడు.

"నన్ను పోనీ. లేకుంటే బతికినంతకాలం పశ్చాత్తాప పడవలసి వస్తుంది నీకు" తీవ్రంగా వుంది ఆమె చూపు.

"ఏం విడాకులిచ్చిన మధుగాడు వస్తాడా? నాకెలా తెలిసిందని ఆశ్చర్యపోకు. వాడికి విడాకులిచ్చేవ్ కాని నాకివ్వలేదుగా. నీమీద సర్వ హక్కులూ వున్నాయి" బలవంతంగా సోఫాలో కూర్చో

బెడుతూ అన్నాడు.

"వాడూ నీలాంటి దరిద్రుడేరా"

"అయితే కుబేరుడొస్తాడా ఇపుడు? ఆ ఎర్రకారోడు. కంప్యూటర్ కంపెనీవోడు".

"చాలా సమాచారం సేకరించావ్ నా గురించి. తెలిసిందిగా ఇక అడ్డులే" అతడిని ఒక్క తోపుతోసి తలుపు దగ్గరకు వెళ్ళబోయింది చందన. వెనక్కు పడబోయి, తమాయించుకుని, పరుగున వచ్చి చందన చెంపపై కొట్టేడు.

"ఆడదానివి ఎవడో ఒకడి నీడన పడుండక, ఇంత పొగరేంటే నీకు? నీ అంతు చూస్తాను. ఈ క్షణంలో తీస్కున్న నిర్ణయం ఇది!"

గభాల్న చేతికందిన ఆమె జడపట్టి గుంజాడు.

"నా జోలికి వచ్చినా, నా వ్యాపారం లావాదేవీల గురించి ఎక్కడైనా వాగినా ప్రాణం తీస్తా.. నీది కాదు నీ కొడుకుది"

"వాడు నీకూ కొడుకేరా" ఆవేశంగా అంది చందన.

"అదే ఎక్కడైనా అన్నావంటే ఇక్కడే పాతేస్తాను. నా కళ్ళకు కనిపించకుండా, నా చెవులకు నీ గురించి వినిపించకుండా వుండేంత దూరం ఫో నీ కొడుకును తీస్కొని. లేకుంటే వాడిని చంపేస్తాను."

చందన జడ బిగించి పట్టుకొని ముఖంలో ముఖం పెట్టి చెప్తున్న రమేష్, తలుపులు పెద్దశబ్దంతో తెరుచుకొనేసరికి ఆమెను విడిచిపెట్టి అటు చూశాడు.

అఖిల్ తన్నిన తాపుకు తలుపులు భళ్ళున తెరుచుకుని రెండువైపులా కొట్టుకున్నాయి పెద్ద శబ్దంతో.

అటుచూసిన చందన అఖిల్‌ను చూస్తూనే భోరుమంటూ వెళ్ళి అతడిని చుట్టేసింది పసిపాపలా.

స్కూల్‌కు తరుణ్ రాలేదని తెలిసిన అఖిల్ కల్పన కోరిక మేరకు చందనను ఒకసారి చూసి వెళ్దామనివస్తే తరుణ్

## కొత్తగాలి...

**ఎన్నికల్లో**
**కుప్పిగంతులు**
**ఫలితాల తర్వాత**
**రాజకీయులు కప్పగంతులు**

—పొనుగోటి నరసింహారావు,
దుబ్బాక, నల్లగొండ జిల్లా

తనకు తెలిసిన సంగతులన్నీ ఏకరువు పెట్టాడు.

చిగురుటాకులా కంపించిపోతున్న చందనను నెమ్మదిగా సోఫాలో కూర్చోబెట్టాడు అఖిల్. రమేష్‌కు దగ్గరగా వెళ్లి "ఏమైంది? " అన్నాడు.

తడబడ్డాడు రమేష్.

"ఏమైందిరా, మాట్లాడు నాతో. ఆడపిల్ల మీదనా నీ ప్రగల్భాలు!"

"ఇది నా హోమ్. అది నా భార్య... నువ్వెవరు? బయటికి నడువు" అఖిల్‌కు దూరంగా జరుగుతూ అన్నాడు.

"ఇందాక జుట్టు పట్టి మరీ చెప్తున్నావ్ కదురా, ఇప్పుడు నాకు చెప్పు అవన్నీ"

రమేష్ గుండెపై చెయ్యివేసి వెనక్కు తోస్తూ అన్నాడు.

గుమ్మంలో జనం గుమిగూడారు.

జయరాం ఒక్క పరుగున వచ్చేడు.

"పదవయ్యా బయటకి" అంటూ అతడి చెయ్యి పట్టుకున్నాడు.

అఖిల్ విసిరి కొట్టేసరికి అంత దూరాన పడ్డాడు జయరాం.

"అసలు నువ్వెవరయ్యా? ఇక్కడికొచ్చి గలాటా చెయ్యటానికి? " అంటూ మళ్ళీ పరుగున వెళ్లాడు జయరాం.

"పద బయటికి" అఖిల్ ఎదురుగా నిలబడి అతడి ముఖంవైపు తలెత్తి చూస్తూ అన్నాడు జయరాం.







గుమ్మం దగ్గర నిలబడిన తరుణ్, "అంకుల్ దిస్ ఫెలో ఓన్లీ బీటెన్ మీ" అని చెప్పాడు.

అప్పటికే తరుణ్ లేత బుగ్గలపై తేలిన చారల్లాంటి నల్లటి తట్టు చూశాడు అఖిల్. పిచ్చి కోపం ఆవహించింది అతడిని.

"అవునా? " అన్నాడు చందనతో.

"అవును. వాడే కొట్టేడు" అంది.

"ఏరా కొట్టేవా? " అడిగేడు అఖిల్.

"వాడేమవుతాడ్రా నీకు? " ఇంకా అతడి మాటలు పూర్తి కాకుండానే అతడి షర్టు కాలర్ పట్టి పైకి లేపాడు అఖిల్.

పాదాలతో నేలను అందుకోవటానికి ప్రయత్నిస్తూ గింజుకోసాగాడు జయరాం.

"నా ఎదురుగా మరొక్కసారి పెదవి విప్పావంటే, అదే ఆఖరు మాట నీకు" అంటూ వదిలేసేడు.

వెనకడుగులు వేస్కుంటూ అక్కడ్నుంచి గబగబ వెళ్లిపోయాడు జయరామ్.

అంతవరకు జరిగేది నోరు తెరిచి చూస్తున్న రమేష్, "ఏయ్ ఎవరు నువ్వు? అసలు నీకూ దానికీ సంబంధం ఏంటి? " కోపంగా అరిచాడు.

అఖిల్ దవడ ఎముకలు బిగిశాయి

కోపంతో. "మర్యాదను అతిక్రమించి ఒక్క మాట మాట్లాడినా పరాభవం తప్పదు నీకు. ఆవిడకు అపాలజీ చెప్పు" అంటూ అతడిని చందన దగ్గరకు తోశాడు.

"ఇదిగో మిస్టర్ నేనేంటో, నా బ్యాగ్రౌండ్ ఏమిటో తెలియక తెగ రెచ్చిపోతున్నావ్"

"ఛుప్" అడ్డువచ్చాడు అఖిల్.

"నీ బయోడేటా కావాలా? " హేళనగా అడిగేడు అఖిల్.

"చందనా, ఇతడ్ని బయటకు వెళ్ళమని చెప్తావా లేదా? " బిగ్గరగా అరిచాడు.

"అరవకు గుండె ఆగిపోతుంది" అంటూ



జేబులోనుంచి రెండు ఫోటో ముక్కలు తీసి అతడి మీదకు విసిరాడు అఖిల్.

"చేతికి అందినంత సొమ్ము స్వాహా చేసి, భార్యా బిడ్డలను గాలికి వదిలి ఆకాశానికి నిచ్చెనలు వేశావా? ఛండాలుడా!"

అఖిల్ మాటలకు నివ్వెరపోయి చూసింది చందన. ఇతడికి ఈ విషయాలన్నీ ఎలా తెలిశాయి! లోలోన ఆశ్చర్యపడిందామె.

"పసిపిల్లలతో వ్యాపారం ఏమిటిరా హీనుడా? "

రమేశ్ ముఖం కళ తప్పింది.

విసురుగా బయటకు వెళ్ళిపోబోయిన అతడికి భార్య సుజాత ఎదురు వచ్చింది. ఆమె ఒళ్లంతా బంగారు తొడుగు తొడిగినట్లున్నాయి ఆభరణాలు.

"ఏమైందీ? " అంటూ గాభరాగా రమేష్‌ను చేరింది.

ఆమెకు తెలుగు రాదులా ఉంది. హిందీలో మాట్లాడుతోంది. ఆమెను చూసిన రమేష్ ముఖం వివర్ణమైంది.

"సుజీ నువ్వెందుకు వచ్చావ్ ఇక్కడకు? నువ్వు పద. ఏదో చిన్న గొడవ అంతే. నేను సర్దుబాటు చేసి వస్తాను"

అతి సహజంగా చెప్పి ఆమెను పంపేయ ప్రయత్నించిన రమేష్ వైపు హేళనగా చూసింది చందన.

అందరి ముఖాల్లోకి బిక్కముఖం పెట్టి చూస్తున్న తరుణ్‌ను బయటకు తీస్కెళ్లాడు అఖిల్.

"తరుణ్ కార్లోనే కూర్చునుండూ. లోపలకు రావద్దూ" అని చెప్పాడు.

అయిష్టంగానే తలూపాడు తరుణ్.

వేగంగా వెనుతిరిగి లోపలకు వెళ్లిపోయాడు అఖిల్.

కార్లో కూర్చుని ట్రాఫిక్ చూస్తున్న తరుణ్ ఒక్కసారిగా అదిరిపడ్డాడు.







"ఏరా మీ అమ్మ, బాబు నన్ను కొడతారా? నువ్వేమో నన్ను అరేయ్, ఒరేయ్ అని పిలుస్తావా? " అంటూ పక్కనుంచి సమీపించిన జయరాంను, ఆ వెనుకే వున్న మధును చూసి భయంతో కీచుగా అరిచేడు తరుణ్.

"అంకుల్... అంకుల్" తరుణ్ కేకలు అఖిల్‌కు చేరలేదు.

అక్కడ నెలకొన్న గందరగోళ వాతావరణంలో అతడిని ఎవరూ పట్టించుకోలేదు.

★ ★ ★

సుజాత భర్తను అడుగుతోంది.

"ఎవరండీ వీళ్లంతా. ఆవిడెవరు, ఆ పిల్లాడెవరు? ఈ పొడుగాటి వ్యక్తి నిన్నేదో అంటున్నాడు. ఆ భాష నాకు తెలియటం లేదు. ఏం జరుగుతోందిక్కడ? " ఆందోళనగా ఉంది ఆమె కంఠస్వరం. రమేష్ జనాంతికంగా, భార్యకు కూడ అర్థం అయ్యేలా హిందీలో చెప్తున్నాడు.

"ఇదిగో ఈ అమ్మాయి మన హోంలో పనిచేస్తోంది. అదుగో రోజూ అతడెవరో రావటం, పోవటం, ఈవిడ ప్రవర్తన బాగోలేదు. జయరాం అదేమని అడిగిన పాపానికి, అతడిని పట్టుకుని వాయించింది."

తడుముకుంటూ చెప్తున్న రమేష్ కాలర్ పట్టి గుంజాడు అఖిల్ ఆవేశంగా.

"నీతో ఇపుడే చెప్పిస్తారా ఎవరి ప్రవర్తన బాగోలేదో? నీ నీచపు బతుకంతా ఇక్కడే ఇప్పుడే బయట పెడతా!"

హిందీలో ఆవేశంగా అరుస్తున్నాడు అఖిల్. రమేష్‌ను గదిలో నుంచి బయట వున్న జనం మధ్యకు తోసుకెళ్ళాడు.

"అయ్యో... అయ్యో, ఎవరూ మాట్లాడరేం, వీడెవరు? ఈ దౌర్జన్యం ఏమిటి? " శోకాలు మొదలు పెట్టింది సుజాత.

"చూడండి మేడమ్, కాస్త నిశ్శబ్దంగా ఉండండి. మీ ఆయన్నేం చంపేయటం లేదు. అతడే చెప్తాడు ఈ గొడవంతా ఏమిటో" సుజాతనుద్దేశించి అన్నాడు.

"ఐ విల్ సీ యువర్ ఎండ్" అన్నాడు రమేష్ కసిగా, అఖిల్ చేతిలో ఉన్న తన చెయ్యి విడిపించుకుంటూ.

"బయటకు రా" చందనను పిలిచేడు అఖిల్.

చందన ముడుచుకుపోయింది అక్కడ ఛెయిర్‌లో... నేల చూపులు చూస్తూ.

"నీలాంటి దగాకోరూ, విశ్వాస ఘాతకుడితో బతుకు ముడివేసుకున్నందుకు ఆమె బతుకింత అల్లరి పాలు చేశావ్? "

"ఏమండీ, ఇదంతా నిజమేనా? " భర్త చెయ్యి తన తలపై ఉంచుకొని, "చెప్పండి. ఎవరామె! అతడు చెప్తున్నదంతా నిజమేనా? " అడిగింది సుజాత.

రమేష్ అనాథ బాలలను అంతగా ప్రేమించి, ఆదరిస్తున్నందుకైనా ఆ భగవంతుడు కనికరించి తమకో బిడ్డనైనా ఇయ్యకపోతాడా? ' అన్న ఆశ ఆమెకు.

జయరాం ఇక్కడేదో రగడ జరుగుతోందని ఫోన్ చేస్తే ఏదోలే అనుకుంది. కానీ తీరా వచ్చి చూస్తే తను, రమేష్ చుట్టూ ప్రేమానురాగాలతో నిర్మించుకున్న ప్రేమసౌధం పునాదులు కదులుతున్నాయి' ఆమె గుండె బరువెక్కింది.

ఏం చెప్పకుండానే ఆమె తలపై నుంచి తన చెయ్యి వెనక్కు తీస్కున్నాడు రమేష్.

భర్తను కుదుపుతూ అడిగింది ఆమె. "రమేష్ నిజం చెప్పు. ఎవరామె? "

మౌనమే అతడి సమాధానం అయింది.

"నాకు నిజం తెలిస్తే, నేనూ -నాతో పాటు ఈ హోదా, సిరిసంపదలూ దూరమైపోతాయని భయపడుతున్నావు కదూ!" తీవ్రంగా ఉంది ఆమె కంఠస్వరం.

జేబులోంచి ఫొటో ముక్కలను తీసి ఆమెకు ఇచ్చాడు అఖిల్.

అక్కడి వాతావరణానికీ, జరిగిన సంఘటనలకూ 'టచ్ మీ నాట్' మొక్కలా

ముడుచుకుపోయి కూర్చున్న చందనను చెయ్యి పట్టి లేపాడు అఖిల్, "పద చందనా" అంటూ.

లోపలికి వెళ్ళి సూట్ కేస్‌తో తిరిగి వచ్చింది చందన.

నెమ్మదిగా నడిచిపోతున్న ఆమెకు కొందరు స్టాఫ్, ఆయాలు కన్నీళ్లతో వీడ్కోలు పలికారు.




**కా**రును సమీపించిన అఖిల్, కార్లో తరుణ్ కనపడకపోయేసరికి చుట్టూ చూశాడు. వెనక సీట్లో ఎక్కి కూర్చున్న చందన కిందకు దిగింది.

"తరుణ్ ఏడి? " అంటూ.

"తరుణ్... తరుణ్" అంటూ బిగ్గరగా పిలిచాడు అఖిల్.

రోడ్డు ఆ చివర నుంచి ఈ చివర వరకూ చూసేడు. ఎక్కడా జాడ లేదు.

అతడికి ఏదో చెడు జరిగిందని సిక్స్త్ సెన్స్ చెప్తోంది.

"తరుణ్ ఎక్కడ? మాట్లాడరేం? " గాబరాగా అడిగింది చందన.

"కార్లోనే కూర్చున్నాడు. ఇపుడు లేదు" అంటూ కాపలా మనిషిని అడిగేడు.

అతడు చూడలేదన్నాడు.

అఖిల్ గుండె ఒక్క క్షణం లయ తప్పింది. ఏమైనట్టు?

అసలే జరిగిన గొడవకు అస్తవ్యస్తంగా వున్న ఆమె మానసిక స్థితి మరింత అల్లకల్లోలమైంది.

"వర్రీ అవ్వకు చందూ. ఇక్కడే ఎక్కడో వుంటాడు" అని పైకి చెప్తున్నా అతడి మనసులో ఒకటీ ఒకటి చేర్చి చూసి పజిల్ కు సమాధానం కనుక్కున్నాడు.

"మై గాడ్!" అనుకున్నాడు

వేగంగా లోనికి వెళ్లి "జయరాం ఎక్కడ? " అని అడిగేడు.

"తెలియదు" అందరిదీ ఒకే సమాధానం. "తరుణ్.. తరుణ్" అంటూ హోమ్‌లో అడుగడుగూ వెతికేడు. అతడి వెనుకే పరుగులాంటి నడకతో, నీళ్లు నిండిన కళ్ళతో వెతుకుతోంది చందన కూడా.

లోపల్నుంచి సుజాత వేగంగా వచ్చి మారుతీ ఎక్కి స్టార్ట్ చేసింది. ఆమె పరిసరాలనూ, వ్యక్తులనూ గమనించడం లేదు.

ఆమె వెనుకే "సుజీ... ప్లీజ్ ఆగు" అంటూ పరుగులాంటి నడకతో వచ్చిన రమేష్ కొయ్యలా నిలబడిపోయాడు. రయ్యిన పోతున్న భార్య కారు చూసి.

హడావుడిగా తన బెంజ్ కారు ఎక్కి కూర్చున్న రమేష్‌ను కంగారుగా సమీపించేడు అఖిల్.

ఒక్క ఉదుటున అతడి కారు తాళాలు తీసి జేబులో వేసుకున్నాడు.

రమేష్ డోర్ తెరిచి విసురుగా కిందకు దిగాడు. "ఏమిటి? " అంటూ

"తరుణ్ కనిపించటంలేదు"

"అయితే? "

"పిల్లాడిని ఏం చేశావ్ చెప్పు? " తీవ్రంగా ఉంది అఖిల్ స్వరం.

"నాకు తెలియదు నిజంగా!" విసుగ్గా అన్నాడు అతడు.

"సరే, జయరాంగాడెక్కడ? " తీవ్రంగా వుంది అఖిల్ స్వరం.

"ఏమో తెలియదు."



"సరే ఇక్కడ ఏం సీన్ క్రియేట్ చెయ్య కుండా లోపలికి పద."

"నేను అర్జెంటుగా వెళ్ళాలి."

అంతలో ఆర్మీ జీప్‌లో వచ్చిన వర్మ, కల్పన విషయం తెలుసుకున్నారు. కల్పన, చందనను ఊరడించే ప్రయత్నం చేస్తోంది.

వర్మ "రా బ్రదరూ మాట్లాడుకుందాం మనం" అంటూ రమేష్ భుజాల చుట్టూ చెయ్యేసి లోపలికి నెట్టుకుపోయేడు. "పోలీస్ కంప్లైంట్ ఇచ్చే వచ్చేనులే" అంటున్న వర్మవైపు కోపంగా చూసేడు రమేష్.

చందన పరుగున వచ్చింది అక్కడకు. "వీడే... వీడే తరుణ్‌ను బతకనివ్వనని పదే పదే బెదిరించాడు నన్ను... దుర్మార్గుడా... ఏం చేశావ్ నా బిడ్డను..." అతడి కాలర్ పట్టి గుంజి ఏడుస్తూ అలాగే కిందకు వేలాడిపోతున్న చందనను పడిపోకుండా పట్టుకున్నాడు వర్మ.

"చందూ... చందూ" అంటూ బాటిల్‌లో నీళ్ళు ముఖంపై చల్లింది కల్పన. కంగారుగా ఏమో చెప్పబోతున్న అఖిల్‌తో "పల్స్ బాగానే వుంది. బాగా డిస్టర్బ్ అయినట్లుంది తిండీతిప్పలూ లేకుండా. హాస్పిటల్‌కు తీస్కెళ్లిపోతా?" అంది కల్పన.

అంబులెన్స్ వచ్చింది. చందనను తీస్కొని కల్పన వెళ్లిపోయింది.

రమేష్ ఎదుట టేబిల్‌పై కూర్చుని, "ఆ జయరాం ఎవడో, ఎక్కడుంటాడో నిముషంలో చెప్పించనా నీతో? నావన్నీ మిలటరీ ఆనర్స్‌రా" అంటుండగానే పోలీసు ఇన్‌స్పెక్టర్రూ, కానిస్టేబిల్స్ వచ్చేరు. రమేష్‌ను విష్‌చేసి "సర్, మాకు వచ్చిన కంప్లైంట్ ప్రకారం వచ్చేం, మీ హోమ్‌లో పనిచేసే ఆవిడ కొడుకు కనిపించకుండా పోయేడట. కిడ్నాప్ అంటున్నారు వీళ్ళు"

"నాకూ, ఈ విషయానికీ సంబంధం లేదు, వాచ్‌మెన్, ఎంప్లాయీస్ నిత్యం అలర్ట్‌గా వుండే మా హోమ్‌లో అటువంటి సంఘటనకు తావేలేదు" చెప్పాడు రమేష్.

"రమేష్ సర్ సొసైటీలో పరువు ప్రతిష్టలు గల పెద్దమనిషి సార్. మీ అబ్బాయి ఫోటో ఇవ్వండి, ప్రయత్నం చేస్తాం" అఖిల్‌తో అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"సరే రేపిస్తా ఫొటో" అని కామ్‌గా వుండిపోయేడు అఖిల్.

"సర్, ఎనీ ప్రాబ్లమ్? " వెళ్లిపోతూ రమేష్‌ను అడిగేడతడు.

"నోనో! అటువంటిదేం లేదు. థాంక్యూ"

కుర్చీలో కూలబడ్డ రమేష్ గెడ్డం కింద రివాల్వర్ పెట్టి పైకెత్తుతూ అడిగేడు వర్మ. "నీ దగ్గర పనిచేసే ఆ కుక్క అడ్రస్..." అంతలోనే రమేష్ పాకెట్‌లో వున్న మొబైల్ మోగింది.

"తీయ్" అంటూ సెల్ లాక్కొని ఆన్ చేశాడు అఖిల్.

అవతలి వ్యక్తి "సర్" అన్నాడు.

"ఎస్" అన్నాడు అఖిల్ అస్పష్టంగా.

రమేష్ గుండె దడదడమంటోంది ఎవరేం రహస్యాలు మాట్లాడేస్తారోనని.

"చందన పోయిందా హోమ్ నుంచి? "

అది జయరాం అని గుర్తించాడు అఖిల్.

"వూః" అన్నాడు.

"సర్ మీకు చెప్పకుండా ఒక పని చేశాన్సార్. మధంట సార్.. ఆ చందన భర్తంట.. కొడుకు మాత్రం వాడి కొడుక్కాదట.. అతడి హెల్ప్‌తో ఆ తరుణ్‌గాడిని కిడ్నాప్ చేసేం సార్..."

స్పీకర్ ఆన్ చేసి రమేష్ కిచ్చి, మాట్లాడమని సైగ చేశాడు అఖిల్.

"వూ చెప్పు. ఏంటి విషయం? " అడిగేడు ఇబ్బందిగా కదులుతూ రమేష్. మళ్ళీ విషయం చెప్పేడు జయరాం.

ఎదుటి పాడ్‌మీద రాశాడు అఖిల్.

"తరుణ్‌ను ఎక్కడుంచాడో అడుగు..." తటపటాయిస్తున్న రమేష్ ఎదుట పాడ్ మీద మళ్ళీ రాసేడు అఖిల్.

"ఒక్కమాట ఎక్కువ మాట్లాడినా ఇక నువ్వుండవు, నే రాసిందే అడుగు."

"వాడిని ఎక్కడుంచేవ్‌రా? " కోపంగా అరిచేడు రమేష్.

"డాక్టరు సువర్ణ ఇంట్లో అండర్ గ్రౌండ్‌లో పడేసేం సార్."

"నేను వస్తాను. అంతవరకు వాడినేం చెయ్యకు" అఖిల్ రాసినట్టే చెప్పాడు. సెల్ ఆఫ్‌చేసి జేబులో వేస్కొని కుర్చీలో చతికిలపడ్డాడు అఖిల్, "నీకా కిడ్నాప్‌తో సంబంధం లేదు కనుక బతికిపోయేవు" అంటూ.

అంతవరకు తరుణ్ కోసం అతడు పడిన టెన్షన్ కాస్త రిలాక్స్ అయినట్లైంది. కల్పనకు ఫోన్‌చేసి విషయం చెప్పాడు.

"చందన మైల్డ్ సెడేషన్‌తో నిద్రపో తోంది" అని చెప్పిందామె. తరుణ్ క్షేమంగా వున్నాడన్న వార్తవిని ఆమె ప్రాణం కుదుటపడింది.

★ ★ ★

"సరే తీస్కెళ్తాను అక్కడకు, ఒక్క కండి షన్ మీద!" తాపీగా అన్నాడు రమేష్.

"నీకు షరతులేంట్రా? " అంటూ టపీమని ఒక్కటేశాడు మేజర్ వర్మ. కంగా రుగా అతడిని వారించాడు అఖిల్.

"ఏమిటా కండిషన్? " అతడి ముఖం లోకి సూటిగా చూస్తూ అడిగేడు అఖిల్.

"కుర్రాడు మీ చేతికి రాగానే ఏ న్యూసెన్స్ క్రియేట్ చేయకుండా నన్ను వదిలేయాలి. అలా కాదని మీరు, పోలీ సులు గొడవ అన్నారంటే, నా ప్రాణం అయినా వదిలేస్తాను గాని ఆ అడ్రస్ చెప్పను" అతడి గొంతులోని మొండిత నాన్ని గుర్తించేడు అఖిల్.

"ఏం స్టెప్ తీస్కుంటే ఏం ఫలితం కలు గుతుందో" అని అతడి మెదడు వేగంగా అంచనాలు వేస్తోంది. "ఈ నీచుడిని తను పట్టించి అరెస్ట్ చేయించినా, కుళ్ళు రాజకీ యాలు నడిపే రాజకీయ నాయకులు గొడుగువేసి తప్పకుండా కాపాడతారు!"

జీవితంలో మొదటిసారి అతడు అన్యాయంతో రాజీకి సిద్ధపడ్డాడు.

చందనకు 'తరుణ్‌ను క్షేమంగా అప్పగి స్తాన'నని ఇచ్చిన మాట ముఖ్యం తనకు!

'అన్నింటినీ మించి తనవాళ్ళుగా అనిపి స్తున్న ఆ ఇద్దరూ క్షేమంగా వుండాలి!'

'తనకు ఇంకా విధి వెంట పరుగులు తీసి ఒయాసిస్‌లను అన్వేషించే ఓపిక మిగలలేదు జీవితంలో!'

తన ఈ చిన్ని సంతోషాన్ని చేజార్చుకో కుండా గుండెలో దాచుకోవాలి!

'అవును! ఈ ఒక్క నిర్ణయం తనకోసం! తన మనసును ఆక్రమించుకున్న 'వారి' కోసం!

తనేం తప్పు చేయటంలేదు. అయిదు నిముషాల అంతరంగమధనం, అతడి షర తుకు 'సరే' అనిపించింది.

"డన్!" అంటూ చెయ్యి చాపేడు రమేష్. చెయ్యి వెనక్కు తీస్కున్నాడు అఖిల్ "నేను ద్రోహులతో చెయ్యి కల పను!" అంటూ.

చెయ్యి వెనక్కు తీస్కున్నాడు రమేష్!

అఖిల్ ముఖంలో ముందెన్నడూ చూడని గాంభీర్యం చూసిన వర్మ మారు మాట్లాడకుండా అతడిని అనుసరించాడు.

★ ★ ★

మెరూన్ కలర్ సుమో ఢిల్లీ శివారు ప్రాంతంవైపు దూసుకుపోతోంది. వర్మ, అఖిల్‌ల మధ్యన కూర్చున్న రమేష్‌కు మన స్థిమితం లేదు, భవిష్యత్ అర్థంకాక!

గుర్‌గావ్ చేరుకొనేసరికి పొద్దుపో యింది. కారు ఆపమన్నాడు రమేష్.

"ఏక్చ్యువల్‌గా ఆ ప్లేస్ తెలియదు!







ఫోన్‌చేస్తా" అంటూ జేబుల్లో సెల్ కోసం చూస్కుంటున్న అతడిని ఒక్కటేశాడు వర్మ "ఓవర్ స్మార్ట్‌నెస్ వద్దమ్మా" అంటూ.

"ఈయనను కాస్త కంట్రోల్ చేయండి. నాకు నిజంగానే తెలియదు. అడగాలి!" అసహనంగా అరిచేడు రమేష్, మెడపై చేత్తో పాముకొంటూ.

వర్మను కళ్ళతోనే వారించి జేబులో సెల్ తీసిచ్చాడు అతడికి అఖిల్.

అతడు చెప్తున్న ప్రకారం డ్రైవ్ చేసి ఒక బిల్డింగ్ కింద సెల్లార్‌లోకి పోనిచ్చి ఆపాడు కారును అఖిల్.

వాచ్‌మన్ ఎవరు కావాలని కనుక్కు న్నాడు. జయరాంకు రింగ్‌చేసి తరుణ్‌ను తీస్కురమ్మన్నాడు పార్కింగ్ దగ్గరకు.

పది నిముషాలకు లిఫ్ట్‌డోర్ తెరిచిన శబ్దమైంది. కార్లో లైట్‌ఆఫ్ చేశాడు అఖిల్.

తరుణ్‌ను నడిపించుకొంటూ నీడలా కదిలివస్తున్న జయరాంను చూడగానే అఖిల్ దవడ ఎముక బిగుసుకుంది.

"బావా ఇతడిని కాస్కో నువ్వు" అంటూ మెరుపులా డోర్ తీస్కు దిగేడు అఖిల్.

దిగుతూనే జయరాం మెడ చుట్టూ చెయ్యివేసి కదలనీయకుండా ఒడిసి పట్టు కున్నాడు అఖిల్!

రెండో చేత్తో బ్యాక్‌డోర్ తీసి తరుణ్‌ను లోపలికి తోశాడు.

విడిపించుకోవటానికి గింజుకుంటున్న జయరాంను కార్లో ఫ్రంటు సీట్లోకి తోసి కూర్చోబెట్టాడు అఖిల్.

"నోరెత్తేవంటే ఛస్తావ్. నోరు మూసుకు కూర్చోరా" అంటూ, "సార్.." అని రమే ష్‌తో ఏదో అనబోయి జయరాం "అబ్బా!" అంటూ తల పట్టుకున్నాడు. అలాగే ఇరు క్కుని కారుని రివర్స్ చేశాడు. పది నిము షాల తర్వాత ఒక నిర్మానుష్య ప్రదేశంలో ఆగింది కారు.

తను దిగి, జయరాంను కిందికి లాగాడు అఖిల్.

"ఏరా నిన్ను ఇక్కడే పాతేస్తా, నేనెవరో తెలియదు నీకు. ఎందుకురా ఆ పసివాడి మీద నీకంత పగ? " అంటూ జయరాంను కసితీరా వాయించేడు కాళ్లతో చేతులతో.

"తప్పైంది. క్షమించండి బాబూ..." అతడి ధాటికి తట్టుకోలేక చేతులెత్తి దణ్ణం పెట్టాడు జయరాం.

తన్నటానికి మళ్లీ కాలెత్తి "ఛీ!" అంటూ కారు దగ్గరకెళ్ళి తరుణ్ నోటికున్న ప్లాస్టర్ తీశాడతడు.

"అంకుల్!" కంపించిపోతూ బావురు మని అఖిల్‌ను పెనవేసుకున్నాడు తరుణ్.

"భయం లేదు నాన్నా. నేనొచ్చేసేనుగా" అంటూ గుండెకు హత్తుకున్నాడు. వాటర్ బాటిల్ తీసి నీళ్లు తాగించి కూర్చోబె ట్టాడు.

తరుణ్ "మమ్మీ..." అంటూ ఏడుస్తూనే వున్నాడు.

"ఏరా వాడేడిరా? " లేవలేక అవస్థపడు తున్న జయరాంను అడిగేడు.

"ఎ..వరు? "

"ప్రశ్నకు ప్రశ్నేంటిరా? " అంటూ మళ్లీ తన్నాడు. అంత దూరాన పడినతడు ఏడుపు లంకించుకున్నాడు.

"ఆ మధు... చెప్పకుండా మాయమైపో యేడు సార్? "

"ఇదంతా అతగాడి ప్లానే" శిక్ష తగ్గుతుం దేమోనన్న ఆశతో అబద్ధం చెప్పాడు.

"అంటే... నువ్వు అమాయకుడివా? " సమీపిస్తున్న అఖిల్ కాళ్లు పట్టుకున్నాడు జయరాం "క్షమించండి సార్" అంటూ.

"నువ్వు, అదెవరు.. ఆ డాక్టరూ, ఈ రమేష్ మళ్లీ జీవితంలో ఎపుడూ నా కళ్ల పడకూడదని కోరుకోండి. ఈ వూరు వదిలి పారిపోండిరా... లేకుంటే మొత్తం అందర్నీ కలిపి భూస్థాపితం చేసేస్తాను

## ఆగస్టు -09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.




1. ఇవటూరి శారదాదేవి - పోడూరు, పశ్చిమగోదావరి జిల్లా
2. కె.గురుప్రసాద్ - శ్రీనివాసనగర్, విజయవాడ
3. చాగంటి అరుణరేఖ - లక్ష్మీపురం, గుంటూరు
4. యు.విజయశేఖరరెడ్డి - భాగ్యనగర్‌కాలనీ, హైదరాబాద్
5. ఆర్.లక్ష్మి - ఆర్యాపురం, రాజమండ్రి

## సరైన జవాబులు

1. శ్రీనివాసమ్మ 2. రాజు 3. ఓబులవ్వ 4. చంద్రకళ 5. నెమళ్ళలంక 6. విశ్వనాథ సత్యనారాయణ 7. స్టీఫెన్ క్రేన్ 8. స్రవంతి 9. కేతు విశ్వనాథ రెడ్డి 10. ఓ జర్నలిస్ట్

జాగ్రత్త...” వగరుస్తూ ఒక్క క్షణం ఆగాడు అఖిల్.

“బావా అతడిని దించు కార్లోంచి” అన్నాడు వర్మనుద్దేశించి.

“దిగరా దిగు... ఈసారి నీ వంతు” అంటూ దిగాడు మేజర్ వర్మ.

అఖిల్‌నుద్దేశించి, “నాకు మాటిచ్చావ్” బెరుకుగా అన్నాడు రమేష్.

“ఏం బతుకురా నీది... ఛీ ద్రోహీ... ఫో... నా కళ్లెదుట నుంచి...” రెండడుగులు వేసిన రమేష్‌ను “ఆగు!” అంటూ సమీపించాడు అఖిల్.

రమేష్ పాకెట్‌లోంచి సెల్ తీస్కోని, “ఇక ఫో... మళ్లీ ఏ మాత్రం తోక జాడించటానికి ప్రయత్నించినా బతకనివ్వను.”

“నన్ను కాస్త సిటీ వరకు దింపు, నా మొబైల్ కూడా కావాలి. నావైపు నుంచి ఏ ప్రాబ్లమ్ రాదు...” బతిమాలుతున్నట్లు అడిగేడు రమేష్.

“నీకు సిటీకి ఈ కాస్త దూరం పోవటం కష్టం! జీవితంలో... ఇన్నేళ్లు ఎలా గడిపిందనుకున్నావురా ఆవిడ? నడిసముద్రంలో వదిలి పోయావ్! ఫోఫో! నా ఎదుట నుంచి” అఖిల్ వెనుతిరిగి నుంచున్నాడు.

పడుతూ లేస్తూ రమేష్ దగ్గరకొచ్చి నిలబడిన జయరాంను “నీ మొబైల్ ఇలా ఇవ్వరా” అన్నాడు అఖిల్ చెయ్యి చాపి. అయిష్టంగానే వున్నా కంగారుగా సెల్ ఇచ్చేసి దూరంగా వెళ్లిపోయాడు.

“ఇపుడు పొండిరా... ఈ అడవిలోంచి నడుచుకొంటూ” అని కారెక్కి వెనక సీట్లో కూర్చున్నాడు అఖిల్.

ఒక్కక్షణం మౌనం వహించిన అతడు, “బావా నువ్వు డ్రైవ్ చెయ్యగలవా? ఏం తీస్కో లేదుగా?” అడిగేడు వర్మను.

పెద్దగా వికటాట్టహాసం చేశాడు వర్మ “అయామ్ ఏ గుడ్ బాయ్ నౌ” అంటూ.

“నాకు కొంచెం రెస్ట్ కావాలి అందుకని” అంటూ తరుణ్‌ను ఒళ్లోకి తీస్కోని కూర్చున్నాడతడు. ‘పాపం ఎంత భయపడిపోయివుంటాడో!’ అనుకొంటూ. ‘తనకే ఇంత బాధగా వుంది. ఇక చందన ఎంత







కలవరపడిపోతోందో అనిపించిందతడికి.

ఆ తల్లీబిడ్డలను కలపాలని ఆరాటపడు తోంది అతడి మనసు! వర్మ కారును న్యూఢిల్లీవైపు వేగంగా పరిగెత్తిస్తున్నాడు.

★ ★ ★

తరుణ్‌తో హాస్పిటల్ గదిలోకి అఖిల్ ప్రవేశించేసరికి తూర్పువెలుగులు పరుచు కుంటున్నాయి. ధృవతార ఇంకా ప్రకాశి స్తూనే వుంది. అలికిడికి ఉలిక్కిపడి లేచిన కల్పన ఒక్కపరుగున ఎదురొచ్చింది. అఖిల్ భుజంపై నిద్రపోతున్న తరుణ్‌ను చూసి "ఏమైంది తరుణ్‌కు? ఈజ్ హీ ఓకే? " అని కంగారుగా అడిగింది.

"బాగానే వున్నాడు. కానీ షాక్‌కు గుర య్యాడంతే. ఎక్కడ పడుకోబెట్టనూ? " చుట్టూ చూస్తూ అడిగేడు.

తటాలున లేచిన చందన చుట్టూ అయోమయంగా చూసి "తరుణ్... తరుణ్ ఎక్కడ? " అంటూ మంచంమీది నుంచి దిగే ప్రయత్నం చేస్తుండగా, వేగంగా సమీపించాడు అఖిల్.

"ఇదుగో మీ తరుణ్! క్షేమంగా వున్నాడు" అంటూ నెమ్మదిగా ఆమె పక్కన పడుకోబెట్టాడు.

"బాబూ... తరుణ్..." అంటూ కుదిపేస్తున్న చందనవైపు నిస్సహాయంగా చూశాడు అఖిల్.

మెలకువ వచ్చిన తరుణ్ గాభరాగా లేచి "వద్దు, వద్దు, కొట్టొద్దు" అంటూ అరవటం మొదలుపెట్టాడు.

ఏడుస్తూ తరుణ్‌ను దగ్గరకు తీస్కోబోయిన చందనను పట్టుకొంది కల్పన. గది బయట వున్న కుర్చీలో కూర్చుండిపోయాడు వర్మ, ఆమెను ఫేస్ చెయ్యలేక.

"మీరు కొంచెం ఆగుతారా!" చందనను వారించాడు అఖిల్. తరుణ్‌ను లేవనెత్తి గుండెకు హత్తుకున్నాడు అఖిల్. నెమ్మదిగా అతడి తల నిమురుతూ "తరూ... నేనమ్మా... ఇలా చూడు" అని పదేపదే చెప్పేక కళ్ళు తెరిచి నెమ్మదిగా అఖిల్ ముఖంలోకి చూశాడు తరుణ్.

అంతే, రెండు చేతుల్తో అతడిని చుట్టేసి "నన్ను నీతో తీస్కుపో అంకుల్!" అంటూ ఏడవసాగాడు.

నెమ్మదిగా మంచంపై నుంచి లేచి అఖిల్‌కు దగ్గరగా వచ్చింది చందన. "మళ్ళీ తరుణ్ కనిపిస్తాడనుకోలేదు" అంది ఆమె.

"నాన్నా... ఒక్కసారి నా దగ్గరకు రామ్మా!" తరుణ్‌ను తీస్కోబోయింది.

"నో... నేను రాను" తీవ్రంగా ప్రతిఘటించేడు తరుణ్.

"నేను అంకుల్ దగ్గరే వుంటా... వాళ్ళు వెరీబ్యాడ్.. నన్ను మళ్ళీ తీస్కుపోతారు" తరుణ్ వెక్కుతూ అఖిల్‌ను మరింత గట్టిగా పట్టుకున్నాడు. గడచిన భయంకర అనుభవం తలుచుకొన్నకొద్దీ అతడి శరీరం చిగురుటాకులా కంపిస్తోంది.

కల్పనవచ్చి చందనను వారించింది, "కాస్సేపైతే తనే వస్తాడు బాధపడకు".

"లేదు కల్పనా... వాడి ఆలోచనే కరెక్ట్ నేను ఇక రక్షణనివ్వలేను.. ఇవ్వలేను.." దోసిలిలో ముఖం దాచుకొని దుఃఖిస్తున్న చందనవైపు నిస్సహాయంగా చూశాడు అఖిల్. "ఆమెను ఓదార్చగల చనువు లేదు తనకు" బాధగా అనుకున్నాడు.

వర్మ దగ్గరకు వెళ్ళింది కల్పన. అతడికి 'థాంక్స్' చెప్పాలని. అతడి చెయ్యిపట్టుకు "థాంక్సండీ... తరుణ్‌ను తెచ్చి దాని ప్రాణం కాపాడారు" అంది చెమర్చిన కళ్ళతో. వర్మ మనసు ఆనందంతో ఉప్పొంగిపోయింది. నెమ్మదిగా ఆమెను దగ్గరగా తీస్కున్నాడు "థాంక్యూ.." అంటూ.

★ ★ ★

దుఃఖాన్ని అదుపు చేస్కొంటూ "అఖిల్ గారూ... తరుణ్‌ను మీకే అప్పగించేస్తున్నాను, ఇక నాకీ బాధలు భరించే శక్తి

లేదు..." అంటున్న చందనకు కళ్లు తిరిగినట్టైంది. తూలిపడబోతున్న చందనను, ఒక చేతిలో తరుణ్ వుండటంతో, రెండోచేత్తో పట్టి ఆపబోయాడు. ఆమె కిందకు జారిపోకుండా ఆపలేని అతడు తప్పనిసరిగా ఆమెను దగ్గరకు హత్తుకోవలసి వచ్చింది.

ఒక్కసారిగా స్పృహలోనికి వచ్చిన చందన విడిపించుకొనే ప్రయత్నం చేయబోయింది కంగారుగా.

"ఆగండీ..." అంటూ ఆమెను నెమ్మదిగా బెడ్‌పై కూర్చోబెట్టి, కల్పన కోసం చూశాడతడు. ఆమె కనిపించలేదు.

"కొంచెం ప్రశాంతంగా పడుకోండి కాసేపు... ప్లీజ్.. అప్‌సెట్ కాకండి..." అన్నాడు అఖిల్ అనునయంగా.

"కాదు... అఖిల్‌గారూ... రియల్లీ ఐ మీనిట్... ఇక తరుణ్‌ను మీ దగ్గరే వదిలేస్తాను. వాడిక్కూడా మీరేకావాలి... నేను అక్కర్లేదు..." కళ్ళు ఒత్తుకొంది చందన.

"ఓహ్... తరుణ్‌ను అయితే నాకిచ్చేస్తారు... మరి మిమ్మల్నెవరికిచ్చేస్తారూ?" అడిగాడు అఖిల్. ఉలిక్కిపడి అతడి ముఖంలోకి చూసిందామె.

అతడి కళ్లలో భావం ఆమె మనసును తాకింది సున్నితంగా. "ఈ చందనను హృదయంలో పదిలపరుచుకోవాలనుకుంటున్న మనసు గురించి ఆలోచించు" కల్పన మాటలు చెవులలో మారుమోగిపోతుండగా, అతడి చూపులనుంచి తప్పించుకొని చటుక్కున తలవంచుకొంది ఆమె. ఆమె హృదయంలో ఒక స్పందన!

"చందూ..." అతడి పిలుపు ఆ స్పందనకు ప్రాణం పోసింది. నెమ్మదిగా తలెత్తి అతడి ముఖంలోకి చూసింది చందన.

అఖిల్ కళ్లు 'ఆహ్వానం' పలుకుతున్నాయి అతడి జీవితంలోనికి!

అప్రయత్నంగా చెయ్యి ముందుకు చాపేడు అఖిల్. "మమ్మీ... నువ్వు వచ్చేయి అంకుల్ ఇంటికి..." అఖిల్ దగ్గర్నుంచి దిగి వచ్చి తల్లి చెయ్యి పట్టుకుని లాగుతూ అన్నాడు తరుణ్.

అఖిల్ ఆహ్వానం! తరుణ్ అభ్యర్థన!

ఆమెలో ఒక అలజడి!!

"చందూ... ప్లీజ్..." మళ్లీ అదే పిలుపు. ఆమె మనసు ఉలిక్కిపడింది.

జీవితంలో క్రూరమృగాల్లాంటి మనుషుల వికారాల తాకిడితో బండగా మారిన ఆమె మనసు, చల్లగాలి తాకిన మేఘంలా కరిగి వర్షించసాగింది ఆ పిలుపుతో. తడబడుతూ కంపిస్తున్న చేతిని ముందుకు చాచింది చందన తలవాల్చి.

ఆ చేతిని సున్నితంగా అందుకున్నాడు అఖిల్. చేతికి అందిన అపురూపమైన వస్తువు ఎక్కడ జారిపోతుందోనన్న తహతహ అతడి స్పర్శలో!

"అంకుల్! మమ్మీని, నన్ను మీ ఇంటికి తీస్కుపోండి!" జరిగిన భయంకర సంఘటనను తల్చుకుని చిగురుటాకులా వణుకుతూ అంటున్న తరుణ్‌ను దగ్గరకు తీస్కున్నాడు అఖిల్. ఒక చెయ్యి అఖిల్ అందుకోగా, రెండో చెయ్యి తరుణ్ చేతిలో ఉండటంతో లేచి వారిని చేరింది చందన.

మండుటెండలో పరుగు తీసి తీసి, చల్లని నీడలో సేదతీరినంత హాయిగా ఉంది అతడికి!

'మనసును దోచుకున్న ఈ ఇద్దర్నీ తన హృదయంలో పదిలంగా దాచుకోవాలి!'

చందన చేతిని మరింత పదిలంగా పట్టుకున్నాడతడు. ఆ దృశ్యం చూస్తున్న కల్పన, వర్మల కళ్లు ఆనందంతో మెరిసాయి.

బంధాలకు ఎన్నో పేర్లుంటాయి! వాటికి నిర్వచనాలు ఉంటాయి!! కాని ఏ నిర్వచనానికీ అందని కొన్ని అనుబంధాలు కొందరిని ఒక్కటిగా బంధిస్తాయి! అటువంటి అనిర్వచనీయ బంధం ఆ మూడు మనసులనూ ఒకటిగా పెనవేసింది!







అపార్ట్‌మెంటాలజీ 20

# 'లై' డిటెక్టర్

■ యర్రంశెట్టి శాయి



చాలా పవర్‌ఫుల్ బాంబ్ పేలినట్లు పేలిందా వార్త మా అపార్ట్‌మెంట్స్‌లో! ముఖ్యంగా మగాళ్ళంతా ఆ షాక్‌నుంచి తేరుకునే సరికి చాలా టైమ్ పట్టింది. కొంతమందయితే వార్త పేలి 72 గంటలయినా ఇంకా షాక్ నుంచి తేరుకోలేదు. ముఖ్యంగా విజయ్‌యాదవ్! ఎవరయినా పలుకరిస్తే చాలు బెదిరిపోతున్నాడు.

ఆ వార్తవల్ల అపార్ట్‌మెంట్స్‌లో మగాళ్లందరూ ఎంతో కొంత గాయాలపాలయినప్పటికీ, బయటకు మాత్రం ఆ విషయం ఎవరికీ తెలీకుండా చాలా నార్మల్‌గా కనబడటానికి తెగ ప్రయత్నాలు చేస్తున్నారు.

ఎప్పుడూ లేంది మా సొసైటీ ప్రెసిడెంట్ హమీద్‌మియా సినిమా ట్యూన్స్ హమ్మింగ్ చేయటం మొదలుపెట్టాడు.

కల్చరల్ సెక్రటరి శంకరమూర్తి ఉండుండి మా మీటింగ్ ప్లేస్‌కొచ్చి కాలు గాలిన పిల్లిలా పచార్లు చేస్తున్నాడు.

ఇక కృష్ణమూర్తి సంగతి సరేసరి- 'జీవితమంతా మిథ్య' అంటూ ఆధ్యాత్మిక గురువు లెవల్లో ఫోజులిస్తున్నాడు.

ఇంతకూ ఆ వార్తేమిటంటే మా అపార్ట్‌మెంట్స్ తాలూకా లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ షైనీ తమ సభ్యుల కోసం 'లై'డిటెక్టర్ కొనబోతోంది. వెంటనే మా ఆఫీస్ బేరర్స్ అందరినీ పిలిచి అర్జంటుగా మీటింగ్ ఏర్పాటు చేశాడు హమీద్‌మియా.

అది సీక్రెట్ మీటింగ్ అవడంతో తనింట్లోనే ఏర్పాటు చేశాడు.

"భాయియో ఔర్ బెహనో" అనగానే విజయ్‌యాదవ్ అడ్డుతగిలాడు-

"ఇక్కడ 'బెహనా' ఎవ్వరూ లేరు"

"సారీ- సారీ- భాయియో! మన మగజెంటిల్మెన్‌కు చాలా ప్రాబ్లెమ్‌లు ఉన్నయ్! క్యోంకి- షైనీ మన అపార్ట్‌మెంట్స్‌లో లేడీస్ గురించి లైడిటెక్టర్ కొంటున్నయ్. మన అపార్ట్‌మెంట్స్‌లో లేడీస్ అన్నీ ఆ లైడిటెక్టర్‌ని యూజ్ చేస్తయ్. అలా యూజ్ చేస్తే మనందరికీ ప్రాబ్లమ్స్ వస్తయ్- ఇసీలియే- అపన్ సబ్‌లోగ్- ఏదోకటి చేసి ఆ లైడిటెక్టర్‌ని మన అపార్ట్‌మెంట్స్‌కి రాకుండా చేయాలె!"

కొందరు హమీద్‌మియా వేపు అనుమానంగా చూశారు.

"లై డిటెక్టర్ కొంటే మనకేం ప్రాబ్లెమ్స్ వస్తయ్?" డౌటుగా అడిగాడు మొహిందర్‌సింగ్.

పక్కనే ఉన్న విజయ్‌యాదవ్ అతని భుజం తట్టాడు.

"కొంచెం బ్రెయిన్ ఉపయోగించు బ్రదరూ! అఫ్‌కోర్స్ అది నీకుంటేనే"

"అంటే నీ ఉద్దేశ్యం.." కోపంగా అడిగాడు మొహిందర్-

"లేకపోతే ఏంటి? నువ్ మీ ఆవిడకి రోజుకో కథ చెప్పి మందు కొడతానికెళ్తాం టావ్ కదా! మీ ఆవిడ ఆ లైడిటెక్టర్ నీకు తగిలించి 'ఎక్కడికెళ్తున్నారు?' అనడిగిందనుకో- నువ్ అలవాటు ప్రకారం 'మా కజిన్ లోక్‌సింగ్ దగ్గర కెళ్ళొచ్చా! వాడికి ఒంట్లో బాగోలేదని తెలిసింది' అని ఏదో నోటికొచ్చిన అబద్ధం చెప్పావనుకో.. వెంటనే లై డిటెక్టర్ 'నువ్ చెప్పేదంతా అబద్ధం' అని ఇండికేట్ చేస్తూ పెద్ద సైరన్ మోగిస్తుంది. దాంతో మీ ఆవిడ నీ కాలర్ పట్టుకుంటుంది. ఈ సీన్ ఒక్కసారి విజువలైజ్‌చేసి చూసుకో"

మొహిందర్‌సింగ్ సీన్ గాల్లోకి చూసి గావుకేకపెట్టాడు.

"ఓర్నాయనో! ఆ మిషన్ చాలా డేంజరస్" అన్నాడు గాబరాగా.

"కానీ ఆ మిషన్ ఫ్లైని కొనబోతోన్నప్పుడు మనం ఎలా అడ్డుకోగలుగుతాం?" అడిగాడు శంకరమూర్తి.

"అదే మనం ఇప్పుడు డిస్కస్ చేస్తయ్" అన్నాడు హమీద్‌మియా.

బోసు అనుమానంగా లేచాడు.

"అంటే- నేను ప్రతినెలా నా జీతంలో వెయ్యి రూపాయలు సీక్రెట్‌గా మా నాన్నకి పంపిస్తున్న విషయం మా మిసెస్‌కి తెలిసిపోతుందంటారా?" అడిగాడతను.

"అవును బ్రదరూ! ఆ సీన్ నువ్వో ఒకసారి గాల్లోవేసి చూసుకో- ఒకటో తారీఖు జీతం తీసుకొచ్చి మీ మిసెస్‌కిస్తావ్- ఆవిడ లెక్క బెడుతుంది. 'ఏంటి పన్నెండొందలు తక్కువుంది?' అనడుగుతుంది.

'అదా- అదీ- ఆ- ఇన్‌కమ్‌టాక్స్ కట్ చేశార్లే-' అనగానే మిషన్ పెద్దఎత్తున సైరన్ మోగుతుంది- అది లై డిటెక్టర్ సైరన్ అన్నమాట? దాంతో మీ మిసెస్ నీ పీక పట్టుకుంటుంది.

'నిజం చెప్పండి! ఆ డబ్బు ఏంచేశారు?' అని నిలదీస్తుంది. అప్పుడు మీరు దిక్కులేక ఇంకో అబద్ధం చెప్పేస్తారు.

'సంగతేంటంటే మా ఫ్రెండ్ రంగారావ్ అప్పడిగాడు. అందుకని ఇచ్చాను' అంటావ్. లై డిటెక్టర్ మళ్ళీ సైరన్ మోగిస్తుంది. ఇలా నాలుగయిదుసార్లు అబద్ధాలు చెప్పాక చివరకు నిజం ఒప్పుకోకతప్పదు. 'నిజం ఏమిటంటే- మా నాన్న డబ్బు కావాలని ఫోన్ చేశారు- అందుకని పంపాను' అంటారు. అప్పుడు మిషన్ సైలెంట్‌గా ఊరుకుంటుంది.

తమాషా ఏంటంటే అక్కడితో మిషన్ నిన్ను వదిలేస్తుందిగానీ మీ మిసెస్ నిన్ను వదలదు.

'ఇలా ఎంతకాలం నుంచి సాగుతోంది?' అంటుంది అనుమానంగా.

'ఛ- ఎంతకాలం నుంచేమిటే? ఇదే మొదటిసారి' అంటారు! అనగానే మళ్ళీ సైరన్ మోగుతుంది."

బోస్ గాబరా పడిపోయాడు.

"వద్దు! చెప్పకు- వినడానికే భయంగా ఉందా పరిస్థితి..."

"అయితే ఇప్పుడర్థమయిందా- లై డిటెక్టర్ మనకెంత ప్రమాదమో"

"చాలా ప్రమాదం! ఎంత ప్రమాదమంటే పచ్చని సంసారాలు కూలిపోతయ్" ఒప్పుకున్నాడు బోసు.

"అంతేకాదు! మన అపార్ట్‌మెంట్స్‌లో



కొంతమంది జైలుకి భీ పోతయ్" ఇంకా భయపెట్టాడు హమీద్‌మియా.

ఆ డైలాగ్‌తో అందరూ టెర్రరైజ్ అయిపోయారు.

"అదేంటి? జైలుకెందుకెళ్తాం?" అడిగాడు కృష్ణమూర్తి భయపడుతూనే.

"ఎందుకేంటి? ఒక ఇమేజినేషన్ సీనేసుకో- D-302 లో ఉండే టీచర్ రూపాదేవికి సంతకం పెట్టకుండా లవ్‌లెటర్ ఎవడు రాస్తున్నాడో ఇంతవరకూ ఎవరికీ తెలీదు- ఒకవేళ ఆ ఇద్దరు ముగ్గురు అనుమానితుల్నీ- వాళ్ళ భార్యలు లై డిటెక్టర్‌కి తగిలించారనుకో! ఎవడోకడు దొరక్క తప్పదు- దొరికాక జైలుకెళ్ళకా తప్పదు"

ఇమేజిన్ చేసుకుంటూనే కృష్ణమూర్తి వణికిపోవటం మేమంతా గమనించాం! మా అనుమానం నిజమయింది. ఆ పని చేసింది కచ్చితంగా వాడే అయ్యుంటాడు.

"అలాగే షైనీ ఇంటిముందు ఆ అమ్మాయి ప్రతి బర్త్‌డేకి గులాబీపువ్వు పెట్టేవాడిని కూడా ఆ లైడిటెక్టర్ సాయంతో పట్టేస్తుంది" అన్నాడు విజయ్ యాదవ్.

కృష్ణమూర్తి ఇంకా బెదిరిపోయాడు.

"ఇంతకూ ఇప్పుడేం చేద్దామంటారు మరి? ముందు మన ఫ్యూచర్ కోర్స్ ఆఫ్ యాక్షన్ డిసైడ్ చేయండి" అసహనంగా అన్నాడు శంకరమూర్తి.

అందరికంటే శంకరమూర్తికి ఎక్కువ భయంగా ఉంది. ఆ లై డిటెక్టర్ వస్తే తను రోజూ ఆఫీస్‌లో సిగరెట్లు తాగుతున్న విషయం భార్యకు తెలిసిపోతుంది. అడపాదడపా ఫ్రెండ్స్‌తో కలసి మందు పార్టీల్లో కూర్చుంటున్న సంగతీ బయటపడిపోతుంది. ఒకరకంగా చెప్పాలంటే సంసారం నరకమయిపోతుంది.

"మనం ఎవ్వరం ఏం చెప్పినా ఆ షైనీ వినిపించుకునే టైప్‌కాదు. అసలే హెడ్‌స్ట్రాంగ్ కాండిడేట్! పైగా మగాళ్ళమీద ఒకలాంటి ద్వేషం! దానికి తగ్గట్లు విమన్స్ విజ్‌లో యాక్టివ్ మెంబర్" అన్నాడు మొహిందర్‌సింగ్.

"ఎవరయినా మంచి అయిడియాలుంటే చెప్పండి. ఏదొక ప్లాన్ చేసి ఆ మిషన్ మన అపార్ట్‌మెంట్స్‌కి రాకుండా చూడాలి" అన్నాడు విజయ్‌యాదవ్.

అందరూ తెగ ఆలోచించారుగాని ఎవరికీ ఏమీ తట్టటంలేదు.

"ఆ మిషన్ రాకుండా ఆపటం మనవల్ల కాదు బాసూ! కాకపోతే దానిబారి నుండి తప్పించుకోడానికి ఉపాయాలు ఆలోచించటం బెటరు" అన్నాడు కృష్ణమూర్తి.

హఠాత్తుగా శంకరమూర్తి లేచాడు.

"మనం అనవసరంగా ఓవర్ రియాక్ట్ అవుతున్నామేమో అనిపిస్తోంది నాకు?"

"అంటే?" అర్థంకాక అడిగాడు రెడ్డి.

"అదే- ఆ లై డిటెక్టర్ అనేది లీగల్‌గా, సైంటిఫిక్‌గా ప్రూవ్ అయిన మిషన్ కాదు. అది సెంట్ పర్సెంట్ పనిచేస్తుందన్న గ్యారంటి కూడా లేదు. కోర్టులో కూడా దాన్ని రుజువుగా గానీ, సాక్ష్యంగా గానీ వప్పుకోరు. అలాంటప్పుడు మనం మాత్రం ఎలా యాక్సెప్ట్ చేస్తాం?!"

అందరికీ ఆ పాయింట్ నచ్చింది.

కొంతమంది తప్పట్లు కొట్టారు.

"యా! శంకరమూర్తి నిజంగా జీనియస్! అందుకే ఫాక్ట్స్‌ని తవ్వి బయటకు తీశారు. కోర్టు ఒప్పుకోనిదే ఎవరుమాత్రం స్టాండర్డ్‌గా తీసుకుంటారు? కనుక ఆ మిషన్ మనకు వ్యతిరేకంగా సైరన్ మోగించినా మనం టోటల్‌గా రెఫ్యూజ్ చేయవచ్చు" అన్నాడు మొహిందర్‌సింగ్. హమీద్ మియా తల గోక్కున్నాడు.

"మా మాట నిజమే ఉన్నాయ్? లేకిన్- మన లేడీస్ మనమాట నమ్మయ్! అవి ఆ మిషన్‌నే నమ్ముతయ్"

ఆ డైలాగ్‌తో అందరూ మళ్ళీ నిరుత్సాహపడిపోయారు. రాత్రి పదింటివరకూ మీటింగ్ జరిగిందిగానీ ఏమాత్రం ఉపయోగం లేకుండా పోయింది.

"ఇప్పుడింక చేయగలిగిందేమీ లేదు. ఆ మిషన్‌ని రానీండి! వచ్చాక అప్పటి పరిస్థితుల్ని బట్టి ఆలోచిద్దాం" అన్నాడు రెడ్డి.

అక్కడితో అందరూ డిస్పర్స్ అయ్యారు. మరో రెండురోజుల్లో లై డిటెక్టర్‌ని రామ్‌భరోసా అపార్ట్‌మెంట్ సొసైటీ లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ షైనీ కొనబోతోందన్న విషయం అపార్ట్‌మెంట్స్‌లో ఉన్న లేడీస్ అందరికీ ఎక్కడలేని సంతోషాన్నీ కలిగించింది. ఆ విషయం వాళ్ల మొఖాలు చూస్తేనే తెలిసిపోతోంది.

"ఈ మగాళ్ళు ఎంత చీట్స్ అంటే- వాళ్ళు అబద్ధం చెప్పని విషయం అంటూ ఏమీ ఉండదే! రాత్రి లేటుగా ఇంటికొస్తారు కదా? ఏమిటింత లేటుగా వచ్చారని అడిగితే అబద్ధం! ఆ సెల్‌ఫోన్లో ఇందాక ఎవర్తో మాట్లాడుతున్నారు అనడిగితే అబద్ధం! ఇవాళ మందుకొట్టి వచ్చారు కదూ? అనడిగితే కొత్తరకం కిళ్ళీ వేసుకున్నానని అబద్ధం. పేకాటలో డబ్బుపోయిందా? చికాగ్గా ఉన్నారని అడిగితే- ఇవాళ అయిదువేలు గెలిచానని అబద్ధం! ఒకటేంటి- అసలు డిక్షనరీలో మగాడు అంటేనే అబద్ధం అని అర్థం రాయాలి" ఆవేశంగా తన చుట్టూ చేరిన లేడీస్‌తో చెప్తోంది కృష్ణవేణి.

వెంటనే మంజులత తన ఎక్స్‌పీరియెన్స్ చెప్పటం మొదలుపెట్టింది, "ఒకసారేం జరిగిందో తెలుసా? ఈమధ్య నాకు వంట్లో బాగోక హాస్పిటల్లో చేరాను కదా! ఎందుకో నేను చచ్చిపోతానేమో అని భయంవేసి మా ఆయనతో ఒక డెలికేట్ విషయం మాట్లాడాను.

'చూడండి! ఒకవేళ నేనుపోతే ఇంకో పెళ్ళి చేసుకోనని ప్రామిస్ చేయండి' అనడిగాను. 'ఛ! మనం ప్రేమించి పెళ్ళి చేసుకున్నాం కదే! ఇంకో పెళ్ళి ఎలా చేసుకోగలను చెప్పు' అని ఆయననేసరికి ఆనందం కలిగింది. 'చూడండి ఒకవేళ ఏ కారణం చేతనయినా ఇంకో పెళ్ళి చేసుకుంటే మాత్రం నా నెక్లెస్ దానికివ్వకండి! అది నా కూతురికే ఇవ్వాలి' అన్నాను.

ఆయన వెంటనే కోపంగా నావంక చూసి 'నీకేం పిచ్చా, వెర్రా! నేనసలు పెళ్లే చేసుకోనని చెప్తున్నాకదా! అదీగాక ఆ అమ్మాయికి ఆ నెక్లెస్‌లంటే ఇష్టం ఉండదు- చెయిన్ టైపే లైక్ చేస్తుంది' అన్నారాయన.

చూశారా! 'ఇంత అబద్ధాలకోరుతోనా నేను సంసారం చేస్తోంది' అని నాకు ఏడుపొచ్చింది" అంది మంజులత కన్నీళ్ళు పెట్టుకుంటూ. ఇలా అందరూ తలో ఎక్స్‌పీరియన్స్ చెప్పుకోవటం మొదలుపెట్టేసరికి వాళ్ళల్లో వాళ్ళకి సంఘీభావం తెగ పెరిగిపోయింది.

అంతవరకు 'పతియే ప్రత్యక్ష దైవం'

**లై డిటెక్టర్:**





అనుకున్న టైప్ కూడా 'మొగుడే పరోక్ష మాయల మరారి' కేటగిరీలోకి మారిపోయారు.

వాళ్ల సపోర్ట్ చూసుకుని షైనీ రెచ్చిపోయి స్పీచ్‌లివ్వటం మొదలుపెట్టింది.

"నిజానికి మగాడు మాట్లాడే ప్రతిమాట వెనుకా ఎంతో కొంత అబద్ధం దాక్కుని ఉంటుంది. ముఖ్యంగా భార్యతో చెప్పే మాటల్లో నూటికి తొంభై పాళ్ళు అబద్ధాలే! మొన్నటికి మొన్న నేనూ, మా ఫ్రెండ్ సంధ్య నగలషాప్‌కెళ్ళినప్పుడు ఒక వ్యక్తిని చూశాం. అతను ఒక ఖరీదయిన ఉంగరం తెచ్చి షాపతనికి ఇచ్చి దానిమీద అంతకు ముందు రాసిన 'చంద్రికకు ప్రేమతో' అన్న అక్షరాలు కొట్టేయించి 'రాధికకు ప్రేమతో' అన్న అక్షరాలు రాయిస్తున్నాడు. ఎంత దారుణమో చూశారా? " అందరూ ఆ సమయంలో అలాంటి మగాడికి మరణ శిక్షే ఉత్తమమన్న ధోరణితో మాట్లాడారు.

వాళ్ళ వ్యవహారమంతా మా సొసైటీ మేల్ మెంబర్స్ అంతా రహస్యంగా కనిపెడుతూనే ఉన్నారు!

"నన్నడిగితే మనందరం కలిసి వాళ్ళ మీటింగ్ దగ్గరకెళ్ళి అలాంటి కాస్ట్‌లీ మిషన్ కొనటం వృథా అని చెప్పేద్దాం! ఆ డబ్బుని అపార్ట్‌మెంట్ లేడీ మెంబర్స్‌కి ఇంకోరకంగా ఉపయోగపడే విధంగా ఖర్చు చేస్తే బాగుంటుందని సలహా ఇద్దాం!" అన్నాడు శంకరమూర్తి.

అందరికి ఆ అయిడియా నచ్చింది

వాళ్ళంతా మీటింగ్ ముగించి వస్తోంటే మేము ఏమీ తెలీనట్లు, వేరే టాపిక్ మాట్లాడుకుంటూ వాళ్ళకి ఎదురు వెళ్ళాం.

"హలో షైనీజీ! ఏమిటి? ఏదో మీటింగ్ కండక్ట్ చేసినట్లున్నారు? " అడిగాడు విజయ్‌యాదవ్.

"అదే - లై డిటెక్టర్ ఒకటి కొందామని డిసైడ్ చేశాం కదా! ఆ విషయమే డిస్కస్ చేసుకున్నాం" అంది షైనీ మా అంద రివంకా అనుమానంగా చూస్తూ.

"ఓ! లై డిటెక్టరా! నిజంగా కొంటున్నారా? " అడిగాడు శంకరమూర్తి ఆశ్చర్యం నటిస్తూ.

""నిజంగా ఏంటి? మేము మీ మగాళ్ళ లాగా అబద్ధాలకోర్లనుకున్నారా? మేము అన్నీ నిజమే మాట్లాడతాం!" అంది జూలీ.

"కానీ అంత డబ్బు పెట్టి ఆ పనికిరాని మిషన్ కొనే బదులు ఆ డబ్బుతో మన అపార్ట్‌మెంట్స్ లేడీస్ వెల్ఫేర్ అసోసియేషన్‌కి ఉపయోగపడే వస్తువులెన్నో కొనుక్కోవచ్చు! ఫరెగ్జాంపుల్ కంప్యూటర్లు, ఇంటర్నెట్, డి.టి.పి. ట్రైనింగ్ - ఇలాంటివి లేడీస్‌కి చాలా ఉపయోగపడతయ్" అన్నాడు కృష్ణమూర్తి.

షైనీ మండిపడింది.

"చూడు కృష్ణమూర్తీ! నువ్ ముందు తెలుసుకోవలసిందేంటంటే నీ ఉచిత సలహాలు ఇక్కడెవరికీ అవసరంలేదు. రెండోదేమిటంటే మా లేడీస్‌కి ఏది అవసరమో ఏది అనవసరమో మాకు తెలుసు! ఆ విషయం మీలాంటి హాఫ్ నాలెడ్జ్‌గాళ్ళ నుంచి తెలుసుకోవాల్సిన ఖర్మ మాకేం పట్టలేదు" అంటూ షార్ప్‌గా కట్ చేసేసరికి ఇంక ఎక్కువ మాట్లాడితే పరువుపోతుందని అక్కడినుంచి బయటపడ్డాం.

"అన్నట్లు ఇంకో విషయం! ఈ లై డిటెక్టర్ వస్తే మీ గుట్టంతా ఎక్కడ రట్టవుతుందో అనే భయంతో మీరంతా కూడా సీక్రెట్ మీటింగ్ పెట్టుకున్న విషయం కూడా మాకు తెలుసు. ఆ లై డిటెక్టర్‌ని మేం కొనకుండా మీ ఇంటెలిజన్స్ అంతా ఉపయోగించి అడ్డుపడాలని ప్లాన్ వేసుకున్న విషయం కూడా నాకు తెలుసు. ఎలా తెలిసింది అంటూ ఆశ్చర్యపోకండి! మా సీక్రెట్ ఏజెంట్స్ ఉన్నారు" సీబీఐ ఛీఫ్‌లా ఫోజుపెడుతూ మాట్లాడింది షైనీ!

ఇంకొక్క క్షణం కూడా అక్కడ ఉండకుండా బయటకు నడిచామందరం!

ఆ మర్నాడు లైడిటెక్టర్ రానే వచ్చింది. దాని చుట్టూ లేడీస్ మూగిపోయారు.

షైనీ వాళ్లందరికీ ఆ మిషన్ వర్కింగ్ గురించి చెప్తోంది.

"ఈ మిషన్‌కి సాధారణంగా మూడు ఇండికేషన్స్ ఉంటాయ్.

హార్ట్ రేట్‌ని బట్టి ఒక పద్ధతి, ఊపిరి పీల్చే పద్ధతిని బట్టి ఇంకోరకంగానూ, చర్మంలో మార్పుల ద్వారా మరోరకంగానూ- అవతలి వ్యక్తి అబద్ధాలాడుతున్నాడా లేదా అనే విషయం తెలుసుకోవచ్చు. ఎప్పుడు ఎవరికి తమ ఫ్యామిలీ మెంబర్స్ ఎవరయినా అబద్ధాలు చెప్తున్నారని అనిపించినా ఇక్కడికి వాళ్ళని తీసుకొస్తే- ఈ మిషన్ ద్వారా వాళ్ళ జాతకం బయటపెట్టవచ్చు" అంటూ వివరించిందామె. అందరూ హాపీగా ఫీలయ్యారు.

సరిగ్గా అప్పుడే చాముండేశ్వరి హడావుడిగా కన్నీళ్ళతో వచ్చింది.

"షైనీ! నాకు తెలుసు కచ్చితంగా అబద్ధం చెప్తున్నాడు! ఇవాళ ఎలాగయినా అతని అబద్ధం బయటపెట్టాల్సిందే" అంది ఆవేశంగా.

ఎవరికీ టాపిక్ అర్థం కాలేదు.

"ఎవరి గురించి నువ్ మాట్లాడుతోంది?" అడిగింది షైనీ.

"రమేష్ గురించి?"

"రమేష్ ఎవరు?"

"నా హజ్‌బెండ్"

"ఓ! ఏం చేశాడతను?"

"ఆర్నెల్ల క్రితం చేసిందే మళ్ళీ చేశాడు"

"ఆర్నెల్ల క్రితం ఏం చేశాడు?"

"నిన్న చేసిందే. ఆర్నెల్ల క్రితం చేశాడు"

"నిన్న- ఆర్నెల్ల క్రితం- ఈ రెండుసార్లూ ఏం చేశాడు?"

"వాళ్లాఫీసులో పనిచేసే సుచిత్రతో కలిసి ఆఫీస్ ఎగ్గొట్టి హోటల్లో కనిపించాడట




మా బంధువులకి"

"ఓ- ఎఫైరా?"

"అలాంటిదేమీ లేదని- ఏదో పార్టీకెళ్లానని అబద్ధం చెప్తున్నాడు..."

అప్పుడర్థమైంది షైనీకి.

"ఓకే ఓకే. ఇప్పుడు మనం రమేష్‌కి లైడిటెక్టర్ తగిలించి అతను చెప్పేది అబద్ధమో నిజమో తేల్చుకోవాలి. అంతేనా"

"యస్. ఇంతకాలం రమేష్ చెప్పినవన్నీ అనుమానంగా ఉన్నా నమ్మక తప్పేది కాదు. ఇప్పుడు అటో ఇటో తేలిపోవాలి" అంది చాముండేశ్వరి.

"అవును! రమేష్ సంగతి తేల్చెయ్యాలి" అంటూ అరిచారు కొంతమంది లేడీస్.

వెంటనే సెల్ తీసుకుని రమేష్‌కి ఫోన్ చేసింది చాముండేశ్వరి.

"హలో- ఎక్కడున్నావ్?" అడిగింది షార్ప్‌గా.

"ఆఫీస్‌లో- ఇంకెక్కడుంటాను?"

"హోటల్లో కూడా ఉండొచ్చుగా సుచిత్రతో"

"చాముండీ! అక్కడ పార్టీ కెళ్ళామని చెప్పాను కదా"

**(తర్వాత ఏమైంది.. వచ్చేనెల)**







కాజల్

# ఇడ్లీ, దోశ ఇష్టం

'లక్ష్మీకల్యాణం'తో తెలుగు సినీతెరను మెట్టిన ఉత్తరాది పడుచు కాజల్ అగర్వాల్. 'చందమామ', 'ఆటాడిస్తా' అంటూ పలు చిత్రాల్లో నటించినా ఈ అమ్మడుకి మంచి పేరు తెచ్చిపెడుతున్నది మాత్రం 'మగధీర'. యువరాణిగానూ, ఆధునిక యువతి గానూ కాజల్ అందరినీ మెప్పించింది. 'సరైన భోజనం, నిద్ర,, కష్టపడి పనిచేయా లన్న మనస్తత్వం' ఉంటే చాలు.. ఎవరైనా అందలాలను ఎక్కేయవచ్చు అంటున్న ఈ అమ్మని చెప్పిన అందాల విషయాలు మీకోసం...

★ ప్రతి రోజూ సూర్యోదయానికి ముందే లేస్తాను. షూటింగ్‌లు ఉన్న ప్పుడు ఏడింటికే మేకప్‌తో సహా సెట్‌లో ఉండాలి. అంటే నాలుగున్నర, ఐదు గంటలకు లేవడం తప్పనిసరి. ఉద యాన్నే గోరు వెచ్చటి నీళ్లలో నిమ్మరసం, తేనె కలుపుకుని తాగుతాను.

★ తర్వాత ముఖానికి మీగడ, పసుపు రాసుకుని ఆసనాలు, వ్యాయామాలు చేస్తాను. ఉదయం అల్పాహారానికి ఇడ్లీ, దోశలంటే ఇష్టం.

★ మధ్యలో జ్యూస్‌లు తీసుకుం టాను. మధ్యాహ్న భోజనం కాస్త కడుపు నిండేలానే తీసుకుంటాను. వీలైతే చిన్న కునుకు తీస్తాను. సాయంత్రం గ్రీన్ టీ, రెండు మూడు బిస్కెట్లు తీసుకుంటాను. రాత్రి షూటింగ్ నుంచి ఇంటికి చేరుకు

న్నాక త్వరగా భోజనం చేసేస్తాను. తర్వాతే మిగిలిన పనులు. కాస్త త్వరగానే పడుకుంటా. నిద్రకు ముందు గోరువెచ్చటి పాలు తాగుతాను. పండ్లు ఎప్పుడూ నాతోనే ఉంటాయి. కాస్త కడుపు ఖాళీగానే ఉంటుంది కాబట్టి తీరిక సమయాల్లో పండ్ల తోనే కాలక్షేపం.



★ కాల్షియం ఎక్కువగా లభించే పదార్థాలు, ఆకుకూరలు, పాలు, పళ్లు అన్నింటినీ క్రమం తప్పకుండా తీసుకోవాలి.

★ మనం ఆరోగ్యంగా ఉన్నంత కాలం కడుపులోనుంచి చెడు వాయువులు నోటి ద్వారా వెలుపలికి రావు. అందువల్ల ఆరోగ్యాన్ని సక్రమంగా చూసుకోవాలి. ఉదయం, సాయంత్రం తప్పకుండా పళ్లు తోముకోవాలి. నోటి శుభ్రత చాలా ముఖ్యం.

★ రోజుకు రెండు పూటలా స్నానం శ్రేయస్కరం. శరీరమే కాదు.. మనసు కూడా ఉల్లాసంగా ఉరకలు వేస్తుంది.

★ మనకు సరిపోయే వస్త్రాలనే వేసుకోవాలి. మంచి డ్రస్సు వేసుకున్న రోజు మన ప్రవర్తన ఎలా ఉంటుందో, ఆత్మవిశ్వాసం పాళ్లు ఎంతగా పెరుగుతుందో ఇట్టే తెలిసిపోతుంది. సీజన్ బట్టి దుస్తులను వాడాలి.

★ అతిగా మేకప్ వేసుకోకూడదు. దానివల్ల చూడ్డానికి ఎబ్బెట్టుగా ఉంటుంది. ఏదైనా సరే.. కొంచెం కొంచెం వేసుకుంటే చూసేవారికి కూడా ముద్దుగా ఉంటుంది. మరీ ముదురురంగులను వాడినా అసహ్యంగా ఉంటుంది.

★ మేకప్‌ను ఎక్కువసేపు ముఖంపై ఉంచకూడదు. నాణ్యమైన మేకప్ వస్తువులనే వాడాలి. చవకవి వాడితే సైడ్ ఎఫెక్ట్స్ ఉంటాయి.

★ రాత్రి పడుకోబోయేముందు మాయిశ్చరైజర్ రాసుకుంటాను. దీనిద్వారా ఉదయానికి ముఖంలో కాంతి ఉంటుంది.

★ ఎండనకా, వాననకా తిరుగుతుంటాం. బయట కాలుష్యం కూడా విపరీతం కాబట్టి క్లీన్సర్‌తో నిత్యం చర్మాన్ని శుభ్రం చేసుకోవాలి.

★ ముఖ వర్చస్సు తర్వాత అతివలు అతిగా జాగ్రత్తలు తీసుకోవాల్సింది జుత్తు గురించే. తైల సంస్కరణ లేని జుట్టు పొడిబారిపోయి ఉంటుంది. అందుకే అప్పుడప్పుడూ నూనె దట్టంగా పట్టించి తలారా స్నానం చేయాలి. షాంపూతో ఆపివేయకుండా కండిషనర్ వాడాలి.

★ ఇంటిపనీ.. వంట పని అంటూ చేతుల్ని మహిళలు నిర్లక్ష్యం చేస్తుంటారు. మనం ఎంత ఆరోగ్యంగా ఉన్నామో మన గోళ్లు చెబుతాయి.

★ అలాగే పాదాల రక్షణా ముఖ్యం. కొన్ని రకాల చెప్పులు వాడడం వల్ల కాళ్ల మీద మచ్చలు కనిపిస్తుంటాయి. అలాంటివాటికి దూరంగా ఉండాలి. మనకు అన్ని విధాలా సౌకర్యవంతంగా ఉండే చెప్పుల్నే వాడాలి. మడమ ఎత్తు చెప్పులకంటే మామూలు జోళ్లే మంచివేమో.

★ బయటకు వెళ్లి వచ్చిన ప్రతిసారీ కళ్లను కూడా నీళ్లతో శుభ్రపరచాలి. దీంతో కళ్లల్లో దుమ్ము ధూళి చేరినా బయటకు వచ్చేస్తుంది.

★ ఎవరికైనా మానసిక ప్రశాంతత చాలా ముఖ్యం. మనసులో మంచి భావాలను కలిగించుకోవాలి. మంచి ఆలోచనల ద్వారా ఎదుటివారిలోనూ మంచినే చూడటానికి ప్రయత్నిస్తాం.

★ ఎదుటివారిలోని లోపాల కన్నా వారిలోని మంచితనం చూడగలిగితే మనకు అనవసరంగా అసహనం రాదు. ఆరోగ్యకరంగా ప్రవర్తిస్తాం.

★ కోపం లేకపోతే ముఖంలో ప్రసన్నత కనిపిస్తుంది. ఆలోచనలూ మంచివే వస్తాయి. ఫలితం మన చుట్టూ మంచి జరుగుతుంది. దానివల్ల మనకు అదనంగా మంచే చేకూరుతుంది.

సేకరణ : **చల్లా భాగ్యలక్ష్మి**





# శ్రామికవర్గ పక్షపాతి

విష్ణుడె

భారతీయ సాహిత్యరంగంలో సమున్నత శిఖరం రవీంద్రుడు. వంగ సాహిత్యంలో ఆధునికతకు బీజం వేసింది ఆయనే. అనంతరకాలం కవులేగాక సమకాలీనులు సైతం ఆయన మార్గం అనుసరించారు. గొప్ప రచనలు వెలయించారు. అయితే రవీంద్రునిపై గౌరవం చెక్కు చెదరక, దీక్షాదక్షతలతో ఆయన నుండి విడివడి తమదైన ముద్ర ఏర్పరచుకున్న వారిలో విష్ణుడె అగ్రగణ్యుడు. 'నూతన మార్గంకోసం చిత్తశుద్ధితో నిండిన కృషి అతడి కవితల్లో వ్యక్తమవుతుంది' అని రవీంద్రుడే ఆయనను ప్రశంసించాడు. కులీన కుటుంబంలో పుట్టి, ఆంక్షల మధ్య పెరిగి, విద్యాధికుడై, మార్క్సిస్టు భావజాలంతో ఉత్తమ రచనలు సృజించిన గొప్ప సాహిత్యకారుడు విష్ణుడె. ఆయన కవితా సంపుటి స్మృతి సత్తా భవిష్యత్'కు 1971 లో జ్ఞానపీఠం లభించింది.

విష్ణు(బిష్ణు)డె 1909 జూలై 18న కోల్‌కతాలోని మాతామహుడు గిరీంద్రనాథ్ బోస్ భవంతిలో జన్మించాడు. తండ్రి అవినాశ్ చంద్రడె. తల్లి మనోహారిణీ దేవి. వీరిది సంప్రదాయ సంపన్న కుటుంబం. బాల్యంలో తరచు జ్వరం, అనారోగ్యం కారణంగా విష్ణు ఎంతో గారాబంగా పెరిగాడు. విద్యాభ్యాసం ఇంట్లోనే ఆరంభమయింది. తల్లి బెంగాలీని, తండ్రి ఇంగ్లీషును బోధించేవారు. చిన్నతనం నుంచి విష్ణుకు సంగీతం, చిత్రకళ అంటే మక్కువ. పుస్తకాలు బాగా చదివేవాడు. ఆతర్వాత మిత్రా ఇన్‌స్టిట్యూట్, సంస్కృత కళాశాలల్లో విద్యాభ్యాసం సాగించాడు. 1927లో మెట్రిక్యులేషన్ ఉత్తీర్ణుడయ్యాడు. సంస్కృత కళాశాలలో ఇంటర్మీడియట్‌లో చేరాడు. అప్పటికే రచనలు వెలువరించాడు. ప్రమథ్ చౌదరి ప్రోత్సాహం లభించింది. 'రవీంద్రుడి' శైలికి భిన్నమైన మార్గం అనుసరించాలనే నిశ్చితాభిప్రాయం అప్పుడే ఏర్పడింది. ఆంగ్ల కవుల రచనలు విస్తారంగా అధ్యయనం చేశాడు. టి.ఎస్. ఇలియట్ కవితల్ని అభిమానించేవాడు. సెయింట్ పాల్ కళాశాలలో బి.ఏ. చేశాడు. కోల్‌కతా విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ. పట్టా పొందాడు. సహాధ్యాయిని ప్రణతిరాయ్‌ని పరిణయ మాడాడు. అతడి చదువు, ఉద్యోగం అంతా కోల్‌కతాలోనే సాగింది. ఆరంభంలో రిప్పన్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకుడిగా ఉద్యోగం మొదలయింది. బోధన, సాహితీ సృజనతోపాటు అభ్యుదయ రచయితల సంఘ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనేవాడు. మార్క్సిస్టు సిద్ధాంతా




లను అధ్యయనం చేశాడు. ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమానికి చేయూతనిచ్చాడు. నాటి కమ్యూనిస్టు పార్టీని అభిమానించాడు. కార్మిక కర్షకుల, స్థితిగతులను తెలుసుకున్నాడు. 1944లో బెంగాల్ ప్రభుత్వ విద్యాశాఖలో అధ్యాపక పదవిలో చేరిన విష్ణుడె ప్రెసిడెన్సీ, సెంట్రల్, మౌలానా అజాద్ కళాశాలల్లో విధులు నిర్వహించి 1969లో పదవీ విరమణ చేశాడు.

వివిధ ప్రక్రియల్లో విలక్షణ ఇతివృత్తాలు స్వీకరించి ఉత్తమ కృతులు సృష్టించిన విష్ణుడె సాహితీ ప్రస్థానం పదేళ్లప్పుడే మొదలయింది. ప్రముఖ బాల సాహిత్య పత్రిక సందేశ్'కు తొలి

కవిత రాశాడు ఛందోబద్ధంగా. ఆ కలం ఆరు దశాబ్దాల పాటు నిరంతర యాత్ర సాగించింది. వంగ సాహిత్యంలో మైలు రాళ్ళుగా నిలిచే 48 గ్రంథాలను సృజించాడు విష్ణుడె. వీటిలో పద్యకృతులు 17, కవితా సంపుటాలు 6, వ్యాస సంపుటాలు 13, అనువాదాలు 7 ఉన్నాయి. తొలినాళ్ళలోనే ప్రగతి, విచిత్ర, కవిత, పరిచయ్, కల్లోల్‌వంటి ప్రసిద్ధ పత్రికల్లో ప్రచురితమైన అతడి కవితలు, కథలు, వ్యాసాలు సాహితీలోకాన్ని విశేషంగా ఆకర్షించాయి. రవీంద్రుని శైలికి భిన్నమైన శైలి కావడంతో అప్పటికే సుప్రసిద్ధుడైన ప్రమథ్ చౌదరీ 'విష్ణుడె' కలం పేరుతో రాస్తున్నాడేమోనని ఎందరో భావించారు. 1928-33 మధ్య రాసిన కవితలు 'ఊర్వశి, ఓ ఆర్టిమిస్' కావ్యంగా 1933లో వెలువడ్డాయి. ఊర్వశి ఒక అప్సరస. ఆర్టిమిస్ గ్రీకు దేవకన్య. ప్రేమస్వరూపాన్ని మనోహరంగా కవి ఈ కావ్యంలో చిత్రించాడు. రవీంద్రుడు కేవలం నాలుగు రోజుల వ్యవధిలో రెండు లేఖల ద్వారా స్పందించారంటే ఈ కృతి స్థాయి వ్యక్తమవుతుంది. భావనా పటిమ, శైలీ సౌందర్యం అందరినీ ఆకట్టుకుంటాయి. నల్లబజారు, దళారీ వ్యవస్థ, అక్రమార్జన, అనైతికత, కాముకత వంటి నగర జీవనంలోని చీకటి కోణాలను ఎత్తిచూపే 'చోరాబాలి' విష్ణుడె విశిష్ట స్థానాన్ని సుస్థిరం చేసింది. పదాల పోహళింపు ఆశ్చర్యజనకం. ఆయన రాజకీయ దృక్పథానికి 'పూర్వలేఖ' కావ్యం అద్దం పడుతుంది. 'అన్నిష్ట' కావ్యంలో ఆత్మావలోకనం కనిపిస్తుంది. 'నా ప్రస్థానం దీర్ఘం, మార్గం కష్టతరం / సువిశాల, సుదూర నాగరికతలు దాటుకుంటూపోవాలి' అంటాడు. 'నామ్ రేఖేచి కోమల్ గాంధార్', 'ఆలేఖ్య', తుమి శుధు పంచీశె బైశాబ్', 'స్మృతి సత్తా భవిష్యత్' 'సంవాద్ మూలత కావ్య', 'రవికరోజ్వల్ నిజదేశే' వంటి కావ్యాలు, 'ఏకుస్‌బైస్', 'బచ్చర్ సంచిస్' మొదలైన కవితా సంకలనాలు ఆయన భావ సాంద్రతకు నిలువుటద్దాలు. వీటిలో ఎన్నో ఛందో ప్రయోగాలు చేశారు. విస్తృత పరిజ్ఞానం, చిత్రకళా నైపుణ్యం, విశ్లేషణా శక్తి, విమర్శనాపటిమ, సంగీత జ్ఞానం మొదలైనవి వ్యాస సంకలనాలలో వ్యక్తమవుతాయి. ఇంగ్లిషు రచనలు కూడా సుప్రసిద్ధాలే. 'జెమినీ రాయ్', 'రుచి ఓ ప్రగతి', 'ఏలూమెలో జీవన్ ఓ శిల్పసాహిత్య', 'ఇన్ ది సన్ అండ్ రెయిన్', 'జన సాధారణేర్ రుచి', 'ఇండియా అండ్ మోడరన్' ఇత్యాదులిందుకు నిదర్శనాలు. విష్ణుడె అనువాదాలు కూడా ఉన్నత స్థాయినందుకున్నాయి. అధిక సంఖ్యలో ఇలియట్ కవితల్ని అనువదించారు. పాబ్లో నెరుడా, షేక్‌స్పియర్, ఎజ్రా పౌండ్, డాంటే, స్టీఫెన్ స్పెండర్, షెల్లీ, మావో, రాబర్ట్ బ్రౌనింగ్, ఇల్యా ఎహ్రెన్ బర్గ్, బెర్టాల్ట్ బ్రెక్ట్ వంటి ప్రముఖుల కవితల్ని బెంగాలీ పాఠకులకందించారు.

జ్ఞానపీఠ పురస్కారం అందుకున్న దీర్ఘకావ్యం 'స్మృతిసత్తా భవిష్యత్' 1963లో వెలువడినా, విష్ణుడె దీనిని 1958లోనే రాశారు. 1955-61 మధ్య ప్రపంచ పరిస్థితులు, దేశస్థితిగతులు, జీవన స్వరూపం, జీవిత పూర్ణత్వసిద్ధి, నవచైతన్య దీప్తులు, దుర్భర గ్రామీణ వాతావరణం, ఆర్థిక ప్రణాళికా వైఫల్యం తదితర అంశాలు ఇందులో చిత్రించారు. రచన ప్రతీకాత్మకంగా సాగుతుంది. వివాహానికి సకల సన్నాహాలు చేసినా వరుడు రాకపోవడమనే సన్నివేశాన్ని ఛాయా మాత్రంగా స్వీకరించి కావ్యనిర్మాణం అద్భుతంగా సాగించారు. విపత్కర పరిస్థితులకిది సంకేతం. మనిషి అస్తిత్వవేదన ద్యోతకమవుతుంది. నరకంలోనైనా వివాహం జరపడానికి కవి నిరీక్షిస్తాడు. భవిష్యత్తును భద్రపరచుకునేందుకిది సూచన. రవీంద్రుడొక కవితలో చెప్పిన వివాహ సామ్యాన్ని స్వీకరించి ఆయనపై తనకున్న గౌరవాన్ని విష్ణుడె ప్రకటించాడు. స్మృతి సత్తా భవిష్యత్ నుంచి కొన్ని పంక్తులు: "అవును, మనం గుర్తించకపోయినా నరకంలోనే వున్నాం/ నరకం దాగిన కల్యాణ మందిరంలోకి వరుడు రాడు /అయినా రాకుమార్తె, రాకుమారుడు నరక ద్వారం దగ్గర సిద్ధంగా ఉన్నారు /రాచబాటపై, స్వాగతం కోసం నిరీక్షిస్తూ/ప్రకృతి సహజత్వసిద్ధిని కోరుకుంటూ/ మనిషి మనుగడను, గౌరవాన్ని వరప్రసాదంగా ఆకాంక్షిస్తూ/ నిజమే వధూవరులే". ప్రకృతినుంచి, శ్రామికశక్తి నుంచీ బలం పుంజుకుని అస్తిత్వానికి జీవం పోయాలని ఉద్బోధిస్తాడు- "కవీ! ఎందుకీ తడబాటు? ఆశ అడుగంటలేదు/ నిజాయితీ నింపుకున్న నీ మనసుతో దర్శించు/ లక్ష్యం వైపు శలాకు ఎలా చలిస్తుందో/ తరిమెన తిరుగుతూ పరికరాలు ఎలా సృష్టిస్తుందో!" ఈ కావ్యానికి సాహిత్య అకాడమీ పురస్కృతి కూడా లభించింది.

అనారోగ్యం వెంటాడుతున్నా అవిశ్రాంతంగా రచనలు సాగించి, రవీంద్రుని తర్వాతి స్థానాన్ని అలంకరించిన విష్ణుడె 1982 డిసెంబరు 3న కోల్‌కతాలో పరమపదించారు. ఆయన యశోనామం మన సాహితీలోకంలో చిరంతనం.

**-గోవిందరాజు రామకృష్ణారావు**

#  చతుర ప్రవేశిక 

## సెప్టెంబరు- 09

సెప్టెంబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. తరుణ్ తండ్రి ఎవరు?
2. డాక్టర్ కల్పన భర్త?
3. చందనను ఆదర్శం పేరుతో పెళ్లి చేసుకుంది?
4. ఆసుపత్రిలోని పిల్లలను మాయం చేసే డాక్టర్?
5. చందనకు తరుణ్‌కు తన గుండెల్లో చోటిచ్చినవాడు?
6. అబద్ధాలభర్తలను పట్టుకునేందుకు లేడీస్ కొన్న మిషన్?
7. విష్ణుడెకు జ్ఞానపీఠ అవార్డు తెచ్చిపెట్టిన రచన?
8. లక్ష్మీకల్యాణంతో తెలుగుతెరకు పరిచయమైన నటి?
9. డి–302 లో ఉండే టీచర్?
10. అరుంధతిని చంపాలనుకున్న డ్రైవర్ పేరు?

---

పంపినవారి పేరు: ------------------------------ వయసు (   )

చిరునామా: ----------------------------------------------

----------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# సైకత శిల్పసోయగం



ప్రపంచం నలుమూలల్లోని కొందరు విదేశీ కళాకారులు రూపొందించిన ఈ అద్భుత సైకత శిల్పాలు చూపరుల్ని బాగా ఆకర్షిస్తున్నాయి.



వారెవ్వా!







CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78